# వేలుపిల్లి

సి. రామచంద్రరావు

కథలు







# వేలుపిళ్లై

సి. రామచంద్రరావు

నవోదయ పబ్లిషర్స్
ఏలూరు రోడ్ విజయవాడ 2

# ఇందులోని కథలు


నల్లతోలు

ఏనుగులరాయి

టెన్నిస్ టూర్నమెంట్

ఉద్యోగం

గాళిదేవరు

ఫాన్సీడ్రెస్ పార్టీ

వేలుపిళ్లై

# పరిచయం

సి. రామచంద్రరావుగారి కథలంటే నాకు చాలా ఇష్టం. అవి ఇంకా చాలామందికి చాలా ఇష్టం కావడానికి కనీసం ఒక శతాంశమైనా నేను కారణం కావడం నా కిప్పటికీ సంతోషం కలిగిస్తుంది.

రామచంద్రరావుగారిని చూస్తే కథలు రాసే వాడిలా, అందులోనూ తెలుగులో రాసేవాడిలా కనిపించరు. తెలుగు కథలు రాసేవారి కొక ప్రత్యేకమైన తరహా వుంటుందని నా ఉద్దేశం కాదు. అయినా, రామచంద్రరావుగారిలో కథా రచయితను చటుక్కున పోల్చుకోవడం కష్టం. తెలుగును, ఇంగ్లీషును కూడా ఇంగ్లీషు యాసతో మాట్లాడే ఆయనను టెన్నిస్ ప్లేయరనో, ఏ టీ, కాఫీ ఎస్టేట్ల మేనేజరనో పరిచయం చేస్తే తేలిగ్గా నమ్మవచ్చు. నిజానికి ఆయన ఈ రెండూ కావడమే కాక, కథా రచయిత కూడా కావడం ఒక విశేషం.

ఈ కథలలో స్థలం తెలుగుదేశం కాదు; పాత్రలు, వాతావరణం తెలుగువి కావు. అందుచేత వీటిలో తెలుగుదనం లోపించిందంటే నేనేమీ చెప్పలేను—తెలుగు వాతావరణం వుండడమే తెలుగు కథకు గొప్పదనం కాదని తప్ప. ఈ కథావస్తువులన్నీ రచయిత తనకు తెలిసిన, పరిచితమైన జీవితంలోనుంచి ఏరుకుని, పరిశీలించి, భావనచేసి

రాసినవే. అందుచేత, వీటిలో ఒక నిజాయితీ, ఒక వాస్తవికత వున్నాయి. కనుకనే, అవి సజీవంగా కదులుతున్నట్టు వుంటాయి; మనల్ని కదిలిస్తాయి. ఈ గుణ విశేషంవల్ల అవి నిస్సందేహంగా గొప్ప కథలే. అవి రాసినవాడు తెలుగువాడు కావడం మరొక విశేషం.

ఈ సంపుటిలో అన్నిటిలోకి నాకు నచ్చిన కథ ఏదంటే త్వరగా చెప్పలేను. అన్నీ అన్నిరకాలు; దేని ప్రత్యేకత దానిదే; దేని వైచిత్రి దానిదే. ఒక్కొక్క దానిలో ఒక్కొక్క విధంగా మానవ స్వభావోన్మీలనం చేయడంవల్ల ఈ కథల వైవిధ్యం పఠితలను ఎంతైనా ఆకర్షిస్తుంది. అయినా నిగ్గదీసి అడిగితే, ఈ సంపుటిలోని మొదటి కథను, దానికంటె ముందుగా చివరి కథను పేర్కొంటాను. ఆఖరికథ నాకు బాగా నచ్చడానికి కారణం వారపత్రిక పోటీలో మొదటి బహుమతి పొందినదని మాత్రమే కాదు. చదవండి, మీకే తెలుస్తుంది.

రామచంద్రరావుగారు తరుచుగా వ్రాయరు. ఒక కథకు, మరొకదానికి మధ్య చాలా వ్యవధి వుంటుంది. ఇవి మొదట్లో ఆంధ్ర వారపత్రికలో ప్రచురిత మవుతున్నప్పుడు మళ్ళీ ఆయన కథ ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూసే పాఠకులు పెక్కుమంది వుండేవారు. ఎప్పుడో బుద్ధి పుట్టినప్పుడు, తోచినప్పుడు ఆయన కథ రాస్తారు. ఉద్యోగ విధులు అడ్డురావడం దీనికి ప్రధాన కారణం కాకపోవచ్చు. ఒకసారి అడిగితే ఆయన చెప్పినట్టు జ్ఞాపకం—మంచి కథా

వస్తువు దొరికేవరకు, దాని ఎత్తుగడనుంచి ముగింపువరకు సంవిధానమంతా మనస్సులో స్పష్టంగా రూపు కట్టేవరకు తాను కథ రాయలేనని. ఇది నిజం కావచ్చు. కనుకనే, ఈ కథలలో ఇంతా మంచి శిల్పం, వైవిధ్యం సాధించారేమో ననిపిస్తుంది. ఏమైనా, ఈ సంపుటిలోని కథలన్నీ నాలుగైదేళ్ళ క్రిందట రాసినవే. ఆ తరవాత ఆయన కథ రాసినట్టు నాకు జ్ఞాపకం లేదు.

ఎందుకు రాయడంలేదు సి రా రావుగారూ ?

నండూరి రామమోహనరావు

విజయవాడ,
14-12-64



# నల్లతారాలు

బోయ్ విశాలమయిన డ్రాయింగ్ రూమ్‌లో ప్రవేశించి అణకువగా ఒక పక్కన నుంచున్నాడు. టీ ముగించి మెత్తని సోఫాలో మునిగిపోయి బి. బి. సి. రేడియో ప్రసారం వింటున్న పేట్‌రావ్ "ఏం కావాలి ?" అన్నట్టు అతనివైపు చూశాడు. ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకునే రోజుల్లో స్నేహితులు ప్రతాపరావుని 'పేట్'అని ఇంగ్లీషు సంప్రదాయంలో పిలిచేవారు. ఇండియా వచ్చిం తరవాత అది పేట్‌రావ్ అయింది.

"మాస్టర్, బాత్ రెడీ" అన్నాడు బోయ్. పడకగదికి అన్చికట్టిన స్నానాలగదికి వెళ్ళడానికి పేట్‌రావ్ లేచాడు. అప్పుడే ఇస్త్రీ చేసిన డిన్నర్ జాకెట్ పక్కమీద పరిచి వుంది. డ్రెస్సింగ్ టేబిల్ పక్క నున్న సోఫాకి ముందు పాలిష్‌చేసిన నల్లజోళ్ళూ, వాటిమీద నలుపు రంగు సాక్సూ వున్నాయి. సోఫా చేతిమీద డ్రెస్ సూటుతో వేసుకునే చొక్కా చేతులకి బంగారపు కఫ్ లింక్స్ తగిలించి వేళ్ళాడుతూంది. టేబిల్‌మీద నల్లటి 'బౌటై' వుంది.

"బోయ్!" రౌద్రంగా అరిచాడు పేట్‌రావ్.

బోయ్ పరిగెత్తుకుని వచ్చాడు.

"తెల్ల షార్క్‌స్కిన్ కోటు ఎందుకు తీశావ్?" అన్నాడు పేట్ రావ్.

ఒక్క నిముషం బోయ్ తటపటాయించాడు.

"మాస్టర్ పోయినసారి నల్ల డి. జె. వేసుకున్నారు" అన్నాడు.

"పరవాలేదు. ఇప్పుడూ అదే వేసుకుంటాను" పేట్‌రావ్ అన్నాడు.

"నిజానికి బోయ్ తప్పుకాదు" అనుకున్నాడు మనసులో. ఒక పార్టీకి నల్ల డిన్నర్ జాకెట్ వేసుకుంటే, తరవాత దానికి తెల్ల డి. జె. తీసి ఉంచమని తనే ఆదేశించాడు. అయితే ఈ పార్టీ ప్రత్యేకమైంది. బోయ్‌కి చెప్పడం మర్చిపోయాడు. అయినా అప్పుడప్పుడు ఆ మాత్రం కోప్పడ్డంలో తప్పులేదు. లేకపోతే వాడు మితిమీరిపోతాడు.

బోయ్‌కీ, పేట్‌రావ్‌కీ మధ్యవున్న అనుబంధాన్ని నిర్వచించ డం కష్టం. పేట్‌రావ్‌కి బోయ్ అంటే అపరిమితమైన అభిమానం. బోయ్ తెలుగువాడే; పేరు లోవరాజు. ఎన్నో ఏళ్ళు దొరలకింద పని చేసి బోయ్ అన్న పేరు గడించుకున్నాడు. పదిహేనేళ్ళ క్రితం హంటర్

దొర రిటైరై ఇండియానుంచి ఇంగ్లండు వెళ్ళిపోతూ పేట్‌రావ్‌కి బోయ్‌ని సిఫార్సు చేశాడు.

"పరవాలేదు, పనికొస్తాడు. ఇంగ్లీషు బాగా అర్థం అవుతుంది. కొంచెం మాట్లాడగలడు కూడా. అయితే, నీ విస్కీ ఒక కంట కని పెట్టుకో పేట్!" అని నవ్వాడు హంటర్.

ఇంగ్లీషు మాట్లాడగలిగి విస్కీమీద మక్కువ ఉండి దొరల ప్రశంస పొందగలిగిన బోయ్‌కి వెంటనే ఉద్యోగం యివ్వడానికి నిశ్చ యించుకున్నాడు పేట్‌రావ్. తను చూపించిన ఆదరణకీ, నమ్మకానికీ, అనుగుణంగా బోయ్ ప్రతి విషయంలోనూ సమర్థు డనిపించుకొన్నాడు. మాస్టర్ పొద్దున్న మేడమ్‌గది విడిచి, తన గదిలోకి వచ్చినప్పటినుంచీ ఆఫీసుకి పోయేవరకూ అన్ని అవసరాలూ బోయ్ చూస్తాడు. మాస్టరు నైట్ గౌన్, పైజమాలు విప్పడం దగ్గిరనుంచి, తలకి నూనె, ఆఫీసు బట్టలు వేసుకోడం వరకూ, ప్రతి విషయంలోనూ సాయపడతాడు. మాస్టర్ బ్రేక్ ఫాస్టకి ఏం తింటాడో వంటవాడికి చెబుతాడు. మాస్టర్‌కి ఎన్ని గంటలకి కారు తయారుగా వుండాలో డ్రైవరికి చెబుతాడు. బోయ్ లేకుండా ఒక్క రోజుకూడా తనకి గడవదేమో ననిపిస్తుంది పేట్‌రావ్‌కి అప్పుడప్పుడు. కాని ఆ తలపుని ఆట్టేసేపు నిలవనిచ్చేవాడు కాదు. లేక ఏమైపోతాడు? తనేంలోటు చేస్తున్నాడనీ? ఎప్పుడైనా పరుషంగా మాట్లాడినా, మనసులో కోపం వుండదు. పైకి కఠినంగా కనుపించక పోతే చనువు తీసుకోవడానికి ప్రయత్నిస్తాడు.

బోయ్‌కి కూడా మాస్టర్ అంటే భయమూ, భక్తీ. ఇంకా దొరల కింద పని చేస్తున్నట్టే అనిపిస్తుంది అంటాడు స్నేహితుల్తో. మాస్టరుకి దొరల అలవాట్లన్నీ వున్నాయి. డబ్బుకి వెనకా ముందూ చూసుకోడు. అడపా తడపా గసురుతూ ఉంటాడు. గసరకుండా మాస్టరేమిటి? కోపం లేని మాష్టరుకి టీవీ, ఠీవీ కూడా ఉండదనే వాడు మెకెంజీ దొరదగ్గిర

పనిచేసిన బేరరు. మెకెంజీ దొరది మెత్తని స్వభావం. పల్లెత్తుమాట ఎవర్నీ అనడు. అన్నీ లెక్క ప్రకారం చూసుకునేవాడు. పనివాళ్ళకి పైన ఏమీ దొరికేదికాదు. తక్కిన దొరల్లాగ ఈయనకూడా తాగి రెండు చీవాట్లుపెట్టి తరువాత రెండు బుడ్లూ, డబ్బూ పారెయ్యరాదా అని తన దగ్గిర వాపోయేవాడు ఆయన బేరరు.

"నేనుతప్ప ఈవాళ పార్టీకి ఒచ్చేవాళ్ళంతా తెల్లవాళ్ళే"

నల్ల డి. జే. వేసుకోడానికి ప్రత్యేక కారణం వివరించడానికి ప్రయత్నించాడు పేట్‌రావ్. ఇటువంటి విషయాలు చెప్పేటప్పుడు బోయ్ ఎంతో సన్నిహితు డనిపించేది. పేరుపెట్టి పిలవాలనిపించేది. ఏళ్ళ తరబడి అలవాటుపడ్డ సంస్కారం, ఇండియాలో పనిచేసిన ఇంగ్లీషువాళ్ళ సంస్కారం అడ్డు వచ్చేది. అప్పుడు 'బోయ్' అని పిలిచినా, గొంతు మెత్తబడేది, మార్దవం ఆవరించేది.

"ఇప్పుడిప్పుడు కొందరు తెల్లకోటూ,నల్లలాగూ వేసుకుని డాన్సులకీ. ఈవినింగ్ పార్టీలకీ వెడుతున్నారు కాని, స్వచ్ఛమైన బ్రిటిషర్ దాన్ని డి. జె. కింద లెక్కకట్టడు" అన్నాడు.

బోయ్ ముగ్ధుడై వింటున్నాడు. ఇది కొత్త విజ్ఞానం. రేపు స్నేహితుల్తో కబుర్లలో దొర్లించవచ్చు.

"ఇక్కడ ఉక్క భరించడానికి కొంత తేలిగ్గా ఉంటుందనీ, ఇండియన్ పార్టీలకి వేసుకుని వెళ్ళినా పరవాలేదనీ తెల్లదికూడా కుట్టించాను" తప్పును సమర్థించుకొంటున్న వాడిలాగా చెప్పాడు పేట్‌రావ్.

బోయ్ షార్క్‌స్కిన్ కోటుతీసి వార్డ్‌రోబ్‌లో తగిలించి వికూనా గుడ్డతో కుట్టిన నల్ల డి. జె. కోటు బయటికి తీశాడు. దాని బరువుకింద ఈ వేసంగిలో నాలుగయిదు గంటలు మగ్గవలసిందే. మనసుని అదుపులో పెట్టుకుని పేట్‌రావ్ స్నానానికి వెళ్ళాడు.

తొట్టిలో మూడువంతులు వేడినీళ్ళు పట్టి వుంచాడు బోయ్.

నీళ్ళల్లో చెయ్యిముంచి వేడిచూసుకొని తృప్తిగా తొట్టిలోకి దిగాడు పేట్ రావ్. కాళ్ళు కదలికవల్ల నీళ్ళు చేసే చిన్న శబ్దం తప్ప అంతా ప్రశాంతంగా వుంది. లేత ఆకుపచ్చ చలువరాయితో కట్టిన స్నానాలగది తెల్లని నీళ్ళ తొట్టిలో మనోహరంగా ప్రతిబింబిస్తూంది. సబ్బూ, స్పాంజ్ పెట్టడానికి ఒక చివర తొట్టికే అడ్డంగా వేసిన బల్లమీదనుంచి సిగరెట్ తీసుకుని వెలిగించాడు. శరీరం బయటా, లోపలా వెచ్చగా, సుఖంగా వుంది. అతని ఆలోచనలు రాత్రి కాక్ టైల్ పార్టీమీదికి పోయాయి.

మిస్టర్ అండ్ మిసెస్ స్టూవర్ట్, రగ్గర్ ఫుట్‌బాల్ పోటీలో గెలిచిన క్లబ్బు జట్టుకి రాత్రి ఏడూ, ఎనిమిదిన్నర గంటలమధ్య క్లబ్ బ్రిడ్జిరూమ్‌లో కాక్ టైల్ పార్టీ ఇస్తున్నారు. అతిథుల్లో తనొక్కడే ఇండియన్. రగ్గర్ జట్టులో ఇండియన్ లేనేలేడు. క్లబ్బులో ఇండియన్ మెంబర్లకి ఇది అసంతృప్తి కలిగించింది. తెల్లవాళ్ళంతా కలిసి ఇండియన్లకి చోటులేకుండా చేసేరన్నారు. "చేతకాని కబుర్లు" అనుకున్నాడు పేట్‌రావ్. ఈమధ్య వ్యాపారంలోపడి తను రగ్గర్ విషయం అట్టే పట్టించుకో పోవడంవల్ల ఇందులో నిజానిజాలు చెప్పలేడు. కాని, పదిహేనేళ్ళ క్రితం క్లబ్బులో నలుగురైదుగురు ఇండియన్ మెంబర్లకీ నిజంగా వ్యక్తిత్వంలేని రోజుల్లో తను రగ్గర్ జట్టులో వున్నాడు. అప్పటికీ ఇప్పటికీ తెల్లవాళ్ళు మనతో మంచిగా ఉండడానికి ఎంతైనా ప్రయత్నిస్తున్నారు. ఆదే సత్తువలేకుండా సెలక్షను కమిటీ అంతా బ్రిటిషర్ల పుట్ట అని నిందించడం దేనికి?

"వాళ్ళంటే మనకి అసూయ" అనుకున్నాడు అతను.

వాళ్ళతో మనం తూగలేం. ఎంత అనుకరించినా మనకీ వాళ్ళకీ సామాన్య అభిరుచులు లేవు. పూర్వం తన కాలంలో, బ్రిటిష్ పరిపాలనలో, విస్కీ-బుడ్డి దగ్గరయినా బ్రిటిషరూ, ఇండియనూ ప్రాణమిత్రులయ్యే అవకాశం వుండేది. ప్రొహిబిషన్ తరువాత అదికూడా లేదు.

అయినా, బ్రిటిషర్ మనల్ని దూరంగా ఉంచాలని చూస్తున్నాడనడం నిజం కాదు. సమాజంలో సరయిన స్థానం వున్న ఇండియన్‌కి బ్రిటిషర్ ప్రాణం పెట్టగలడు. వచ్చిన చిక్కల్లా సంస్కారం సరిపోకుండా పెద్ద ఎత్తులమీద మనసు పెట్టుకుని కూచున్న వాళ్ళకే. అదృష్టవశాత్తూ మంచి ఉద్యోగం సంపాదించి క్లబ్బు మెంబరై కూచున్న ప్రతివాడితోనూ తెల్ల వాళ్ళు భుజాలు రాసుకుని తిరగాలనడం అన్యాయం.

పేట్‌రావ్ సిగరెట్టు అయిపోయి పెదిమలు చురుక్కుమన్నాయి. మిగిలిన ముక్కని తొట్టివక్క గోడలో అతికివున్న ఏష్‌ట్రేలో పడేసి, ఎదురుగా కప్‌బోర్డులో వున్న టైంపీస్ వైపు చూశాడు. గుడ్‌లార్డ్! ఏడు అవుతూంది. తొట్టిలో నీళ్ళు బయటికి వదిలి, పైనవున్న షవర్ విప్పి తొందరగా ఒళ్ళు తడుపుకుని బయటపడ్డాడు.

పేట్‌రావ్ డిన్నర్ జాకెట్ వేసుకుని, నిలువుటద్దంలో చూసుకుని మురిసిపోయాడు. కోటు ఫేసింగ్ తళతళ మెరుస్తూంది. పాంట్ బ్రైడింగ్ సున్నితంగా వుంది. షర్టు కాలరూ, బౌటై, తీర్చిదిద్దినట్టు అమరాయి. జోళ్ళు ఎలక్ట్రిక్ దీపం వెలుగులో జిగేల్ మంటున్నాయి. తక్కువయిందల్లా, కోటు కాలరుకున్న బటన్ హోల్‌లో కార్నేషన్ పువ్వు. ఈ వెధవదేశంలో కార్నేషన్ మొక్కలు మొలవవు. ఏం చెయ్యడం? దానికి బదులు ఎర్రగులాబీని అలంకరించుకున్నాడు పేట్‌రావ్. ఇంకొకసారి అద్దంలో చూసుకుని, తృప్తిగా నవ్వుకుని, పోర్చిలోకి దారితీశాడు. యూనిఫారంలో డ్రైవరు, జాగ్వార్ కారు వెనకతలుపు తీసి పక్కగా నుంచున్నాడు. పేట్‌రావ్ లోపలికి ఎక్కి కూచుని "పోదాం" అన్నాడు, డ్రైవరు తలుపుమూసి తన సీటులో కూచున్నాడు. నల్లని, విలువైన జాగ్వార్ మార్క్ VII తళతళ మెరుస్తూ నిశ్శబ్దంగా చీకటిలోకి జారిపోయింది.

* * *

పేట్‌రావ్ వెళ్ళేసరికే బ్రిడ్జిరూమ్ జనంతో కిటకిటలాడుతూ వుంది. చాలామంది డిన్నర్ జాకెట్లలో వున్నారు. అయితే పేట్‌రావ్ అనుకున్నట్టు అంతా నల్లకోట్లలో లేరు. నల్లపాంట్‌మీద తెల్లజాకెట్లు గదిలో ఇక్కడా అక్కడా కనిపిస్తూనే వున్నాయి. లౌంజ్ సూట్లలో వచ్చినవాళ్ళూ, సాదా కోటూ పేంటులవాళ్ళూ కూడా వున్నారు. పేట్‌రావ్‌కి ఆశ్చర్యంవేసింది. మిస్టర్ స్టూవర్ట్ అతన్ని సాదరంగా ఆహ్వానించి పార్టీ కోసం అమర్చిన బార్ దగ్గరకి తీసుకు వెళ్ళాడు.

"నీ డ్రింక్ ఏమిటి పేట్ ?" అన్నాడు మిస్టర్ స్టూవర్ట్.

"విస్కీ అండ్ సోడా"

మిస్టర్ స్టూవర్ట్ విస్కీ సోడా గ్లాసులో కలిపి పేట్‌రావ్‌కి అందిచ్చాడు. ఇద్దరూ చేతుల్లో గ్లాసుల్ని పైకి ఎత్తి "చీయర్స్" చెప్పి తాగడానికి ఉపక్రమించారు.

"పేట్! నువ్వు మెక్ ఫర్ సన్స్‌ని కలుసుకోవాలి. మిస్టర్, మిసెస్ కూడా అక్స్‌ఫర్డ్ తయారీయే." మిస్టర్ స్టూవర్ట్ పేట్‌రావుని ఎనమండుగురి గుంపులోకి తీసుకువెళ్ళి పరిచయం చేశాడు. వాళ్ళు ఏదో మాట్లాడుకుంటువ్నారు. పేట్‌రావ్ రాక ఒక్క క్షణం కబుర్లని ఆపింది. తిరిగి మాటల్లో పడిపోయారు. అతనికి వాళ్ళ కబుర్లు అంతుపట్టలేదు. కొంతసేపు ఆ గుంపులోనే నుంచుని తనకి తెలిసినవాళ్ళకోసం గదంతా కలయ చూశాడు. గదిలో ఆరుగుంపుల మనుషులైనా వున్నారు. ఒక్కొక్క గుంపులో నలుగురు నుంచి ఆరుగురుదాకా వుంటారు. అంతా తెల్లవాళ్ళే. వాళ్ళందరిలోనూ తనొక్కడే ఇండియన్ వుండడం పేట్‌రావ్‌కి ఎంతో సంతృప్తి నిచ్చింది. ప్రతిగుంపులో ఇద్దరు ముగ్గురైనా తనకి బాగా తెలిసినవాళ్ళున్నారు. తనని గుర్తించినందుకు చిహ్నంగా కొంచెం నవ్వి, తలపంకించారు. వెళ్ళి ఎవరితోనైనా చేర

దానికి స్త్రీ అతను సందేహించాడు. వాళ్ళు స్వంతవిషయాలు మాట్లాడుకుంటూ వుండవచ్చు. అటువంటప్పుడు పలకరించడం మర్యాదకాదు.

పేట్‌రావ్ చేతిలో విస్కీ అయిపోయింది. ఆకాశంనుంచి ఊడిపడ్డట్టు మిస్టర్ స్టూవర్ట్ వచ్చి అన్నాడు :

"పేట్, గ్లాసు యిలా ఇయ్యి నింపితెస్తాను"

కృతజ్ఞత పూర్వకంగా పేట్‌రావ్ నవ్వాడు.

"విస్కీ తెమ్మంటావా, కాక్‌టైల్ రుచి చూస్తావా ?" అన్నాడు మిస్టర్ స్టూవర్ట్.

"విస్కీ, ప్లీజ్."

విస్కీ గ్లాసు పేట్‌రావ్‌కి అందిచ్చి, మిస్టర్ స్టూవర్ట్ జనంలో మాయమైపోయాడు. పేట్‌రావ్ దృష్టి గది గోడమీద అతికిన నోటీసు మీదికి పోయింది. "గదిలో పర్మిట్ వున్నవాళ్ళు మాత్రమే తాగవచ్చు" అతనికి నవ్వొచ్చింది. పర్మిట్ లేకుండా ఎందరు ఇక్కడ రోజూ తాగడం లేదు ? తనకిమాత్రం పర్మిట్ వుందా ? అడ్డుచెప్పేవాళ్ళెవరో ? క్లబ్బులో బ్రిటిష్ మెంబర్లందరూ ఎప్పుడో ఒకసారి తనిచ్చిన పార్టీల్లో తాగినవాళ్ళే. గవర్నమెంటు లోకంలో తనకి కావలసినంత పరపతి వుంది. అసలు తనకి పర్మిట్ లేనిసంగతి ఏ కొద్దిమందికోకాని తెలియదు. తెలిసిన నలుగురిమధ్యా అది నవ్వులాట అయిపోయింది. ఆ ప్రసక్తి వచ్చినప్పుడు "పేట్‌ని పర్మిట్ అడిగితే ప్రొహిబిషనే ఎత్తిం చేస్తాడు" అని నవ్వుతారు. తన డాక్టరు మొండిపట్టువల్ల కాని పర్మిట్ సంపాదించడం ఏమంత కష్టంకాదు. తనకి గుండెజబ్బు. "ఎక్కువగా తాగడం ప్రారంభిస్తే రెండేళ్ళల్లో చచ్చిపోతావు" అని చెప్పేడు డాక్టరు. "పోన్లే, రెండేళ్ళయినా ఆనందంగా బ్రతుకుతాను. ఇలాగ వందేళ్ళు గడిపి ఏంలాభం ?" అని నవ్వాడు తను. "ఈ ఆటలేం కుదరవు, నీకు నేను సర్టిఫికేటు యివ్వను. ఇంకే డాక్టరూ ఇవ్వకుండా చూస్తాను" అని

ప్రతిజ్ఞ పట్టేడు డాక్టరు. డాక్టరుకి తనమీదవున్న అభిమానానికి అతని మనస్సు కృతజ్ఞతతో నిండింది. పేట్‌రావ్‌కి విస్కీ, బీయర్లమీద విప రీతమైన మమకారం లేదు. నలుగుర్లో వున్నప్పుడు రుచిచూశాడు. అందుకే పర్మిట్ గురించి డాక్టరుతో రాద్ధాంతం చెయ్యలేదు. పర్మిట్ వున్నా నాలుగయిదు యూనిట్లు ఎన్నాళ్ళకి సరిపోతుంది? ఒక్క పార్టీ ఇవ్వడానికి కూడా రాదు. తనకి పర్మిట్ అక్కర్లేదు. "ఇంతమందిలో ఒంటరిగా ఆలోచనల్లో కాలం వెళ్ళబుచ్చేమన్నానే" అనిపించింది అత నికి ఒక్కసారిగా. పెళ్ళాం జ్ఞాపకం వచ్చింది. రీటా ఢిల్లీలో ఏం చేస్తుందో? అక్కతో తెల్లవాళ్ళ గురించి వాదిస్తూ వుంటుంది. రీటా, సుశీ కూడా రెండేళ్ళు తండ్రితో ఇంగ్లండులో గడిపి వచ్చారు. ఇద్దరూ పెళ్ళయేవరకూ ఒకే సమాజంలో పెరిగారు. అయినా ఇద్దరి మనః ప్రవృత్తులలోనూ ఎంత భేదం! రీటాకి ఇంగ్లీషు అలవాట్లంటే అభి మానం. సుశీకి గిట్టదు. 'రీటా ఇక్కడ వుంటే బాగుండేది' అను కున్నాడు. రీటా అంటే బ్రిటిష్ కమ్యూనిటీకి ఎంతో ఆదరం. అంద రికీ ఎంతో సహాయంగా వుంటుంది. ఈవాళ పార్టీలో రీటా వుంటే అక్కడి వాళ్ళంతా తమ చుట్టూ వుండేవారు. రీటా పంపించిన పచ్చ ళ్ళకి అభివందనాలు చెప్పేవారూ, ఇండియన్ ఫలహారాలు చేసి పంపమని కోరేవారూ, ఎంబ్రాయిడరీ డిజైన్లు అడిగేవారూ, ఏదో రోజు సాయం త్రం టెన్నిస్ ఆడడానికి ఇంటికి వస్తామని చెప్పేవారూ. పీటిలో తన కున్న ప్రజ్ఞ ప్రదర్శించడం రీటాకి సరదా. వెర్రి అంటుంది సుశీ. "తెల్లవాళ్ళకి ఇన్ని సమర్పించు కుంటున్నావుకదా నువ్వు, వాళ్ళు తిరిగి నీకు ఒక్కటయినా ఇచ్చారా?" అని అడుగుతోంది. ఇవ్వకేం, ఇచ్చారు. కాని రీటా అంత ధారాళంగా కాదు. వాళ్ళకి మన వంటలూ, వస్తువులూ అయితే కొత్తగాని, మనకి వాళ్ళవి కొత్తకాదుగా. ఇవ్వడానికి ఏమంత

వుంటుంది ? పైగా స్వదేశంనుంచి ఆరువేల మైళ్ళ పైగా ప్రయాణం చేసి, ఇటువంటి దేశంలో పని చెయ్యడానికి ఒప్పుకున్నది ఆర్జించే డబ్బు దుబారా చెయ్యడానికి కాదు. ఇక్కడి తెల్లవాళ్లు జాగ్రత్తగా డబ్బు కూడ బెట్టుకుని, కొంతకాలానికి శాశ్వతంగా ఇంగ్లండు వెళ్ళిపోడానికి తహ తహ లాడతారు. దాంట్లో తప్పేముంది ?

ఒంటరిగా నుంచోడంవల్ల పేట్‌రావ్ తలలో అన్ని విధాలైన తలపులూ తిరుగాడుతున్నాయి. ఒకమూల కుర్రకారు, రగ్గర్ ఆటగాళ్ళు గుమిగూడి కేరింతలు కొడుతూ అల్లరి చేస్తున్నారు. వాళ్ళంతా రీటా చుట్టూ తిరుగాడుతూ వుండవలసింది. "ఈ ఆకతాయి వెధవలంతా హక్కు వున్నట్టు నీతో డాన్సు చెయ్యడానికి, తగువులాడుకుంటుంటే నవ్వుతూ ఊరుకుంటారేం ?" అని రీటాని అడిగింది సుశీ ఒకసారి క్లబ్బులో డాన్సుకి వచ్చినప్పుడు. ఆనాటి సుశీ ప్రశ్న తరుచు అతని స్మృతిపథంలో చిన్న తుఫాను లేవదీస్తుంది. పెళ్ళికాని ఇంగ్లీషు కుర్ర కారుకి సందాగావుండే ఆడవాళ్ళని చూస్తే మతిపోయేమాట నిజమే. వాళ్ళకి ఈ ప్రాంతాల్లో కబుర్లాడుకోడానికి కూడా ఆడపిల్లలు దొరకరు. ఇంక రీటా వంటి అందమైంది,చమత్కారమైంది తటస్థపడితే చెప్పాలా? అయితే రీటా తెలివైంది. వాళ్ళందరినీ అదుపులోపెట్టగల సమర్థురాలు. "బ్రిటిష్ కమ్యూనిటీలో నాకున్న స్థానం రీటావల్ల కాదుగదా ?" భయంకరమైన తలపు వచ్చిందతనికి. వెంటనే మరిచిపోడానికి ప్రయత్నించాడు. ఇంటికి వెళ్ళిపోవా లనిపించింది. కాని ఇంకా ఒక్కటా కదలడం ప్రారంభించలేదు. నీరసంగా ఒకమూలచేరి కొంచెం, కొంచెం విస్కీ చప్పరించడం మొదలుపెట్టాడు.

* * *

పార్టీ ఖుషీ నిముష నిముషానికీ హెచ్చుతూంది. కొంతసేపటి క్రితం సుందర స్థాయిలో సాగుతున్న కబుర్లు, నవ్వుల్లోకీ, అరుపుల్లోకీ

దిగాయి. బల్లమీద సీసాల్లో విస్కీ, బీయర్, రమ్, షెర్రి అతివేగంగా హరించుకు పోతున్నాయి. కుర్రకారు కోలాహలం గరిష్ఠపరిమాణం అందుకుంది. పాటలు పాడేవాళ్ళు, ఆటలు ఆడేవాళ్ళు, చిలిపికజ్జాలు పెట్టుకునేవాళ్ళు, గ్లాసులు బద్దలుకొట్టేవాళ్ళు, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం అంతరించినట్టు ప్రవర్తించేవాళ్ళు. పార్టీలో కొందరు పెద్దలు ఏవగించుకున్నారు. కాని చెయ్యగలిగిందేమీ లేకపోయింది. ఇక్కడ వున్న బ్రిటిష్‌వాళ్ళని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. వాళ్ళల్లో ఈ కుర్రకారుని మినహాయించివేస్తే మిగిలేదెవరు ? పార్టీలూ, ఉత్సాహం కావాలంటే ఉన్న నలుగురూ కూడవలసిందే. ఈ చర్యల్ని చూసీచూడనట్టు మసలవలసిందే. మరీ ఏవగించుకున్న కొందరు _ భార్యలతో వచ్చిన వాళ్ళు ఏదో సాకుచెప్పి ముందు వెళ్ళిపోయారు. తక్కిన పెద్దలు ఆ పెద్ద బ్రిడ్జి రూమ్‌లో ఒకమూల ఒత్తిగిల్లి కబుర్లలో పడిపోయారు.

ఇంకొక పక్కన బ్రిటిష్ యువకులు లేని ఆనందం అనుభవిస్తున్నామని తమని తాము నమ్మించుకోడానికి, ఒకళ్ళ నొకళ్ళు ప్రోత్సహించుకుంటున్నారు. ఎవరు ఎక్కువ విస్కీ తాగగలరో పందెం కడుతున్నారు. ఒక్కగుటకలో గ్లాసుడు పానీయం ఖాళీ చెయ్యగలిగినవాడిని ముందుకు రమ్మంటున్నారు. విస్కీ, బీయర్ కలిపి తాగగల మొనగాడు వున్నాడా అని సవాల్ చేస్తున్నారు. ఈ పరీక్షల్లో గెలిచిన వాళ్ళని భుజాల మీద కెక్కించుకుని విజయగీతా లాలపిస్తున్నారు. ఆనాటి సాయంత్రం రగ్గర్ ఫుట్‌బాల్ పోటీలో అగ్రస్థాయి ఆట ఆడిన డంకన్‌హార్వీని తమాషాగా దుయ్యబడుతున్నారు. "ఇన్ని ఫ్రీ కిక్స్‌ని గోలులోకి తన్నేవే, ఈ విస్కీ బుడ్డిని తన్నగలవా ?" అని అతన్ని రెచ్చగొట్టారు. "ఓ, తప్పకుండా" మత్తులో అరమూసుకు పోతున్న కళ్ళు నులుముకుంటూ తల ఎగరేశాడు డంకన్. 'దటీస్ ది స్టఫ్, డంకన్' అందరూ చప్పట్లు కొట్టారు. డంకన్ హార్వీ విస్కీబుడ్డిని కాలిజోడుతో గోడకితన్ని

ముక్కముక్కలుగా చేసేశాడు. దూరంగా వున్న పెద్దలు మెడలు రిక్కించి ఏమిటా శబ్దం అన్నట్టు చూశారు. గుంపులో ఏం జరిగిందీ అంతుపట్టలేదు. మళ్ళీ విస్కీ గ్లాసుల్లో లీనమైపోయారు.

అకస్మాత్తుగా ఒక యువకుడికి ఇంతగోల పనికిరాదనిపించింది.

"మనం అనాగరికంగా ప్రవర్తిస్తున్నాం" అన్నాడు.

"షటప్" అని గుంపు అరిచింది.

ఆ యువకుడు ఊరుకోలేదు. పక్కనున్న బల్లమీద ఎక్కి అరిచాడు.

"లేడీస్ అండ్ జెంటిల్‌మన్__"

"లేడీస్ లేరు" అని తక్కినవాళ్ళు గోల చేశారు.

"లేడీస్ కావాలి, లేడీస్ కావాలి" అందరూ అందుకున్నారు. ఒక నిముషం ఊరుకొని మళ్ళీ ఆ యువకుడు మొదలు పెట్టాడు :

"మనం చెప్పలేనంత అనాగరికంగా ప్రవర్తిస్తున్నాం —"

"బూ(.... బూ(...." అని గొంతుకలు హేళనచేశాయి. యువకుడు మళ్ళీ అందుకున్నాడు.

"ఈ అల్లరిమాని మనం ప్రపంచ నాగరికతలో ప్రముఖస్థానం వహించిన బ్రిటిష్ యువకుల్లాగా ప్రవర్తించాలి"

"ప్రముఖస్థానం కాదు, అగ్రస్థానం" అతని మాటల్ని వాళ్ళు సరిదిద్దారు.

"సరే అగ్రస్థానం. ఇప్పుడు మీరు చెయ్యవలసిందేమిటంటే బల్లలచుట్టూ వున్న కుర్చీలమీద అల్లరి చెయ్యకుండా కూచోండి"

"బల్లల్లేవు, కుర్చీల్లేవు"

ఆ యువకుడు నవ్వేశాడు. అందరూ నవ్వేశారు.

"లేకపోవడం ఏమిటి? ఇది శవాయ్ హోటలు. అర్థం అయిందా. ప్రపంచంలోకెల్లా గొప్ప హోటలు"

"ఊఁ!" అన్నారు అందరూ.

"అంతా బల్లలచుట్టూ కూచోండి. ఇలాగ" అతను బల్లమీదనుంచి కిందికి దూకి, అక్కడ కుర్చీలూ, బల్లలూ ఊహించి గాలిలో మార్చు న్నాడు.

"బాగుంది, బాగుంది" అన్నారు అంతా.

"నేను బేరర్‌ని, శవాయ్‌లో బేరరంటే మాటలుకాదు, ఏమను కున్నారో! అక్కడ టేబిల్ దొరకడమే కష్టం; కుదురుగా కూచోక పోతే పంపించేస్తాను"

"సరే."

"ఎర్రని తివాసీలతో నిండిన లౌంజ్, దానిమీద ఖరీదైన తోలుతో కుర్చీలు, సరంబీలో అతుక్కుపోయిన లైట్లనుంచి వచ్చే మెత్తని వెల్తురు, సన్నని సంగీతం—"

"ఉబ్బెత్తు వక్షాలని ఊపుతూ. నాట్యంచేసే పిల్లమీద ఏమిటి?" అని ఒక గొంతు అరిచింది.

"పిచ్చివాగుడు వాగకు. శవాయ్ మొహం ఎప్పుడైనా చూశావా నువ్వు? చీప్‌నైట్ క్లబ్బనుకుంటున్నావా? ఇక్కడ అటువంటి వేషా లేవీ పనికిరావు"

"నా కదంతా తెలియదు. పెద్ద రొమ్ములూ, సన్నటి నడుమూ, బ్లాండ్ జుట్టూ వున్న అందగత్తె నాట్యం కావాలి" అని లేచిందా గొంతు.

అందరూ గొల్లుమని నవ్వారు. ఒకతను లేచి "సరే, నేను నాట్యం చేస్తాను" అన్నాడు. "నాకు రొమ్ములు లేవు, ఈ రెండు సీసాలనీ చొక్కాకింద పెట్టుకుంటే సరిపోతుందా?" అని కోటువిప్పి దూరంగా పారేశాడు. అందరూ సంతోషంగా అరిచారు.

"ఇది లాభంలేదు. బర్లెస్క్ కావాలి" అన్నాడు ఇంకొకడు.

"ఔను!" అందరూ ఒప్పుకున్నారు.

ఇంగ్లండు విడిచిపెట్టి ఎన్నో ఏళ్ళుగా ఇండియాలోనే వుండి పోయిన బ్రిటిష్ యువకులందరికీ ఒక్కసారి ఇంటిమీదకి మనసు పోయింది. మూగబాధ వాళ్ళని క్రుంగదీసింది. లండన్, హైడ్‌పార్క్, బిగ్‌బెన్, నెంబర్ టెన్‌డౌనింగ్ స్ట్రీట్, నైట్‌క్లబ్స్, బర్లెస్క్, పబ్స్, సినిమాలు, ఆడపిల్లలు, చక్కటి ఆడపిల్లలు శనివారం సాయంత్రం ఆఫీసులు మూసేసిన తరవాత సినిమాలకీ, నాటకాలకీ, పార్కులకీ, ఎక్కడికి పడితే అక్కడికి తమ కూడా విలాసాలకి వచ్చే ఆడపిల్లలు! తరువాత ఇల్లు, తల్లి, తండ్రి, అక్కలు, చెల్లెళ్ళు. ఆ అనుభవాల ఊహల్లో తియ్యని బాధ వాళ్ళని ఆవరించింది. వాళ్ళ కోలాహలంలో మాతృదేశంమీద మమత, వాళ్ళ ఉత్సాహంలో దీనత్వం, వాళ్ళ నవ్వుల్లో శోకపుచాలు మిళితమై వున్నాయి.

"సరే, అదంతా తర్వాత. ముందు మీరంతా కూర్చోండి. నేను షాంపైన్‌తో మీ గ్లాసులు నింపుతాను" అన్నాడు మొదటి యువకుడు.

"నేను కూడా నీకు సహాయం చేస్తాను" అని డంకన్ హార్వీ లేచాడు.

ఇద్దరూ జేబురుమాళ్ళు పైకితీసి, బల్లమీద వున్న వైన్ బుడ్లకి చుట్టి ఊహా కుర్చీల్లో కూర్చున్న యువకులకి ఉత్తుత్తి షాంపైన్ కొంచెం కొంచెం విదులుస్తున్నారు. అకస్మాత్తుగా డంకన్ హార్వీ కళ్ళు ఎడంగా కూర్చున్న పేట్‌రావ్‌మీదకి పోయాయి.

"ఇక్కడికి నల్లవాడెలా వచ్చాడు?" అని అరిచాడు. అందరి మొహాలూ పేట్‌రావ్ వైపు తిరిగాయి. అతనికి ఏం చెయ్యాలో తెలియ లేదు. డంకన్ హార్వీ బుడ్డి చేతులో పట్టుకుని అసహ్యం పుట్టిపడే కళ్ళతో పేట్‌రావ్‌ని సమీపించాడు.

"ఎవరు నువ్వు? ఎలా లోపలికి చొరబడ్డావ్?" అని గద్దించాడు.

"డంకన్...." పేటరావ్ మాటలు తడబడ్డాయి. పరిస్థితి విష మించిందని, అక్కడి వాళ్ళంతా తాగి వున్నారని గ్రహించాడతను. ఒక్క క్షణంలో యువకులంతా పేటరావ్ చుట్టూ మూగారు.

"ఇక్కణ్ణుంచి ఫో, ఈ హోటల్లో నల్లవాళ్ళకి తావులేదు" రెట్టించాడు డంకన్ హార్వీ.

"డంకన్, శవాయ్‌లో అటువంటి ఆంక్ష లేదుకదా!" పేటరావ్ తేలిగ్గా నవ్వెయ్యడానికి ప్రయత్నించాడు.

"శవాయ్ సంగతి నాకు తెలియదు. నిజానికి నేనా హోటల్లో ఒక్కసారయినా అడుగు పెట్టలేదు. కాని నిన్నిక్కడ ఒక్క నిముష మైనా వుండనివ్వను, ఫో!" అన్నాడు హార్వీ.

అక్కడి వాళ్ళలో ఒక్కడయినా శవాయ్ మొహం చూసి ఉంటాడన్న అనుమానం పేటరావ్‌కి లేదు, తను ఎన్నో పార్టీలకి ఆ హోటలుకి వెళ్ళాడు. అప్రయత్నంగా అతనిలో గర్వం పొడసూపింది.

"నే నిక్కడికి ఆహ్వానంమీద వొచ్చాను" అన్నాడు.

"ఏది ఆహ్వానం?"

అతను తీసుకురాలేదు. స్టూవర్ట్‌ని అడగమన్నాడు.

"మేం ఎవర్నీ అడగం. నీకు తాగడానికి పర్మిట్ వుందా?"

ఒకగొంతు ప్రశ్నించింది.

పేటరావ్ చిక్కులోబడ్డాడు. తాగుడు మగతలోకూడా ఎవరికో కొంత మెలకువ వున్నట్టుంది. తాగి వుండబట్టికాని లేకపోతే వాళ్ళెవ్వరూ ఇటువంటి అఘాయిత్యానికి పూనుకోరని అతనికి తెలుసును. అయినా అతనికి కోపం ఆగలేదు.

"నాకు పర్మిట్ అక్కర్లేదు" అన్నాడు.

"ఊరికే పేలకు" అని పేటరావ్ రెక్క పట్టుకుని ఈడ్చడం

ప్రారంభించాడు డంకన్ హార్వీ. పేట్‌రావ్ కొంత గింజుకున్నాడు. నలుగురూ సాయంపట్టి అతన్ని గది బయటకి నెట్టి తలుపు మూసేశారు.

ఈ విషయం విని మిస్టర్ స్టూవర్ట్ రెచ్చిపోయాడు. "బ్రిటిష్ యువకులంతా మృగాల్లాగా ప్రవర్తించారు" అన్నాడు. "నా అతిథిని అవమానపరచడానికి డంకన్‌కి ఏం అధికారం వుంది?" అని గర్జించాడు. "అంతా వెళ్ళి పేట్‌కి క్షమాపణ చెప్పుకోండి" అన్నాడు.

డంకన్ హార్వీ ముందుకువచ్చి నిలబడ్డాడు.

"మేం చెప్పం" అన్నాడు, "నల్లతోలుకి క్షమాపణ చెప్పుకో వలసిన అగత్యం మాకు లేదు"

"నల్లతోలైతేనేం ? పేట్ మీ అందరికన్నా లక్షరెట్లు మెరుగు. అతని అంతస్తు తెలిసే మాట్లాడుతున్నావా ?" మిస్టర్ స్టూవర్ట్ ఉద్రేకంలో ఊగిపోతున్నాడు.

"నీ దేశంలో నువ్వు కనీ వినీ ఎరగని సౌకర్యాలు పేట్ అక్కడ అనుభవించాడు. నా దేశంలో నువ్వు మాట్లాడడానికి తాహతు లేని మనుషులతో అతనికి స్నేహం వుంది. పేట్ ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకున్నాడు. నువ్వెప్పుడయినా ఆక్స్‌ఫర్డ్ పేరు విన్నావా ?" వ్యంగ్యంగా నవ్వాడు మిస్టర్ స్టూవర్ట్.

డంకన్ హార్వీ మరీ బిడిదేరిపోయాడు.

"అదంతా నా కనవసరం. తాగడానికి పర్మిట్ లేనివాణ్ణి నువ్వు ఎలా కాక్‌టైల్స్‌కి పిలిచావు ?" అని ప్రశ్నించాడు.

పేట్‌రావ్ ఇంట్లో తెగతాగే డంకన్ హార్వీయేనా మాట్లాడుతున్నది! మిస్టర్ సూవర్ట్ తెల్లబోయాడు. తక్కిన యువకులు హార్వీ ప్రశ్నని రెట్టించారు. మిసెస్ స్టూవర్ట్ పరిస్థితి గ్రహించింది.

"జాన్ అలిసిపోయి వున్నాడు. అతన్ని బాధపెట్టకండి. కొంచెం

విశ్రాంతి తీసుకోనివ్వండి" అని మొగుణ్ణి బయటకి తీసుకుపోయింది.

"ఉన్న తెల్లవాళ్ళం నలుగురం. నలుగుర్లోనూ పోట్లాట" అన్నారు వెనక కొందరు.

"జరిగింది తప్పేననుకో, అయితేమటుకు నల్లవాణ్ణి వెనకేసుకు వస్తూ తెల్లవాళ్ళమీద విరుచుకుపడతాడా ?" అన్నారు ఇంకొందరు.

"మనలో మనం ఎంత కొట్లాడుకున్నా నల్లవాడి విషయం వచ్చినప్పుడయినా కలిసికట్టుగా వుండాలి మరి" అన్నారు ఇంకా కొందరు.

మిసెస్ స్టూవర్ట్ మొగుణ్ణి లౌంజ్‌లో ఒక మూల కూర్చోపెట్టి హితబోధ చేసింది.

"ఈ విషయం మరిచిపోవడం ఉత్తమం" అంది.

"పేట్ మన అతిథి మేరీ!" అన్నాడు మిస్టర్ స్టూవర్ట్ కష్టంగా.

"నీ బాధ నాకు తెలుసు. కాని చెయ్యగలిగిందేమీ లేదు"

"లేకపోవడమేమిటి ?" కోపంగా లేచాడు మిస్టర్ స్టూవర్ట్.

"ఈ దున్నపోతులంతా పేట్‌కి క్షమాపణ చెప్పితేకాని ఊరుకోను"

"కుదరదు జాన్" అంది ఆవిడ.

"ఏం ?"

"డంకన్ ఎంత ఆవేశంలో వున్నాడో చూశావా ?"

"వాడికి బుద్ధి చెబుతాను"

"జాన్, నీ ఆదర్శాలు కట్టిపెట్టు. నీకు డంకన్ ముఖ్యమా ? పేట్ ముఖ్యమా ? పేట్ మంచి స్నేహితుడు, నేనూ ఒప్పుకుంటాను. కాని ఈ పరిస్థితుల్లో...."

మిస్టర్ స్టూవర్ట్ ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ ఆవిడ అంది.

"డంకన్ తాగుడుమైకంలో ఏదో చేశాడు, తప్పే. దానికింత రాద్ధాంతం దేనికి ? డంకన్‌కీ, అతని రగ్గర్‌కీ మనవాళ్ళల్లో వున్న స్థానం నీకు తెలుసుగదా ! అతనితో విరోధం పెట్టుకోడం ఇక్కడ బ్రిటిష్ కమ్యూనిటీతో పెట్టుకోడం"

"రగ్గర్, డంకన్, రగ్గర్ ! ఇంతకంటే జీవితంలో కావలసింది లేదా ?" మిస్టర్ స్టూవర్ట్ అరిచాడు.

"ఇంకొక విషయం జాన్. పేమిలా కోసమైనా నువ్వీ మొండి పట్టు మానెయ్యాలి"

మిస్టర్ స్టూవర్ట్‌కి అర్థమయింది. పేమిలా వాళ్ళ కూతురు. డంకన్ హార్వీమీద మనసు పెట్టుకుని కూచుంది. హార్వీకి ఇంకా పాతికేళ్ళు నిండ లేదు. మంచి కంపెనీలో పెద్ద ఉద్యోగం వుంది. అందం వుంది. రగ్గర్ ఆట మూలంగా బ్రిటిష్ కమ్యూనిటీలో పేరు ప్రఖ్యాతులున్నాయి. డంకన్‌హార్వీ వంటి అల్లుడికంటే ఇక్కడి బ్రిటిష్ దంపతులు కోర దగిన మంచి సంబంధం లేదు.

మిస్టర్ స్టూవర్ట్ గొంతు మూగపోయింది. తల వంచుకుని చేతి లోని విస్కీవైపు దృష్టి ప్రసరించాడు. గ్లాసు ఎత్తి ఒక్క గుటకలో నోట్లో పోసేసుకుని జేబు రుమాలుతో మూతి తుడుచుకున్నాడు.

మిసెస్ స్టూవర్ట్ కళ్ళల్లో చిరునవ్వు విజయసూచనగా తళుక్కు మంది. సోఫాలో నుంచి లేచి, ప్రేమతోనూ, సానుభూతితోనూ మిస్టర్ స్టూవర్ట్ భుజం తట్టి బుగ్గమీద అంటీ అంటనట్టు చిన్న ముద్దు పెట్టింది. తరవాత బ్రిడ్జిరూమ్‌లో యువకుల దగ్గిరకి వెళ్ళి అంది :

"జాన్‌కి కొంచెం తలనొప్పిగా వుంది, ఇక్కడికి రాలేనందుకు క్షమాపణ చెప్పమన్నాడు. మిమ్మల్ని మిగిలిన డ్రింక్ తాగేసి మజా చేసుకోమన్నాడు"

అందరికీ సందేశం అర్థమయింది. వాళ్ళ మొహాలు కళకళ లాడాయి.

"టు ది హెల్త్ ఆఫ్ మిస్టర్ అండ్ మిసెస్ స్టూవర్ట్ ?"

తృప్తిగా గ్లాసులు నింపుకుని అరిచారు.

ఎవరో గొంతెత్తి పాట ప్రారంభించారు.

"హి యీజ్ ఎ జోలీ గుడ్ ఫె....ల్లో, హి యీజ్ ఎ జోలీ గుడ్ ఫే....లో...."

అందరూ అందుకున్నారు.

బయట క్లబ్బు ఆవరణలో కారుకోసం వెతుక్కుంటున్న పేజ్ రావుని దూరంగా వినిపిస్తున్న పాట కలతపెట్టింది. తన ఇంట్లో పార్టీలు ఇచ్చినప్పుడు ఇవే గొంతుకలు, ఇదేపాట తనగురించి ఎన్నోసార్లు పాడాయి. గబగబా అడుగులు వేసుకుంటూ సాగిపోయాడు. ఎప్పటి స్థానంలో నిలబడివున్న నల్లటి విలువైన జాగ్వార్ కారు చిక్కని చీకట్లో సరిగ్గా కనిపించలేదు. దానిమీద పడి చేతికి చిన్న గాయం తగి లించుకున్నాడు. చీకటినీ, కారు రంగునీ, ముందు సీటులో గాఢంగా 'నిద్రపోతున్న' డ్రైవర్ని తిట్టుకుంటూ కార్లో ఎక్కి హారన్ వాయిం చాడు. డ్రైవర్ ఉళ్ళిపడి లేచి, సీటులోపడి నలిగివున్న టోపీ తలకి తగిలించుకుని, కారు పోనిచ్చాడు.

* * *



# ఏనుగులరాయి

కొత్త దొర వైఖరి ఇంకా తంగముత్తుకి అంతుపట్టలేదు. దొరలు తనకేమీ కొత్తగాదు. ఇరవై ఏళ్ళనుంచీ 'ప్రోస్పెక్ట్ టీ ఎస్టేటు' కండక్టరుగా పనిచేస్తున్నాడు. ఇప్పటికి ఎనమండుగురు మేనేజర్లనైనా చూశాడు. అంతా తెల్లదొరలే. అయితే వాళ్ళంతా ఒకెత్తు, సిమ్మన్సుదొర ఒకెత్తు. వచ్చి ఇంకా పట్టుమని పదిరోజులైనా కాలేదు. అప్పుడే ఎస్టేటంతా చెడతిరిగేశాడు. అన్ని విషయాలూ క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. వచ్చే ఏడాది టీ నాటబోయే స్థలంకోసం ఇప్పటినుంచీ వెతుకుతున్నాడు. మునుపటి దొరలంతా వచ్చిన నెలా రెండునెలలకి కాని కార్యరంగంలో

దూకేవారు కారు. నెల్లాళ్ళ బదిలీఅయిన దొరనుంచి ఎస్టేటు వ్యవహారాలు తెలుసుకోడంలోనూ, ఛార్జి పుచ్చుకోడంలోనూ గడిచిపోయేవి. తరవాత కొన్నాళ్ళ ఇరుగు పొరుగు మేనేజర్లని కలుసుకోడం, క్లబ్బులకి వెళ్ళిరావడం, పార్టీలూ, డాన్సులూ, ఆపైన అలసట తీర్చుకోడం. సిమ్మన్సుదొర కివేమీ పట్టినట్టులేదు. నోట్లో ఒక 'పైప్' ఉంటేచాలు. ఎండనక, వాననక ఎంతపనైనా చేసుకుపోతాడు. దొర పని సమయంలో పైపు కాల్చడం తంగముత్తుకి నచ్చలేదు. ఇంతకు ముందున్న దొరలు ఎస్టేటులో పని తనిఖీ చెయ్యడానికి వచ్చినప్పుడు సిగరెట్టు పైపు మొదలైనవేవీ కాల్చేవారుకాదు. ఒకరిద్దరు అలా చెయ్యడం తప్పని చెప్పినట్టు కూడా తంగముత్తుకి జ్ఞాపకం. సిమ్మన్సు దొర అన్నిటిలోనూ వ్యతిరేకమే. ఎస్టేటు కూలీలని నవ్వుతూ పలకరిస్తాడు. ఎప్పుడు పడితే అప్పుడు వాళ్ళగోడు వింటాడు, సానుభూతి చూపిస్తాడు. కండక్టర్లతోనూ కులాసాగా కబుర్లు చెబుతాడు. పాతదొరలు ఎప్పుడూ తంగముత్తుతో కాని, తన అసిస్టెంటుతో కాని ఎస్టేటు వ్యవహారాలు తప్ప ఇంకేమీ మాట్లాడలేదు. సిమ్మన్సు దొర కలుపుగోరుతనం తంగముత్తుని కలవరపెట్టింది. ఇలా వుంటే కూలీలనీ, కండక్టర్లనీ అదుపులో పెట్టగలడా? తంగిముత్తు అలవాటులేని ప్రతి విషయాన్నీ అనుమానంగా చూస్తాడు. కొత్త దొర ప్రవర్తన అతనికి సంతోషం కలిగించినప్పటికీ తనలో జీర్ణించిపోయిన పాత దొరల సంప్రదాయంతో సంఘర్షణపడి అతన్ని దీరాలోచనలో ముంచింది.

"కొత్తగా నాటిన టీ ఇక్కణ్ణుంచి ప్రారంభమవుతుందనుకుంటాను?"

దొర ప్రశ్న, వెనక నడుస్తున్న తంగముత్తుని తిరిగి పరిసరాల్లోకి లాగింది.

"ఔను, సార్!"

తంగముత్తు కుడిచెయ్యి అనుకోకుండా ఖాకీటోపీమీదకి పోయింది. ఎక్కువ అణకువ ప్రదర్శించేటప్పుడు కొంచెం వంగి టోపీ చివరిని కుడిచేతి మునివేళ్ళతో ముందుకు వంచి వదిలేయడం అతనికి అలవాటు.

"ఎప్పుడు నాటారు ?" సిమ్మన్సు దొర అడిగాడు.

"పోయిన ఏడాది సార్ !"

"ఎన్ని ఎకరాలు ?"

"ఇరవై సార్ !"

"వచ్చే ఏడాది ఎన్ని ఎకరాలు నాటడానికి పర్మిట్ వుంది ?"

"ఇరవై అయిదు సార్ !"

కొంతదూరం ఇద్దరూ మాట్లాడకుండా నడిచిపోయారు. ముందు దొర, వెనక తంగముత్తూ ఒకరు తెలుపూ, ఇంకొకరు నలుపూ. దొరనోట్లో పైపు వుంది. నడక తీవిగా వుంది. మాటల్లో దర్పం వుంది. తంగముత్తు నడక నమ్రత ఉట్టిపడుతూ వుంది. దొరనోట్లో నుంచి ఏమాట ఊడిపడు తుందోనని ఆదుర్దాగా కనిపెట్టుకుని వున్నాడు. ఇద్దరూ తెల్లచొక్కా, ఖాకీలాగూ, మోకాళ్ళవరకు ఖాకీ మేజోళ్ళు పాదాలకి ఇనపమేకులు కొట్టిన బూట్లూ తొడుక్కున్నారు. ఎండకి నెత్తిమీద గట్టి ఖాకీ టోపీ పెట్టుకున్నారు.

రోడ్డు ఇంకా బాగా పడలేదు. చాలామటుకు ఎస్టేటులో రోడ్లు తారు వేసినవే. మిగతావి తారువి కాకపోయినా బాగా కంకరతో దిమిశా కొట్టి వేసినవి. ఈరోడ్డు గత సంవత్సరంలో అడవి నరికి టీ నాటి నప్పుడు వేసింది. ఇప్పుడు మనుషులు నడవడానికి, అడివి నరికినప్పుడు సేకరించిన కలపనీ, పుల్లల్నీ ఫేక్టరీకి చేరవేసే లారీలూ, ట్రాక్టర్లూ పోడానికి సదుపాయంగానే వుంది. ఇంకా మేనేజర్లూ అసిస్టెంట్ మేనేజర్లూ కార్లు తీసుకుపోవడానికి అనువుగా లేదు.

మేనేజరూ, కండక్టరూ రావడం చూసి, రోడ్డుకి రెండువైపులా కొండవాలుమీద వున్న కూలీలు పనివేగం హెచ్చించారు. మేస్త్రీలు గొంతు చించుకుని బాగా పనిచెయ్యమని కూలీలని హెచ్చరించడం మొదలు పెట్టారు. వంగి పనిచేస్తున్న కూలీలూ, మేస్త్రీలూ అప్పుడప్పుడు తలఎత్తి దొరకీ, కండక్టరుకీ సలాములు పెట్టారు. దొర బుర్ర పంకించి అందుకున్నాడు. దొర పక్కని ఉండడంవల్ల కండక్టరు యథాప్రకారం తిరుగు సలాం పెట్టి వారిని పలకరించలేదు.

"నిరుడు నాటిన చెట్లు బాగానే వస్తున్నట్టున్నాయి" సిమ్మన్సదొర అన్నాడు.

"అవును సార్ !"

"నేల సారవంతమైందిలా వుంది"

"అవును సార్ !"

"కొండవాలు అంత నిటారుగా కూడా లేదు. ఆడ కూలీలు టీ ఆకులు తుంపడానికి కష్టపడి ఎక్కి దిగనక్కర్లేదు"

"అవును సార్ !"

ఎంతో అవసరం వుంటేగాని మేనేజర్ల ప్రశ్నలకి అంతకంటే ఎక్కువ జవాబు చెప్పే అలవాటు లేదు తంగముత్తుకి. మేనేజరుకి నవ్వొచ్చింది.

"ఇంకా కొండ ఎన్ని ఎకరాలుంటుంది"

"వంద వుండొచ్చు సార్ !"

"అంతా మనకంపెనీదేనా ?"

"అవును సార్ !"

మెక్‌నాటన్ టీ కంపెనీకి ఏనమలై కొండల్లో ఏడు ఎస్టేట్లున్నాయి. ఒక్కొక్క ఎస్టేటు విస్తీర్ణం వెయ్యి ఎకరాలనుంచి రెండువేల

ఎకరాలవరకూ వుంది. అయితే ఎస్టేటుకి చెందిన అన్ని ఎకరాల్లోనూ టీ నాటిలేదు. ఒక్కొక్క ఎస్టేటుకి అయిదువందలనుంచి వెయ్యీ పన్నెండు వందల ఎకరాలదాకా పంటనిస్తున్న టీ వుంది. మిగతాది అడవి. ఈ అడవిని ఏడాదికీ, రెండేళ్ళకి ఇరవై ముప్ఫై ఎకరాల చొప్పున నరికి టీ పాతుతారు. అది ఏడెనిమిది ఏళ్ళల్లో పెద్దదయి రెండాకులూ, ఒక మొగ్గా చొప్పున తురమడానికి సిద్ధంగా వుంటుంది. 'ఫోర్రిస్పెక్టు ఎస్టేటు'కి పై ఏడాది ఇరవై అయిదు ఎకరాల అడవికొట్టి టీ పాతడానికి పర్మిట్ వుంది. ఎస్టేటుకి చెందిన ఎనిమిదివందల ఎకరాల అడివిలో ఇరవై అయిదు ఎకరాల గడ్డని ఎక్కడ ఎన్నుకుంటే బాగుంటుందో పరిశీలించడానికే మేనేజరూ, కండక్టరూ బయలుదేరారు.

"ఈ కొండ ఇంకా వంద ఎకరాలుంటుం దంటున్నావు కాబట్టి ఈసారి కొండకి అటువైపు అడివినరికి టీ వేస్తే బాగుంటుంది" అన్నాడు సిమ్మన్సుదొర.

తంగముత్తు 'అవును సార్ !' అనలేదు. కాని, "కాని........" అని నసిగాడు.

"నీ అభ్యంతరం ఏమిటి ?" అని అడిగాడు దొర.

"ఏమీలేదు సార్ ! కాని........"

"ఏమిటో చెప్పు" రెట్టించాడు సిమ్మన్సు దొర.

"ఈ కొండమీద టీ నర్సరీ పెంచడం కుదరదు సార్ !" అన్నాడు తంగముత్తు.

అడివినరికి టీ మొక్కలు పాతడానికి ఒక ఏడాది ముందునుంచీ టీ నర్సరీలు సాకుతూ రావాలి. చల్లని పందిర్లకింద మెత్తటి ఇసుకలో టీ విత్తనాలు పాతుతారు. పాతిన రెండుమూడు వారాల్లో అవి పగిలి చిన్న మొలకలు బయల్దేరతాయి. అప్పుడు వాటిని తీసి తొమ్మిది అంగు-

ళాల పొడుగూ, మూడు అంగుళాల వెడల్పువున్న వెదురుబుట్టల్లో పాతు తారు. అవి అయిదారు అంగుళాల ఎత్తు పెరిగిన తర్వాత పద్దెనిమిది అంగుళాల బుట్టల్లోకి మారుస్తారు. వర్షాకాలం ప్రారంభంలో వాటిని కొత్తగా అడివినరికి బాగుచేసిన భూమిలో పాతుతారు. ఇలా మొక్కల్ని పాతేముందు సాకుతూ రావడానికి చదునైన నేలా, మంచి నీటివసతీ కావాలి, ఈ నర్సరీలు మొక్కల్ని పాతబోయే స్థలానికి ఎంత దగ్గరలో వుంటే అంతమంచిది. లేకపోతే ఒకటొకటిగా బుట్టల్ని మోసుకుపోవడం విపరీతమైన ఖర్చు. అక్కడ నర్సరీ పెంచడం కుదిరదని చెప్పినప్పుడు తంగముత్తు బుర్రలో యివన్నీ మెదిలాయి.

"ఎంచేత ? కొండకి ఆవైపు నీటివసతి లేదా ?" అని అడిగాడు సిమ్మన్నదొర.

"ఒక్కచోట వుంది సార్ !"

"అక్కడే భూమి చదునుచేస్తే సరిపోతుందిగా !"

"అది కాదు సార్ !"

"ఇంకేమిటి ?"

"అది టీ నాటడానికి మంచి స్థలం అని పదేళ్ళకితర్రిమే స్టీవెన్సు దొర నిర్ణయించి నర్సరీ ఏర్పాటు చేశారు సార్ !"

"అయితే ఎందుకు వదిలేశారు ?"

"అక్కడ ఏనుగులరాయి వుంది సార్ ! అప్పుడప్పుడూ ఏనుగులు వచ్చిపోతూ వుంటాయి"

"అడవి కొట్టేస్తే అవే దూరంగా పోతాయి"

"నిజమే సార్ ! కాని ఆ స్థలంలో నర్సరీ ఉండనివ్వమని ఏనుగులు పంతం బట్టాయి సార్ !"

"నాన్సెన్స్"

"నిజమే సార్ !"

సిమ్మన్నదొర ఒక క్షణం ఆలోచించాడు.

"పద, ఆ ఏనుగులరాతిని చూద్దాం" అన్నాడు.

* * *

చుట్టూ పెరిగిన గుబురుని రెండు చేతుల్తో తప్పించుకుంటూ అడివిలో కాలిబాటమీద మేనేజరూ, కండక్టరూ ప్రయాణం సాగించారు. అరమైలు నడిచిన తర్వాత పదేళ్ళకిత్రితం చెట్టుకొట్టి బాగుచేసిన ఒక ఎకరం నేల కనబడింది. ఈ పదేళ్ళలో చిన్న చిన్న మొక్కలూ, గడ్డీ పెరిగి ఆ చదును చేసిన ఆపాత నర్సరీ స్థలాన్ని కప్పివేశాయి. ఇంకా వెదురు పందిళ్ళ తాలూకు కొన్ని కర్రలూ, తాళ్ళూ చూచాయగా కనిపిస్తున్నాయి. అప్పుడప్పుడు ఏనుగులు తీసుకువచ్చి తిని పారేసిన వెదురు మొక్క ముక్కలూ, ఆకులూ, కందగడ్డలూ చిందరవందరగా చిమ్మి వున్నాయి. చుట్టుపక్కల ఏనుగు లద్దెలు తాటికాయల్లాగా పడివున్నాయి.

నర్సరీకి పదిగజాల దూరంలో ఒక పెద్ద రాయి రెండు ముక్కలుగా బద్దలయి విడిపోయి వుంది.

"అదే సార్, ఏనుగుల రాయి" అన్నాడు తంగముత్తు.

దొరకి జరిగిన విషయం సవిస్తరంగా వినాలని కుతూహలంగా వుంది. కాని పని సమయంలో మూఢనమ్మకాల గురించి కండక్టరుతో చర్చించడం అంత ఆదర్శప్రాయమైన పని కాదేమో ననిపించింది. నిజానికి ఇది ఎస్టేటు పనికి సంబంధించిందేనని సమాధాన పరుచుకున్నాడు.

"అసలేం జరిగింది ?"

కాల్చేసిన నుసిని బయటికి తీసెయ్యడానికి పైపుని పక్కనున్న చెట్టుమొదలుమీద కొడుతూ దొర అడిగాడు, తంగముత్తు గొంతు సవరించుకున్నాడు.

* * *

కడకరైకీ, ఏనుగులకీ అవినాభావ సంబంధం. నిజానికి కాడాజాతికంతకీ ఏనుగులు చిరపరిచితులే. లక్షఎకరాల అడివిలో అవిచ్ఛిన్నంగా తిరుగాడే ఏనుగులమందలకీ గవర్నమెంటు అనుమతించిన అయిదువందలఎకరాల్లో సారవంతమైన ఎకరం రెండెకరాలకోసం వెతుకులాడే కాడాగుంపులకీ ఆయువుపట్టులు అడవిలో పారే సెలయేళ్ళు. ఎక్కడెక్కడ తిరిగివచ్చినా ఏనుగూ కాడా సెలయేళ్ళపక్కనే ఉనికి ఏర్పాటుచేసుకోవాలి. ఇద్దరూ రోజుకి ఎన్నోసార్లు తటస్థపడుతూంటారు. ఒకరంటే ఒకరికిభయం, అనుమానం లేవు. కాడాకి ఏనుగు పవిత్రమైంది. ఏనుగుబలం, సాహసం ఠీవీ, అందం, కాడాలో ఆశ్చర్యం, సంభ్రమం, నమ్రత, భక్తీ కలిగిస్తాయి. అందుకు ప్రతిచిహ్నంగా ఏనుగు కాడాజోలికి పోదు. వందగజాలదూరంలో కాడా నడిచిపోతుంటే చూసీచూడనట్టు ఊరుకుంటుంది.

కాడా లందరికీ ఏనుగులు ఆరాధ్యాలయితే కడకరైకి సన్నిహిత స్నేహితురాళ్ళయ్యాయి. ఊహ వచ్చినప్పటినుంచీ అవి అతన్ని సమ్మోహితుణ్ణి చేశాయి. ఆకులతోనూ, గడ్డితోనూ వేసిన గుడిసెల్లో రాత్రిళ్ళు తల్లీ తండ్రీ మధ్య పడుకుని ఏనుగులగురించే ఆలోచించేవాడు. నక్కకూతలమధ్య అడవిపంది అరుపుల్లో, కోతి కిచకిచల్లో ఏనుగు ఘీంకారం వినిపించినప్పుడు అతనికి ప్రాణం లేచివచ్చేది. ఏనుగుల కథలు చెప్పమని తల్లినీ, తండ్రినీ వేధించేవాడు. కడకరై తాతముత్తాతలు ధైర్యసాహసాలకి ప్రసిద్ధికెక్కారు. అతని తాత ఎన్నోసార్లు మదపుటేనుగు భయంనుంచి కాడాజాతిని రక్షించాడు. ఒకసారి అడవిలో గడ్డికోసుకుని వస్తున్న కాడా స్త్రీని మదపుటేనుగు తరుముతుంటే అడ్డుపడ్డాడు. ఏనుగుకి కోపం రెచ్చిపోయింది. స్త్రీని వదిలేసి అతనిమీద కసితీర్చుకోడానికి ఉపక్రమించింది. ఎంతోసేపు ఏనుగు వెనకాలే దాక్కుని తప్పించుకోడానికి ప్రయత్నించాడతను. ఏనుగుమెడ బొద్దుగా పొట్టిగా వుంటుంది. వెనకనున్న మనిషిని మెడతిప్పి చూడలేదు. కాని మదపుటేనుగు బుద్ధి

చాల సూక్ష్మమైంది. ఒకేవైపు గిరగిరా తిరిగి అతన్ని తొండంలో పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నదల్లా ఈసారి రెండోవైపుకి తిరిగింది. కడకరై తాతకి ప్రళయం ఎదురైంది. అతనుమాత్రం ఏం తక్కువ వాడు కాదు. వెంటనే ఏనుగుకాళ్ళ మధ్య దూరి తోక పట్టుకున్నాడు. ఏనుగు ఎంత ప్రయత్నించినా విదిలించలేక పోయింది. అతనిపట్టు జంతువుకి చక్కలిగింతలు పెట్టింది. ఒకే భయంతో అది అడవిలోకి పరుగు తీసింది. సమయం కనిపెట్టి అతనుపట్టు వదిలేసి, నేలమీద కూలబడ్డాడు. మళ్ళీ మదపుటేనుగు ఆ పరిసర ప్రాంతాల్లో కనిపించలేదు.

కడకరై తండ్రికి ఏనుగులంటే ఎంతో అభిమానం. అతని పడుచుదనంలో జరిగిన సంగతి. అప్పుడు తన గుడిసెకి నాలుగయిదు వందల గజాల దూరంలో చెరువు వుండేది. అందులో స్నానం చెయ్యడానికీ. నీళ్ళు తాగడానికీ ఏనుగులు వేసంకాలంలో వస్తూ వుండేవి. అతను ఎత్తయిన చెట్టుకొమ్మల్లో దాక్కొని చూసి ఆనందించేవాడు. ఏనుగులకి నరవాసన పసిగట్టడం పుట్టుకతో వచ్చిన విద్యేఅయినా, మనిషి కనిపించకుండా దాక్కొని వుంటే కళ్ళతో కనుక్కొనేటంత ప్రజ్ఞ లేదు. ఒకనాడు ఆ గుంపులో మగ ఏనుగు కణతలకింది రంధ్రంలోనుంచి చముకు కారడం చూశాడతను. వెంటనే ఏనుగు మదించిందనీ, 'మస్త్'లో వుందనీ గ్రహించాడు. మగ ఏనుగులు అప్పుడప్పుడూ 'మస్త్' లో వుంటాయి, అప్పుడు అవి ఉగ్రరూపం ధరించి, కనుచూపు మేరలో సర్వం ధ్వంసం చేస్తాయి. మనిషి కనిపిస్తే రక్తపు ముద్దగా తొక్కి తాండవమాడతాయి. మనుష్యులను చంపిన మదపుటేనుగులని కాల్చి చంపడానికి ప్రభుత్వం ప్రయత్నం జరుపుతుంది. ఈ ఏనుగు మదించి, అడవిలో పుల్లలు కొట్టుకోడానికి వెళ్ళిన ఇద్దరు ముగ్గురు మనుషులని చంపిందని వినగానే దానిని చంపినవాళ్ళకి బహుమానం ప్రకటించింది గవర్నమెంటు. ఈ వార్త కడకరై తండ్రి నెంతగానో బాధ

పెట్టింది. 'మస్తు' కలకాలం వుండబోదనీ, అది తగ్గిన తరువాత ఏనుగు ఎప్పటిలాగా సాధువుగా మారిపోతుందనీ అతనికి తెలుసు. కొన్ని రోజులు పరిసరాల్లో జాగ్రత్తగా మసలితే పోయేదానికి నిండు ప్రాణిని చంపడం అతని మనస్సుని క్షోభ పెట్టింది. అయితే, ప్రభుత్వం శాసిస్తే అడ్డుతగలగలవారెవరు? అతనికొక ఉపాయం తట్టింది. మదపుటేనుగు తిరిగే స్థలంలో పెద్ద గొయ్యితీసి, దానిమీద పచ్చని ఆకులూ, కొమ్మలూ కప్పిపెట్టాడు. గొయ్యిమీద మనిషి పరుగెత్తడానికి వీలుగా సన్నటి చెక్క వంతెనలాగా వేసి, గొయ్యికి ఇవతలపక్క వందగజాల దూరంలో నుంచుని డప్పులు వాయించాడు. చప్పుడు విని మదపుటేనుగు ఉరకలు వేసుకుంటూ వచ్చింది. అతనిమీద ఉరికి తొండంతో మెలిపెట్టడానికి వెంటాడింది. అతను కర్ర వంతెనమీదగా పరిగెత్తి గొయ్యి అవతలి పక్క చేరిపోయాడు. తరుముకువస్తున్న ఏనుగు గోతిలో పడిపోయింది. ఏనుగుది అంత స్థూలకాయం అయినా మనిషితో సమానంగా పరిగెత్తగలదు. ఒక్కొక్కప్పుడు ఓడించనూగలదు. అయినా దాని ప్రాణం కాపాడ్డంకోసం ఆ మాత్రం సాహసించడం అవసరం అనిపించిందతనికి. తరవాత పది రోజులూ నల్లమందుపడేసీ, మంచినీళ్ళుపోసీ కడకర్రై తండ్రి దాన్ని 'మస్తు' లో నుంచి తొలగించాడు. అంత ఉగ్ర స్వరూపం అతిసామాన్యంగా మారిపోయింది. అప్పుడు అది బయటకి రావడానికి వట్టుగా పెద్ద పెద్ద దుంగలు గోతిలోకి దొర్లించాడు.

ఇటువంటివే ఎన్నో కథలు. వింటూంటే కడకర్రై ఒళ్ళు గగుర్పొడిచేది. ఏనుగులంటే విపరీతమైన ప్రేమ అతన్ని ఆవరించేది. వాటిని మననం చేసుకుంటూ నిద్రపోయేవాడు.

ఏడాది చివర తల్లీ, తండ్రీ తక్కిన గుంపుతోబాటు చోటు మారవలసి వచ్చినప్పుడు కడకర్రై గుండెలు వేగంగా కొట్టుకునేవి. కొత్త చోట ఏనుగులుంటాయా? వాటి ఘీంకారం వినిపిస్తుందా? కాడాలు నివసించ

డానికి గవర్నమెంటు ఏనమలై కొండల్లో పదిహేడువందల ఎకరాల అడివి ప్రత్యేకించింది. అందులో కలపకొట్టి అమ్మడానికీ, ఏనుగుల్నీ, నల్లకోతుల్నీ పట్టడానికీ వీల్లేదు కాని, వంటచెరుకు సేకరించుకోవచ్చు. పశువులమేతకి గడ్డి కోసుకోవచ్చు. పెద్దపులినీ,సాంబర్‌నీ వేటాడవచ్చు. అడివి మేకనీ, దుప్పినీ, పందినీ పట్టి తినొచ్చు. ఇంతేకాకుండా ఆ పదిహేడువందల ఎకరాల్లో అయిదువందల ఎకరాల్ని ఛేదించి సేద్యం చేసుకోవచ్చు. కాడాగుంపులు ఏడాదికి నాలుగూ అయిదూ ఎకరాల చొప్పున అడవి నరికి రాగులూ. జొన్నలూ, కాయగూరలూ పండిస్తారు. ఏడాది చివర ఆ స్థలం వదిలిపెట్టి వారికి కేటాయించబడిన ప్రాంతంలో కొత్త స్థలంకోసం వెతుక్కుంటూ పోతారు. సాధారణంగా పాతచోటుకి తిరిగి పదిపదిహేనేళ్ళవరకూ రారు.ఇలా తిరగడంలో ఎప్పుడు ఏనుగులు చేరువలోలేని ప్రదేశానికి చేరవలసివస్తుందోనని కడకరై బాధ.

కడకరై కొంచెం పెద్దవాడయి ఏడెనిమిది సంవత్సరాల వయసు వచ్చేటప్పటికి గుడిసె చుట్టుపక్కల చిట్టడవిలో ఏనుగుల గుంపులకోసం వెతకడం ప్రారంభించాడు. ఏనుగులు అరమైలు దూరంలో వుండగానే ఘీంకారం, వెదురుబొంగులు విరిగిన ఫెళఫెళలూ వినిపించేవి. తనను చూస్తే అవి పారిపోతాయని అతనికి తెలుసు. జాగ్రత్తగా చెట్టుచాటునో, రాయిచాటునో నక్కి గంటలతరబడి తనివితీరా చూసేవాడు. చూసినకొద్దీ వాటి గాంభీర్యం, అమాయకత్వం అతణ్ణి పరవశం చేసేవి. దగ్గిరకివెళ్ళి తొండంమీద ఆప్యాయంగా నిమరాలనీ, మంచి పళ్ళూ కందమూలాలూ తినిపించాలనీ ఆశగా వుండేది. అయితే ఆ వయస్సులో అతను సాహసించలేకపోయాడు.

ఈ విషయం గుంపులో పొక్కిపోయింది. తల్లితండ్రుల చెవిన కూడా పడింది. కడకరై తండ్రికి ఏనుగులంటే ఎంత మక్కువైనా అంత చిన్నవయసులో కొడుకు అడవులు గాలిస్తుంటే భయంవేసింది.

'మస్త్' లో వున్న ఏనుగులు, పెద్దపులులు, ఏదుపందులు, కొండచిలువలు దేనివాతబడ్డా ఆశ వదలుకోవలసిందే కద! అతను కొడుకుమీద ఒకకన్ను వేసి వుంచాడు. పగలల్లా కడకరై పొలంలో పనిచెయ్యాలి. రాత్రి కొడుక్కి నిద్రపట్టేవరకూ పక్కలోవేసుకుని కథలు చెప్పుతాడు. కునుకుపట్టిన తర్వాత గుడిసె మూలలోవున్న వేరే పక్కలో వేస్తాడు. అయితే, తల్లీతండ్రీ కబుర్లు చెప్పుకుంటూ నెమ్మదిగా నిద్రలో మునిగి పోయేసరికి కడకరై ఒక నిద్రతీసి ఏనుగుల్ని కలుసుకోడానికి సిద్ధంగా వుండేవాడు.

మొదట్లో ఏనుగులకోసం మైళ్ళు మైళ్ళు తిరగవలసివచ్చింది. ఏనుగుల అలవాట్లు తండ్రి చెప్పిన కథలవల్ల కడకరైకి చూచాయగా తెలుసు. రోజుకి సరిపడే ఆరువందల పౌన్ల ఆకులూ, అలములూ సంగ్రహించుకోడానికి ఒక్కొక్క ఏనుగూ కనీసం పదిమైళ్ళ అడవయినా గాలించాలి, ఏనుగులతోపాటు పదిమైళ్ళ ప్రయాణానికీ సిద్ధపడి వెళ్ళేవాడు కడకరై. దూరంగా ఏనుగుల చప్పుళ్ళు వినిపించేవి. ధ్వనిబట్టి దూరాన్ని లెక్కకట్టడం కాడాలకి ఉగ్గుపాలతో నేర్పిన విద్య. కడకరై ఏనుగుల గుంపుల ఉనికి అంచనా వేసేవాడు. ఏనుగులు నడచిన దారి చక్కని రహదారిలాగా వుంటుంది. అయితే ఆ దారి ఎప్పుడు వేసిందీ కనుక్కోడానికి రోడ్డుపక్కని చెట్టుకొమ్మల్ని పరీక్షించేవాడు. అప్పుడే విరిగిన కొమ్మలు ఏనుగులగుంపు ఆ దారిన వెళ్ళినదానికి గుర్తు. దారిలో పెద్ద పెద్ద గడ్డలుగా పడివున్న ఏనుగు లద్దెల్ని కాలితో తన్నేవాడు. అవి విడిపోయి పొగలుగక్కుతూ కాలికి వేడితగిలితే అప్పుడే వేసినట్టు గుర్తు. ఈ ఆధారాలతో కడకరై ఏనుగులున్న చోటుకి చేరుకునేవాడు.

ఎంతోకాలం ఇలా కష్టపడవలసిన అవసరం లేకపోయింది కడకరైకి. అర్ధరాత్రివరకూ అడవిలో తిరిగి కొన్ని గంటలు విశ్రమించడానికి ఏనుగులరాయి దగ్గరికి చేరుకునేవి ఏనుగులగుంపు. ఏనుగుల

రాయి గురించి చాలా విన్నాడు కడకర్రై. పెద్దరాయి. మూడువైపులా నేల
లోకి పాతుకునిపోయి ఒకవైపు మనిషి పాకి వెళ్ళగలిగినంత ఎత్తులో,
పది అడుగుల వెడల్పున ఖాళీ వుంది. రెండుమూడడుగులు పాకి లోప
లికి వెళితే ఇద్దరు ముగ్గురు మనుష్యులు కూర్చోగలిగినంత స్థలం రాయి
దొలిచి ఏర్పాటు చేసినట్టుంది. ఈరాయి ఎన్నో కాడా జీవితాలు రక్షిం
చిందని ప్రతీతి. కాడాలు దగ్గర్లోవున్న పల్లెకో పట్టణానికో కిరస
నాయిలు, నూనె, పంచదార కొనుక్కోడానికి వెళ్ళి తిరిగి వస్తుంటే
ఎప్పుడైనా చీకటి పడిపోతుంది. వెన్నెల రాత్రిళ్ళయితే పరవాలేదు.
చీకటి రాత్రిళ్ళల్లో నల్లని ఏనుగు చర్మం గుర్తుపట్టడం కష్టం. ఎప్పుడు
'మస్త్' లో వున్న ఏనుగు తటస్థపడుతుందో చెప్పలేం. అటువంటి సమ
యంలో కాడాలు రాతికింద దూరి దాక్కుంటారు. ఏనుగులు పసిగట్టి
దగ్గరికి వచ్చినా లోపల మనిషికి భయంలేదు. కొండగుహాలోలాగా
నిశ్చింతగా కూర్చోవచ్చు. అయితే, కొండగుహకి ఏనుగు ప్రవేశించ
గలిగినంత ద్వారం వుండవచ్చు. ఈ రాతిలో ప్రవేశించడానికి రెండడు
గుల ఖాళీకంటే ఎక్కువలేదు. బైట జంతుభయంవల్ల ఎక్కువసేపు
లోపలే వుండిపోవలసిన పరిస్థితి ఏర్పడితే వంట చేసుకోడానికీ, చలి
మంట వేసుకోడానికీ మూడు రాళ్ళూ, కొన్ని ఎండుపుల్లలూ రాతిలోపల
ఎప్పుడూ భద్రపరిచి వుంచుతారు కాడాలు.

మొదట ఏనుగులరాయిని చూసినప్పుడు గుర్తుపట్టలేదు కడకర్రై.
అడివంతా తిప్పి చివరకి ప్రతిరాత్రి తనని ఏనుగులు అక్కడికి తీసుకు
వెళ్ళేసరికి అనుమానం కలిగింది. ఎన్నోరోజులు రాయివెనకాలే నక్కి
చూశాడు. రాతిచుట్టూ ప్రదేశాన్ని చక్కగా చదునుచేసుకున్నాయి ఏను
గులు. అక్కడ పడుకుని కూడా తెచ్చుకున్న కొద్ది ఆకుల్నీ, రెమ్మల్నీ
సావకాశంగా తొండంతో మెలిపెట్టి నోట్లో తోసుకునేవి. ఆడ ఏనుగులు
చిన్న పిల్లలకి పాలు గుడిపేవి. పిల్లలు తొండం నోటికి అడ్డంరాకుండా

పైకి యెత్తిపెట్టి నోటితో పొదుగుకుని కరచి పెట్టుకుని తాగేవి. తిండి అయిన తర్వాత ఏనుగులు ఆడుకునేవి. ఒక్కొక్కప్పుడు పోట్లాడు కునేవి. కొన్ని ప్రేమకలాపం సాగించేవి. యెక్కువ అలిసిపోయి నప్పుడు రాతికి ఆనుకుని శరీరాన్ని తోముకునేవి. చూసినకొద్దీ కడకరై ముగ్ధుడై పోయేవాడు.

రోజులు గడిచినకొద్దీ కడకరై దూరంనుంచి చూసి ఆనందించ డంతో తృప్తి పొందలేకపోయాడు. అతనికి ఏనుగులమీద అభిమానం, నమ్మకం ఎక్కువయ్యాయి. ఒకరోజున ఏనుగులు రాకముందే రాతిలో దూరి పడుకున్నాడు. మనిషి లోపలఉన్నట్టు వాసనవల్ల గ్రహించితొండం లోపల చొప్పించడానికి ప్రయత్నించాయి ఏనుగులు. కాని తొండం ఎంతో లోపలికి పోలేదు. రాతిలో కడకరైకి ఒక పక్క భయం, ఒక వక్క ఆవే శం. ఏనుగులు! చేతికందేటంత దూరంలో ఏనుగులు. తనేంచేస్తున్నదీ తనకే తెలియలేదు రాత్రి తినడానికి తెచ్చుకున్న చెరుకుముక్కలూ, అరటిపళ్ళూ లోపలికి చాచిన తొండాలకి అందిచ్చాడు. వాటిని ఏనుగుల నోట్లో పెట్టు కుంటుంటే కడకరై ఒళ్ళు మరిచిపోయాడు. అప్పట్నించీ రోజూ ఏదో ఒకటి ఏనుగులు తినడానికి తీసుకు వెళ్ళేవాడు. ఏనుగులకీ, అతనికీ మధ్య ఇలా ప్రారంభమైన మైత్రి కొంతకాలానికి ఎడతెగని స్నేహంగా పరిణమించింది. గుంపులో ప్రతి ఏనుగునీ కడకరై గుర్తుపట్టగలడు. ప్రతిదానినీ పేరుపెట్టి పిలిచేవాడు. పొమ్మన్నన్, మైలన్, కులకడా, పీం బన్, ఆనకట్టయ్, కరుప్పాయి, లచ్మి, ఇంకా ఎన్నో పేర్లు. ఇప్పుడు తను రాతికింద దాక్కోవలసిన అవసరం లేదు. రాతిమీద కెక్కి ఒక్కొక్క ఏనుగునీ పేరుపెట్టి పిలిచి కొబ్బరి ఆకులూ, వెదురు ఆకులూ, అరటి పళ్ళూ, రాగులూ, చోళ్ళూ ఏవి దొరికితే అవి పెట్టే వాడు. ఏనుగులు ఆప్యాయంగా అందుకుని తినేవి.

కడకరైకి పన్నెండో యేడు వచ్చేవరకూ తల్లీ, తండ్రితో గుడిసెలోనే పడుకునేవాడు. పెద్దవాళ్ళు నిద్రపోయిన తర్వాత గుడిసె విడిచిపెట్టి ఏనుగులరాయి దగ్గిరకి పోయి తిరిగి తెల్లవారకముందే వచ్చి పక్కలో పడుకునేవాడు. పన్నెండో యేడు రావడంతో అతను మొగ వాళ్ళ సత్రవకి వెళ్ళవలసి వచ్చింది. కాడాల్లో పన్నెండేళ్ళకి మించిన పిల్లలు తల్లీ, తండ్రితో గుడిసెలో పడుకోడానికి వీల్లేదు. ఆ వయసు వాళ్ళు రాత్రిళ్ళు పడుకోడానికి గుంపుకి రెండు సత్రవలుంటాయి. ఒకటి మొగవాళ్ళకి, రెండవది ఆడపిల్లలకి. పెళ్ళి అయ్యేవరకూ వాళ్ళు అక్కడే పడుకోవాలి. సత్రవ నడపడానికీ, పిల్లల యోగక్షేమాలు చూడడానికీ, హద్దులో వుండడానికీ ముసలిపెద్దలు ఆడవారి సత్రానికి అవ్వా, మొగవారి సత్రానికి తాతాసత్రంలోనే పడుకుంటారు. పిల్లలు రాత్రిళ్ళు సత్రం విడిచి పోకూడదనే ఆంక్ష కఠినంగా పాటిస్తారు కాడాలు. అయినప్పటికీ అప్పు డప్పుడూ మగపిల్లలు తాతకళ్ళుకప్పి ఆడపిల్లల సత్రంలో ప్రియురాలిని కలుసుకోడానికి వెళ్ళడంలాంటివి జరుగుతూనే వుంటాయి. కడకరైకి వర్షా కాలం అంతా సత్రం జీవితం బాధఅనిపించలేదు. వర్షాకాలంలో ఏనుగులు కొండలకింద వున్న కాన్ పొన్నాచికి వెళ్ళిపోతాయి. వేసంకాలం సమీ పిస్తుందనగా ఎండవేడి భరించలేక నాలుగయిదువేల అడుగుల ఎత్తు కొండల్లోవున్న ఏనుగులరాయి ప్రాంతాలకి జేరుకుంటాయి. ఈ ఆరు నెలల్లో కడకరై ఒక్కరాత్రి కూడా ఏనుగుల్ని చూడకుండా గడపలేదు. జనవరినెల ప్రారంభంలో ఏనుగుల ఘీంకారం వినిపించినప్పుడు మగత నిద్రలో వున్న కడకరై ఒళ్ళు గగుర్పొడిచింది. లేచి సత్రం తాత కంటబడకుండా బయటపడ్డాడు. 'అనకట్టై'కి చెరుకు ముక్కలంటే ఎంతో ఇష్టం. 'పీంబన్'కి కొబ్బరికాయలుంటే ఇంకేమీ అక్కర్లేదు. ఇప్పుడవన్నీ ఎక్కణ్ణుంచి తెస్తాడు ? తండ్రి ఎకరన్నర పొలంలోకి వెళ్ళి, వున్న చెట్లు కొమ్మల్లో అరవై అడుగుల ఎత్తున ఆకులూ కొమ్మలతో పదిలంగా

చేసిన గాదిలోనుంచి రాగులూ, చోళ్ళూ, అరిటిపళ్ళూ బయటికి తీసి పంచెలో భద్రపరుచుకుని ఏనుగులరాయి దగ్గిరకి ప్రయాణమయ్యాడు.

కడకరై రాత్రిళ్ళు సత్రం విడిచి వెళుతున్న విషయం ఆట్టే కాలం దాగలేదు. ఆడ సత్రంలో అమ్మాయిలకోసం వెళుతున్నాడని నింద మోపారు. పంచాయితీ ఏర్పాటుచేసి శిక్ష వెయ్యాలన్నారు. తను ఏ అమ్మాయికోసమూ వెళ్ళడం లేదన్నాడు కడకరై. కాని ఎక్కడికి వెళుతున్నాడో చెప్పలేదు. చెపితే ఆటంకాలు పెడతారని అతని భయం. ఆడసత్రంలో ఎవరిని కలుసుకోడానికి వెళుతున్నదీ నిరూపించలేక పోవడంవల్ల అతన్ని దండించలేదు. కాని కొందరు పెద్దలు రాత్రిళ్ళు పొదల్లో పొంచి అతను ఎక్కడికి వెళ్ళుతున్నదీ కనిపెట్టడానికి ఉపక్రమించారు. దానితో రహస్యం బయటపడిపోయింది. పెద్దలు ఇంత పిచ్చి కూడదన్నారు. తల్లీ, తండ్రీ నయానా, భయానా వారింపచూశారు. బయట స్నేహితులు ఘీంకరించి పిలుస్తుంటే ఎంత ప్రయత్నించినా కడకరై సత్రంలో నిద్రపోలేకపోయాడు. కడకరై తండ్రికి పరిస్థితి అర్థమైంది. కొడుకు స్వేచ్ఛని అరికట్టి ప్రయోజనంలేదని పెద్దలకి నచ్చచెప్పి ఒప్పించాడు.

ఈ వేసంగికి కడకరై ఏనుగులరాయి దగ్గిరకి వెళ్ళగానే కళ్ళ నీళ్ళు తిరిగాయి. అక్కడ ఏనుగులు లేవు. అవి చదునుచేసుకున్న స్థలం లేదు. దట్టమైన అరణ్యం లేదు. అడవికొట్టి మెక్‌నాటన్ టీ కంపెనీ అక్కడ నర్సరీ ఏర్పాటుచేసింది. చల్లని ఆకుపందిళ్ళ కింద నవనవలాడే టీ నారు. ఆ నారుని అడవి మృగాలు తొక్కి పాడుచెయ్యకుండా చుట్టూ కొయ్యలకి కొట్టిన ముళ్ళతీగ. ముళ్ళతీగకి ఆనుకుని ఏనుగులరాయి. ఏనుగులరాయి పేరుకి మాత్రమే అక్కడ పడివుంది. ఏనుగులకి చిక్కకుండా మనిషి లోపల దూరి దాక్కోడానికి ఇంక అది పనికిరాదు.

రాయిలోదూరే సన్నటి ద్వారాన్ని టీ కంపెనీ తాపీ మేస్త్రీలు వెడల్పుచేసి పగలగొట్టిన రాతిముక్కలతో నర్సరీ అంచులు కట్టారు. ఇప్పుడు రాతి లోపల ఇద్దరు కూర్చోడానికే కాదు - అరడజనుమంది పడుకోడానికి స్థలం వుంది. ద్వారందగ్గిర రాతిముక్కల్ని పగలగొట్టి తీసెయ్యడంవల్ల రాయిబలం తగ్గిపోయి, మధ్యలో పెద్ద బీటవేసి కొద్దిగా ముందుకి వాలింది. కడకరైకి దుఃఖం పెల్లుబికి వచ్చింది. సంబాళించుకుని విచారించవలసిన పని లేదనుకున్నాడు. ఏనుగులరాయి ఎలా పోతేనేం ? ఇంక దాని ఉపయోగంలేదు. అడివి నరికి మనిషి పనిచెయ్యడం మొదలు పెట్టాక ఏనుగులు ఆ పరిసరాలకి రావు. ఇంక ఏనుగులు రావు. అనకట్టై పీంబస్, మైలస్, కరుప్పాయీ అక్కడికి రావు. కడకరైకి తిరిగి దుఃఖం కట్టలు తెంచుకుని వచ్చేసింది. మొలకి చాలీ చాలకుండా కట్టుకున్న పంచె చెంగుతో కళ్ళు, మొహం తుడుచుకున్నాడు. ఏనుగులకోసం తెచ్చిన కొబ్బరికాయలూ, అరటిపళ్ళూ రాయిదగ్గిరపెట్టి స్నేహితుల్ని వెతకడానికి బయల్దేరాడు.

ఎంతోదూరం వెళ్ళకుండానే కడకరైకి ఏనుగుల జాడ కనిపించింది. తన్ని కలుసుకోడానికి రాతిసమీపానికి వచ్చి నరికిన అడివిని చూసి పారిపోయాయన్నమాట. దగ్గిరలోనే వున్న సెలయేటికి పోయి వుంటాయి. కడకరై ఏటిఒడ్డుకి పరిగెత్తాడు. ఏనుగులు స్నానం చేస్తున్నాయి. కొత్త పరిసరాల్లో కడకరైకి స్నేహితులమీద నమ్మకం కొంచెం సడలినట్టయింది. దగ్గిరకి వెళ్ళడమా, మానడమా అని తటపటాయించాడు. చెటుచాటున నక్కి మృదువుగా కూనిరాగం తీశాడు. "కూ-లా-కా-డా" తొండంతో నీళ్ళు వీపుమీద చిమ్ముకుంటున్న కులకడా వెనక్కి తిరిగి, చేటచెవులు రిక్కించి చూసింది. కడకరై మొహం వికసించింది. మళ్ళీ పాడాడు. "పీం-బా-స్" పీంబస్ పాట వచ్చినవైపు ఒక అడుగు

ముందుకేసి వచ్చింది. కడకర్రై అనుమానం ఇప్పుడు తీరిపోయింది. ఎక్కడున్నా అవి తన స్నేహితులే. చెట్టుచాటునుంచి వచ్చి ఏనుగుల ముందర నిలబడ్డాడు. కడకర్రై, ఏనుగులూ ఏదో మూగభాషలో కూడ పలుకున్నారు. అంతా ఏనుగులరాయి దగ్గిర చేరుకున్నారు. ఎంత రూపు మారిపోయినా ఏనుగులరాయిమీద మమకారం కడకర్రైని వదలలేదు. తమ స్నేహం మొదలయింది అక్కడ. పెంపొందింది అక్కడ. అక్కడ జేరగానే అతని మనస్సు ఉప్పొంగిపోయింది.

మర్నాడు పొద్దున్న మెక్‌నాటస్ టీ కంపెనీ కూలీలు పనిచెయ్యడానికి నర్సరీ దగ్గిరకిపోయి ఏనుగులవల్ల కలిగిన నష్టం చూశాడు. టీ నారు పాడవలేదుకాని ఏనుగులరాయికి ఆనుకొని వేసిన ముళ్ళతీగలూ, కొయ్యముక్కలూ ధ్వంసం అయిపోయాయి. వెంటనే కంపెనీ వాటిని బాగుచేయించింది. మళ్ళా మర్నాడు అదే కథ. ఈసారి కంపెనీ తీగని బాగుచేయించడంతో ఊరుకోలేదు. రాత్రి నలుగురు కూలీల్ని కాపలా పెట్టింది.

కడకర్రైకి మళ్ళీ సమస్య ఎదురైంది. కూలీలు నర్సరీ చుట్టూ పెద్ద పెద్ద మంటలు వేసుకొని కూర్చున్నారు. మంటల్ని చూస్తే ఏనుగులకి భయం. పరిసరప్రాంతాల్లో కనిపించవు. విధిలేక కడకర్రై యేటిదగ్గిర కలుసుకునేవాడు. యేటిదగ్గర కలుసుకున్నా, రాయిదగ్గిర కలుసుకున్నా అవే ఏనుగులు. అయినా అతని మనస్సంతా ఏనుగులరాయిమీదే వుండేది. ఆ రాతిగుహలో కూర్చుని కుంకడాకి ఆకులు పళ్ళు తినిపిస్తే 'లచ్మి' తొండానికి ఆకులు అందిస్తే అతని మనస్సు తృప్తిగా వుంటుంది.

వారంరోజులు రాత్రికాపలా పెట్టిన తర్వాత ఏనుగుల భయం పోయిందని మెక్‌నాటస్ కంపెనీ ఉపేక్షచేసింది. రాత్రి ఇంటిదగ్గిర భోజనంచేసి యేటిదగ్గిర ఏనుగులకి పళ్ళు తీసుకువెళ్ళుతున్న కడకర్రై

రాయిదగ్గిర కాపలా కూలీలు లేకపోడం గమనించాడు. వీంబస్, ఆనకట్టై అని ఉద్రేకంగా అరుచుకుంటూ యేటి దగ్గిరకి పరుగెత్తాడు.

కొంతసేపటికి స్నేహితులంతా మళ్ళీ ఏనుగులరాయి దగ్గర జేరు కొన్నారు.

కడకరై మధురస్మృతుల్లో మైమరిచిపోయాడు. పూర్వంలాగా రాతిలోపల కూర్చుని ఏనుగులకి పళ్ళు అందించాడు. ఏనుగులు సంతో షంతో మిన్ను ముట్టేలా ఘీంకరించాయి; విలాసాల్లో మునిగిపోయాయి. అంతా కోలాహలంగా వుంది.

అంత సంతోషం ఎంతోసేపు నిలబడలేదు. ఏనుగులు ఆడి ఆడి రాతికి శరీరాన్ని రుద్దుకోడం ప్రారంభించాయి. పూర్వం రాయి బలంగా వుండి వాటితాకిడికి ఆగేది. ఇప్పుడు బీటవాసి పడిపోవడానికి సిద్ధంగా వుండి నిలబడలేకపోయింది.

ముందుకి వాలివున్న భాగం బ్రహ్మాండమైన చప్పుడుతో కూలి పోయి లోపలవున్న కడకరైని ఉక్కిరిబిక్కిరి చేసేసింది.

కడకరై ఒక్క అరుపు అరిచాడు.

మరుక్షణం రక్తపుముద్దగా మారిపోయాడు.

జరిగిన సంగతి ఏనుగులు గ్రహించాయి. వెర్రి ఆవేశం వాటిని ఆవహించింది. చుట్టుప్రక్కలవున్న నర్సరీని సర్వనాశనం చేసేశాయి. పందిళ్ళని పీకి ముక్క ముక్కలు చేశాయి. టీ మొక్కల్ని ఆనవాలు పట్టలేనంతగా తొక్కేశాయి. ముళ్ళతీగని దారపు వుండలాగా చుట్టి దూరంగా విసిరికొట్టేయి. నర్సరీ అంచులకి ఉపయోగించిన రాళ్ళని ఇసుక రేణువులుగా నలిపేశాయి. విడి పడిపోయిన రాతిని దొర్లించి కడకరైని బయటికి లాగాయి.

మర్నాడు పొద్దున్న నర్సరీ లోపలికి వెళ్ళిన కూలీలు కడకరైని, మోసుకుపోతున్న ఏనుగులమందని చూసి భయపడి పారిపోయారు.

మళ్ళీ నర్సరీ వెయ్యడానికి కంపెనీ పదిసార్లయినా ప్రయత్నించింది. ప్రతిసారీ ఏనుగులు మందలు మందలుగా వచ్చి రూపులేకుండా చేసిపోయాయి. రాత్రిళ్ళు మంటలు వేసుకుని కూలీలు కాపలా వుండేవారు. మంటలారిపోయేవరకూ వుండి నర్సరీని దొమ్మీచేసేవి ఏనుగులు. ఒక్కొక్కప్పుడు పట్టపగలే దాడిచేసేవి. పగబట్టిన ఏనుగులతో పోట్లాడటం వృథా ప్రయాస అని స్టీవెన్సు దొర నర్సరీని ఇంకొకచోటికి మార్చేశాడు.

* * *

తంగముత్తు చెప్పడం పూర్తిచేశాడు. సిమ్మన్సుదొర సందిగ్ధావస్థలో పడ్డాడు. ఆయన నాగరికత ఇదంతా మూఢవిశ్వాస మేమోనని కలవరపెట్టింది. మనస్సు నమ్మమనీ ప్రోత్సహించింది. నెమ్మదిగా జేబులోనుంచి పొగాకు తీసి పైపులో కూరుకుని అగ్గిపుల్లగీసి అంటించాడు. "ఇంక మనం కథలు చెప్పుకోడం మానేసి కొంచెం పనిచేస్తే బాగుంటుందేమో, ఎంతలేదన్నా కంపెనీ జీతంరాళ్ళు ఇస్తూంది కద!" అని నవ్వాడు.

"ఔను సార్!" అన్నాడు తంగముత్తు. * * *



# టెన్నిస్ టూర్నమెంట్

టెన్నిస్ ఆటలకని నాలుగు మూలలా తిరిగి అలిసిపోయి, మిగిలిన సెలవు వారం రోజులూ ఇంటిపట్టున విశ్రాంతిగా గడుపుదామనుకుంటున్న సమయానికి గిరి ఉత్తరం వచ్చిపడింది. కరూరులో తన ఆధ్వర్యాన కాస్మాపాలిటన్ క్లబ్బు టెన్నిస్ టూర్నమెంటు నడుపుతున్నదనీ, నేను తప్పకుండా పాల్గొనాలనీ రాశాడు. రాకపోకల ఖర్చులూ, దిన వెచ్చాలూ మొదలైన టూర్నమెంటు ఆటగాళ్ళ మామూళ్ళు బాగానే ముడతాయని కూడా ఒక ముక్క ఇరికించాడు. ఇండియన్ రేంకింగ్‌కి లెక్కకిరాని కరూరు టూర్నమెంటువంటి ఆటల్లో పాల్గొనేటప్పుడు మేం

ముఖ్యంగా గమనించేది ఖర్చులూ ఇత్యాదికని రాబట్టుకునే సొమ్మే అయినా, ఈసారి నన్నాకర్షించింది అదికాదు. ఈ టూర్నమెంటు గెలవడంవల్ల రేంకింగ్‌కి పాయింట్లురావు. పోనీ గత మాసాల్లో నన్ను జయించిన ముగ్గురిలో యెవరితోనైనా తిరిగి ఆడి గెలవడానికి ప్రయత్నించే అవకాశముందనుకున్నా, ముగ్గురూ కూడా వింబిల్డన్‌లో ఆడడానికి ఇంగ్లండు వెళ్ళిపోయారు. ఇంక కరూరులో ఆడేవారు, ఇంతకుముందు నేను జయించిన వారైనా వుండాలి, లేదా నన్ను గెలవగలిగిన శ్రేణికి చెందినవారు కాకనైనా పోవాలి. అంటే ఈ టూర్నమెంటు గెలవడంవల్ల నాకు ఒరిగేది ఏమీ లేకపోగా, ఏకారణం చేతనయినా ఓడిపోతే టెన్నిస్ లోకంలో చెప్పలేనినామర్దాకలుగుతుంది. కాని ఈ విషయాలన్నీ నన్నంతగా బాధించలేదు. ఇన్నేళ్ళ తరవాత గిరినీ, కమలనీ చూసేఅవకాశం నేను ససేమిరా వదలదలుచుకోలేదు. అసలు ఉత్తరం వచ్చింది మొదలు యెప్పుడు వెళ్ళి వాళ్ళింట్లో వాల్దామా అని మనసు ఒకే ఆరాటపడడం మొదలు పెట్టింది. ఆనాడే బయలుదేరుతున్నట్టు గిరికి తంతియిచ్చాను. కరూరు వెళ్ళడానికి ఒక పగలు మద్రాసులో యెలాగూ ఆగవలసి వుంటుంది. కనుక, వీలుంటే మర్నాడు సాయంత్రం యెగ్జిబిషన్ టెన్నిస్ ఏర్పాటు చేయవలసిందని నా మిత్రుడు రామకృష్ణకి కూడా ఒక తంతి పంపించాను.

మద్రాసులో అనుకోని సంఘటన జరిగింది. యెగ్జిబిషన్ ఆట ముగించి, స్నానంచేసి బట్టలు మార్చుకోడానికని క్లోక్ రూమ్‌కి వెళుతున్న సమయంలో రావుగారు వచ్చి పలకరించారు. రావుగారు, కమల తండ్రి అక్కడ వుండడం నన్నాశ్చర్య పరిచింది, తమంతతామువచ్చి పలకరించడం మరీ ఆశ్చర్య పరిచింది. నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చడానికి ముందే ఆయన తొందరగా మాట్లాడడం ప్రారంభించారు. క్లబ్బులో నేను యెగ్జిబిషన్ ఆడుతున్నట్లూ, తరువాత కరూరు వెళుతున్నట్లూ పొద్దుటి

పేపర్లో చదివి నా సహాయం అర్థించడానికి వచ్చారట. 'కాదనడానికి వీల్లేదు' అన్నారు. ఇంకా ఏదో అదే ధోరణిలో చెప్పుకుపోతున్నారు. నేను ఆయన మాటలు వినడంలేదు. ఆయన రీతిలోని మార్పు, ఆయన మూర్తిలోని నలత నన్ను కలవరపెట్టాయి. రావుగారిని చూసి సుమారు ఆరేళ్ళయింది. అప్పటికీ, ఇప్పటికీ ఆయన ముదురురంగు లౌంజ్ సూటులోనూ, స్టార్చ్ పెట్టిన షర్టు కాలరులోనూ, స్వహస్తాలతో ముడి వేసిన 'బౌ' టైలోనూ, లక్షణంగా మెరుగుపెట్టిన 'కే' షూస్‌లోనూ ఏమీ తేడాలేదు. కాని ఆ గంభీరమైన ఆకారం, కించిత్తయినా తొణకని ఆత్మ విశ్వాసం ఏమైపోయాయి? ఆయనలో నిలువెల్లా విషాదచ్ఛాయలు కనిపించాయి నాకు. బట్టలు మార్చుకొని వచ్చి మాట్లాడదామని చెప్పి, ఆయన్ని క్లబ్‌లాన్ మీద కూర్చోపెట్టి నేను క్లోక్‌రూమ్‌కి వెళ్ళిపోయాను.

స్నానాల గదిలో షవర్ కింద నుంచున్నానన్నమాటే కాని నా మనస్సు అక్కడలేదు. రావుగారికి నేను చెయ్యగలిగిన సహాయం యేముంది? కమల కేదైనా కబురు చెప్పడమో, కాకపోతే ఆమెకేదో తీసుకు వెళ్ళడమో అయివుంటుంది. అయితే, తండ్రీ కూతురూ మన స్పర్ధలు మర్చిపోయి తిరిగి కలుసుకున్నారన్నమాట. కమలా, గిరీ పరిణయం, పెళ్ళి ఆ రోజులన్నీ జ్ఞాపకం వచ్చాయి.

ఆరేళ్ళకిత్రం కమలా, గిరీ మొదటిసారి కలుసుకున్నారు. ఆ యేడాది గిరీ, నేనూ యూనివర్సిటీ టెన్నిస్ పోటీలలో నెగ్గి కొంత పేరు సంపాదించుకోడంవల్ల చాలా టూర్నమెంట్లకి మాకు ఆహ్వానాలు వచ్చాయి. పరీక్షలు అయిపోయిన తర్వాత మైసూరు, బెంగుళూరు, కొల్లీగాల్, మదనపల్లి మొదలైన చోట్లంతా ఆడి చివరకి లాలీ ఇన్స్టిట్యూట్ టూర్నమెంటులో ఆడడానికి ఊటీ చేరుకున్నాం. యెండాకాలం కొండల్లో గడపడానికి వచ్చిన రావుగారూ, కూతురు కమలా లాలీ ఇన్స్టిట్యూట్‌లోనే వుండడంవల్ల మాకు వారి పరిచయం కల్గిఇది. నా పరిచయం

పరిచయంగానే వుండిపోగా కమలా, గిరీ స్నేహం ప్రణయ కలాపంగా మారి కూర్చుంది. నిజానికి అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. గిరి అప్పట్లో బాగానే ఆడేవాడు. మంచి భవిష్యత్తు వుందని పేపర్లు రాసేవి. పైగా అందగాడనే చెప్పుకోవాలి. కాలేజీలో ఆడపిల్లలు అతని స్నేహానికి యెంతగానో ప్రాకులాడేవారు. అసలు ఆడవాళ్ళని ఆకర్షించేశక్తి యేదో అతనిలో వుందని నా ఊహ. అయితే కమల గిరిని పెళ్ళాడడం రావుగారికి సుతరామూ యిష్టంలేదు.

రావుగారు శ్రీమంతుల కుటుంబంలో పుట్టారు. కుటుంబ సాంప్రదాయం, ఆర్థిక స్తోమతు మొదలైనవాటి అవశ్యకత ఆయనలో కరడుగట్టుకుపోయింది. గిరికి చెప్పుకోదగ్గ ఐశ్వర్యంలేదు. అతని తల్లితండ్రులు సమాజంలో అనామకులు; అంటే రావుగారి తరగతికి చెందిన సమాజానికి వారు చెందరు. పోనీ, గిరికి ఉద్యోగమైనాలేదు. రెండు మాసాల క్రితం యమ్. యే. పరీక్ష రాసి వచ్చాడు. అతి గారాబంగా, సమస్త ఐశ్వర్యాలతో పెరిగిన తమ యేకైకపుత్రిక ఇటువంటివాడిని పెళ్ళాడడానికి రావుగారు అంగీకరించలేక పోయారు. కమలా, గిరీ వాళ్ళతో పాటు నేనూ ఆయన్ని ఒప్పించడానికి సకల ప్రయత్నాలు చేశాం. కాని లాభం లేకపోయింది. చివరకి ఆయన యిష్టం లేకుండానే పెళ్ళి జరిగిపోయింది. రావుగారు పెళ్ళికి రాలేదు. కూతురుకీ, తనకీ యింకేం సంబంధం లేదనీ, తన డబ్బులో చిల్లి గవ్వకూడ ఆమెకి రాదనీ మధ్యవర్తులద్వారా కబురు చేశారు. కమల తొణకలేదు.

కమల కొంచెం తెలివిగా ప్రవర్తించినట్లయితే ఇంత రాద్ధాంతం జరిగి వుండకపోనేమో అనిపిస్తుంది నాకు అప్పుడప్పుడు. "నేను గిరిని ప్రేమిస్తున్నాను; పెళ్ళి చేసుకుంటా నాన్నా ?" అని ఆమె రావుగారిని ఎప్పుడూ అడగలేదు. పెళ్ళి చేసుకోడానికి నిశ్చయం చేసుకున్న తర్వాత "మేం పెళ్ళి చేసుకోబోతున్నాం" అని తండ్రితో చెప్పింది. ప్రాణ

సమంగా చూసుకుంటున్న కూతురు తన ప్రసక్తి లేకుండా పెళ్ళి నిర్ణయించుకోడం రావుగారి ఆత్మాభిమానాన్ని గాయపరచి వుంటుంది. బాగా డబ్బున్నవాడూ, ఉన్నత కుటుంబంలో పుట్టినవాడూ కమలకి భర్త కావాలని ఆయన కోరుకున్నా, "గిరిని పెళ్ళి చేసుకుంటే నా జీవితం ఆనందంగా వుంటుంది. నాకోసం ఈ పెళ్ళికి అనుమతి ఇయ్యి" అని కమల అడిగివుంటే తప్పకుండా ఆయన ఒప్పకునేవారని నా అభిప్రాయం.

షవర్‌లో నీళ్ళవేడి ఎక్కువయి, ఒళ్ళు చురుక్కుమన్న తర్వాతగాని ఈ ఆలోచనలోనుంచి నేను బయటపడలేదు. త్వరగా స్నానం ముగించి, బట్టలు మార్చుకుని, రావుగారి దగ్గరకి వెళ్ళాను.

రావుగారు చెప్పింది విని విస్తుపోయాను. రావుగారికి కూతురుమీద కోపం ఆట్టేకాలం నిలవలేదు. కమల తనని నిర్లక్ష్యం చేసినందుకు కోపంవచ్చి అన్ని మాట లన్నారేకాని,కమల వాటినంతగా పాటిస్తుందని అనుకోలేదు. పెళ్ళయిన తర్వాత వచ్చి క్షమాపణ కోరుతుందని ఆయన అభిప్రాయం. కమల రాలేదు.ఆర్థికంగా గిరి స్తోమతు అంతంతమాత్రమే అని ఆయనకు తెలుసు. కొంతకాలానికైనా క్లిష్టపరిస్థితులు ఏర్పడి కూతురు తమ దగ్గరికి వస్తుందని ఆశించారు. కాని పెళ్ళయి నెల తిరగకుండానే గిరి గవర్నమెంటులో మంచి ఉద్యోగం సంపాదించాడు. గవర్నమెంటు జీతంతో కమల అవసరాలు గడవవని కూడా ఆయనకి తెలుసు. ఇంకా కమల వస్తుందనే ఆశ ఆయనకి పోలేదు. తనంత తాను వస్తే కూతుర్ని క్షమించడానికి ఆయన కాచి పెట్టుకుని వున్నారు. అది పడలేదు. కమల తన అవసరాలను తగ్గించుకుంది. కూతురు తిరిగి రానందుకూ, అంతకంటే తననుకున్న ప్రకారం ఒక్కటీ జరగనందుకూ ఆయనకి పట్టరాని కోపం వచ్చింది. ఇంక కమలను గురించి ఆలోచించనని భీష్మించి కూచున్నారు. కాని ఆమెను మరచిపోవడం ఆయన తరం కాలేదు. తల్లిపోయిన నాటినుంచి తనే తల్లీ, తండ్రీగా ఆమెని సాకుతూ

వచ్చారు; ఆమెకోసం తిరిగి పెళ్ళి చేసుకోడం మానేశారు. కమల ఆయన జీవితంలో ఒక భాగమైపోయింది. ఆత్మాభిమానం దిగమింగి కూతురికి రమ్మని ఉత్తరాలు వ్రాశారు. కమల జవాబివ్వలేదు. డబ్బు పంపించారు. తిరిగి వచ్చేసింది. చివరకి వుండబట్టలేక కూతురి ఇంటికి వెళ్ళారు. కమల ఆయన్ని పలకరింపనైనా లేదు. ఆయన్ని చూసిన మరు క్షణమే స్నేహితుల ఇంటికి వెళ్ళి కూచుంది. చేసేదిలేక తిరిగి మద్రాసు వచ్చేశారాయన.

"ఇంక నేం చెయ్యగలిగిందేమీలేదు. భారం మీమీద వేస్తున్నాను. ఏం చెప్పి దాని మనస్సు మారుస్తారో !"

రావుగారు దగ్గరగా జరిగి నా రెండు చేతులూ తమ చేతుల్లోకి తీసుకుని అన్నారు. ఆయన దీనస్వరం నన్ను కలిచివేసింది. శాయశక్తులా ప్రయత్నిస్తానని చెప్పి సెలవు తీసుకున్నాను.

• • •

స్టేషనుకి కమల ఒక్కతే వచ్చింది.

"గిరి ఎక్కడ ?" అని అడిగాను.

"ఒక పక్కన టెన్నిస్ వుండగా ఆయనగారికి తీరిక ఎక్కడుం టుంది ?" నవ్వింది.

"అయితే గవర్నమెంటు ఉద్యోగం కూడా ఇతని టెన్నిస్ పిచ్చి వదలగొట్టలేక పోయిందన్నమాట ?"

"ఉద్యోగానికి కాదుగదా, దేనికీ సాధ్యంకాదు"

ఇద్దరం నవ్వుకున్నాం.

కార్లో ఎక్కుతూ కమల చెప్పింది : "బట్టలు మార్చుకుని నిన్ను క్లబ్బుకి రమ్మన్నాడు"

ప్రయాణ అలసటమీద నాకు ఆడబుద్ధి కాలేదు.

"నాకు పొద్దున్న 'మేచ్' వుందేమో తెలుసా ?" అని అడిగాను.

"ఇప్పుడు కాదు గాని సాయంత్రిం సింగిల్సూ, డబుల్సూ కూడా ఆడాలి. ఇప్పుడు కొంచెం ఆడితే కోర్టుకీ, బంతులకీ అలవాటవుతుంది కదా !"

"మొదటి రెండురోజులూ బహుశా కష్టమేమీ వుండదు. అయినా, ఇంటికివెళ్ళి బట్టలు మార్చుకునివచ్చి ఈ ఎండలో గంతులెయ్యడం నావల్లకాదు"

"నిజమే" ఒప్పుకుంది కమల.

"దార్లో ఒక నిముషం క్లబ్బు దగ్గిర ఆగి గిరిని పలకరించి పోదాం" అన్నాను.

కాస్తో కూస్తో సేపటికి గిరి ఇంటికే వచ్చేస్తాడు. అయినా వెంటనే అతన్ని చూడకుండా వుండడానికి మనసు ఒప్పలేదు. ఒకసారి పూర్వం మాదిరి వీపులు చరచుకుని ఆప్యాయంగా అరుచుకుంటే కుతి తీరి పోతుంది. కమలకి క్లబ్బు దగ్గిర ఆగడం ఇష్టంలేకపోయింది.

"నన్ను ఇంటిదగ్గిర దింపేసి నువ్వు వెళ్ళు" అంది.

క్లబ్బుకి వెళితే ఒకపట్టాన ఊడిపడనేమోనని ఈవిడ భయమేమో నని నేను అన్నాను. "ఒక్క నిముషం అంటే ఒక్క నిమిషమే. అలా తొంగిచూసి వచ్చేద్దాం. ఎంతకాదన్నా ఒకప్పుడు ప్రాణస్నేహితులం కదా !"

"నన్ను దింపేసి వెళ్ళు నీకు పుణ్యం వుంటుంది. నే వెళ్ళేవరకూ ఇంటిదగ్గర పనులన్నీ కూచుంటాయి"

ఆమె పై ఖరి నన్ను పట్టుబట్టనియ్యలేదు.

గిరి వచ్చేలోగా కమలా, నేనూ పిచ్చాపాటీ మాట్లాడుతూ కూచు న్నాం. ఇదే మంచి సమయం అని రావుగారి విషయం కదిపాను. కమ

లలో చెప్పలేని మార్పు వచ్చింది. ఆమె నవ్వూ, చిలిపితనం ఒక్క సారిగా మాయమైపోయాయి. మొహం జేవురించింది. గొంతు జీర పడింది. శరీరం కోపంతో ఒణుకుతున్నట్లని పించింది.

రాత్రి రైల్లో నాకంటికి కునుకుపట్టలేదు. రావుగారి తరఫున కమ లని ఎలా ఒప్పించాలో, ఎన్నివిధాలగా నచ్చచెప్పే అవకాశాలున్నాయో ఆలోచించడంలోనే తెల్లవారిపోయింది. కాని ఇప్పుడదంతా వృధా అయి పోయింది. ఆమె ఎదురుగా కూర్చుని ఈ విషయమై నోరు విప్పగల సాహసం నాకు లేకపోయింది. అప్పటికీ ఒకటి రెండుసార్లు రైల్లో వర్ణిం చిన పాఠం అప్పచెప్పడానికి పూనుకున్నాను. కాని ఒక్కమాటలో ఆమె నానోరు కట్టేసింది. ఇంకొక్కసారి నే నీ ప్రసక్తి తెచ్చినట్లయితే నాతో మాట్లాడడం మానేస్తానని బెదిరించింది. తన కవసరమైనప్పుడు చూపించ లేని ప్రేమ, వాత్సల్యం అనవసరమైనప్పుడు అంగీకరించలేనంది. ముసలితనంలో ఒంటరితనం భరించలేక సహవాసం కొనుక్కుందామను కునే వాళ్ళకి అమ్ముడుపోడానికి తను బజారులో సరుకు కానంది. ఇన్నేళ్ళ తరవాత ఆమెలో ఈ కాఠిన్యం నన్నాశ్చర్య పరిచింది. నేను మారు మాట్లాడలేక పోయాను.

గిరి క్లబ్బునుంచి వచ్చి ఆదరా బాదరాగా రెండు మెతుకులు నోట్లోవేసుకుని ఆఫీసుకి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. "నేను క్లబ్బులో దిగి నీకు కారు పంపిస్తాను" అన్నాడు.

"ఇంటికి వచ్చి బట్టలు మార్చుకుని వెళ్ళవా ?" అని అడిగాడు.

"నాలుగుమైళ్ళు ఇంటికి వచ్చి వెళ్ళేలోపున రెండు సెట్లు ఆడుకో వచ్చు. నా టెన్నిస్, బట్టలు క్లబ్బులోనే వదిలేస్తాను" అన్నాడు.

నాకు నవ్వొచ్చింది అతని టెన్నిస్ పిచ్చి చూసి.

"అయితే కారు నాలుగున్నరకి పంపించు" అన్నాను.

"అంత ఆలస్యంగా వస్తే ఎలా ? మూడున్నరకైనా అక్క డుండాలి" అన్నాడు.

"మూడుగంటలకి కమల సిద్ధం అవగలదా? నాకోసారి, తనకొక సారి కారు రావడం ఎందుకని నాలుగున్నర అన్నాను"

"కమల వస్తుందా ?" సంతోషంగా ప్రశ్నించాడతను.

"కమల కీవాళ మేచ్ లేదా ?" అన్నాను.

"నువ్వు ఆరేళ్ళకిత్రితం కమల గురించి మాట్లాడుతున్నావ్ ?" ఆమెవైపు కొంటెగా చూసి నవ్వాడు గిరి. "పెళ్ళి కావడంలో ఆడవాళ్ళ జీవితాశయం ఫలించినట్టే. దాంతో మునపటి తళుకు బెళుకులన్నీ వదిలి పెట్టి ముసలమ్మలై కూర్చుంటారు"

తన మాటల్లో హాస్యం అతనికైతే తృప్తి నిచ్చినట్టుంది కాని, కమలకి రుచించలేదు.

"కమలా ! నువ్విలా ముభావంగా వుండడం బాగాలేదు. టూర్న మెంటులో ఆడనన్నావు; కమిటీ మెంబరుగా వుండనన్నావు. ఆట చూడ్డానికి కూడా రావడంలేదు. క్లబ్బులో అందరూ నొచ్చుకుంటున్నారు తెలుసా ?" అన్నాడతను మళ్ళీ.

"నొచ్చుకునే వాళ్ళంతా వొచ్చి ఈ యింటెడు పనీ చేస్తారా ?" అని అడిగింది కమల.

"నీ కెప్పుడూ ఒకే సాకు. ఎవరైనావింటే నేను పనివాళ్ళని పెట్టననుకుంటారు" గిరి వెళ్ళిపోతూ అన్నాడు.

• • •

నేనెంతో పట్టుబడితేకాని కమల క్లబ్బుకి రావడానికి ఒప్పుకో లేదు. నా కాశ్చర్యం వేసింది. ఒకప్పుడు ఆవిడ టెన్నిస్ అంటే చెవి కోసుకునేది.

"ఈ క్లబ్బంటే నీ కిష్టంలేదా ?" అని అడిగాను. ఇక్కడి మనుష్యులు ఆవిడకి సరిపడలేదని నా అనుమానం.

"ఇష్టంలేకపోడం కాదు. నాకు నిజంగా తీరిక వుండదు" అంది.

"యేమిటంత పని ?"

"సంసారం చూసుకోవాలి గదా ! అన్నీ పనివాళ్ళమీద వదిలి పెట్టేమంటే ఇల్లు గుల్లయినట్టే. పోనీ, తోట చూశావా ? మాకు ముందు ఇక్కడవున్న మహానుభావు లెవరో కాని ఒక్కరోజు కూడా చెట్లకి నీళ్ళు పోసినట్టులేదు. అంతా సరిచేసుకుని వచ్చేటప్పటికి నా పనవు తూంది"

ఆవిడ గొంతులో యేదో ధ్వని ఈ కారణం నిజంకాదని చెపు తూంది. నా కసలు కారణం తెలుసుకోవాలని వుంది; కాని సంభాషణ ఎలా సాగించాలో తెలియలేదు.

"నాతో మిక్సెడ్ డబుల్సు ఆడతావా ?" అని అడిగాను.

"ఇంకా టెన్నిస్ ఆడుతూ కూచోడానికి నేనేం చిన్నపిల్లని కాదు"

"అయితే మేమంతా చిన్నపిల్లల మంటావా ?"

"నీ సంగతి వేరు; నువ్వింకా బ్రహ్మచారివి"

"దానికీ టెన్నిస్‌కీ సంబంధం యేమిటి ?"

"పెళ్ళయిం తరువాత కూడా దేశదిమ్మరిలా టెన్నిస్ టూర్న మెంట్లు చుట్టూ తిరుగుతా నంటావా యేం ? పెళ్ళాం కావాలో, టెన్నిస్ కావాలో నిర్ణయం చేసుకుని మరీ పెళ్ళాడు" నవ్వింది.

"నవ్వులకేంగాని,కమలా! నువ్వు తప్పకుండా నాతో ఈ టూర్న మెంటులో ఆడాలి"

"అది మాత్రం అడక్కు. నేను రేకెట్ ముట్టుకుని మూడేళ్ళ పయినయింది"

"అయితే మళ్ళీ మొదలుపెట్టు"

"మా ఇద్దరికీ సరిపడా తను ఆడుతున్నాడుగా, చాలు"

మళ్ళీ నవ్వింది కమల.

. . .

రాత్రి భోజనాల ముందు డ్రాయింగ్ రూమ్‌లో కూచుని గిరీ, నేనూ పాతముచ్చట్లు నెమరువేసుకుంటున్నాం. కమల కొంచెం దూరంలో వరండాలో కూర్చుని యేదో అల్లుకుంటూంది.

"నువ్వింతా ఇంత బాగా ఆడుతున్నావనుకోలేదు" అన్నాను గిరితో. గిరి మొహం సంతోషంతో వికసించింది.

"మునుపటికంటే బాగా ఆడుతున్నాను కదూ ?" అన్నాడు.

నిజానికి నా కలా అనిపించలేదు. ఈ ఆరేళ్ళల్లోనూ అతని ఆట బాగా దెబ్బతిని వుంటుందనుకున్నాను కాని ఆ సాయంత్రం చూసిం దాన్నిబట్టి అనుకున్నంత దిగజారిపోలే దనిపించింది. అంతే. అయినా, నిజం చెప్పి అతన్ని నొప్పించడ మెందుకని "ఔను" అన్నాను. దానితో అతని ఉత్సాహం ఎక్కువయింది.

"ఆ డూటీ టూర్నమెంటుతో మానెయ్యకుండా వుంటే ఈపాటికి ఇండియన్ రేంకింగ్‌లో వుందును. ఏమంటావ్ ?" అన్నాడు.

"లేనందుకు విచారించవలసిన పనిలేదు. అదృష్టవంతుడివి, మంచి భార్యనీ, ఉద్యోగాన్నీ కూర్చి పెట్టుకున్నావ్ !"

"అందరూ అదృష్టవంతుణ్ణనే వాళ్ళేకాని నా టెన్నిస్ ధ్వంసం అయిపోయినందుకు విచారించేవాళ్ళెవరూ కనిపించరు"

"నా మట్టుకి టెన్నిస్‌కంటే ఉద్యోగమే ముఖ్యం అనిపిస్తుంది.

రేంకింగ్ మూన్నాళ్ళ ముచ్చటా, ఉద్యోగం, సంసారం బతికున్నన్నాళ్లూ అంటిపెట్టుకుని వుండేవీను"

"నే నొప్పుకోను. టూర్నమెంటు టెన్నిస్ నాకిచ్చే ఆనందం ఇంకేమీ ఇవ్వలేదు. అంతకంటే జీవితంలో కోరగలిగిందే ముంటుంది ? నిజానికి గతిలేక నే నీ ఉద్యోగం చేస్తున్నాను"

"ఉద్యోగంలో పదిలంగా కూర్చుని వున్నావు కాబట్టి అలా మాట్లాడుతున్నావు"

"కాదు, నిజంచెప్తున్నాను. నేనంత తొందరగా పెళ్ళి చేసుకుని వుండకపోతే యే గొడవా వుండేదికాదు. ఉద్యోగంలో వెంటనే ప్రవేశించ వలసిన అగత్యం వుండకపోను. ఇంకా టెన్నిస్ ఆడివుందును"

కమలకి వినిపించే అంతదూరంలో ఈ చర్చ సాగించడం నాకు నచ్చలేదు. బయట చల్లగాలి సాకుచెప్పి అక్కడనుంచి లేచిపోయాను.

ఫైనల్సు నాడు రాత్రి ఆటగాళ్ళకీ, మెంబర్లకీ క్లబ్బు డిన్నర్ యేర్పాటు చేసింది. నేనెంతో పట్టుబడితే కాని కమల రావడానికి ఒప్పుకో లేదు. మేం వెళ్ళేసరికి క్లబ్బు కోలాహలంగా వుంది. ఇద్దరు ముగ్గురు జట్లుగా జనం విడిపోయి అరుచుకుంటూ, నవ్వుకుంటూ ఆనందిస్తున్నారు. సెక్రెటరీ చేతిలో డ్రింక్ పట్టుకొని అందరినీ నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించాడు. "ఈ డ్రింక్ టూర్నమెంట్లో గెలిచిన వ్యక్తుల ఆరోగ్యానికి" అని 'టోస్ట్' చెప్పాడు. అంతా చప్పట్లు చరిచారు. కొందరు గెలిచిన వ్యక్తుల ఆట గురించి వివరంగా మాట్లాడారు. తరు వాత ఒక వ్యక్తి లేచి గిరికి 'టోస్ట్' చెప్పాడు. "ఇది ఇటువంటి టూర్న మెంట్లు ఎన్నో గెలవగల సామర్థ్యంగల వ్యక్తి ఆరోగ్యానికి" అని అరిచాడు. క్లబ్బంతా చప్పట్లతో మారుమోగిపోయింది. ఇంకొకవ్యక్తి లేచి గిరి ఆటని ప్రశంసించాడు.

"ఈయన కూడా పేరుపొందిన ఆటగాళ్ళలాగా దేశం అంతటా తిరిగి ఆడితే నేషనల్ ఛాంపియన్‌షిప్పు గెలవడానికి సందేహం లేదు"

హాల్లో గొంతుకలు "హియర్, హియర్" అన్నాయి. ఇంకొక వ్యక్తి లేచాడు. ఇంతలోనే కమల వచ్చి తన్ని ఇంటికి తీసుకువెళ్ళమని అడిగింది.

"తలనొప్పిగా వుంది" అంది.

"గిరితో చెప్పి వస్తాను" అన్నాను.

"తను గొడవలో వున్నాడు, ఎందుకు కదపడం. తాళాలు కారుకి వుంటాయి పద" అంది.

కారు కొంతదూరం వెళ్ళాక కమల అడిగింది.

"నిన్నొకటడుగుతాను; నిజం చెప్తావా ?"

"తెలిస్తే తప్పకుండా చెప్తాను"

"గిరి టెన్నిస్ గురించిన ఆ మాటలన్నీ నిజమేనా ?"

నాకేం చెప్పాలో తెలియలేదు.

"ఇక్కడి వాళ్ళందరికీ అతని ఆటంటే చాలా అభిమానం ఉన్నట్టుంది" అన్నాను.

"నీ ఉద్దేశం ఏమిటి ? నువ్వు దీనిలో ప్రవేశం వున్నవాడివి"

"నువ్వేమీ అనుకోవుగదా ?"

"అనుకోను"

"అయితే విను. గిరిని గెలవగలవాళ్ళు ఇండియాలో ఊరి ఊరికీ వుంటారు"

"ఇక్కడ ఎవరూ లేరు"

"ముక్కకి ముక్క అర్థం తియ్యకు కమలా ! నేననేది ప్రస్తుతం అతని ఆట టూర్నమెంట్లు గెలవడానికి చాలదు"

"ఉద్యోగంవల్ల తనకి ఆడడానికి ఎక్కువ టైముండదు"

"ఔను"

"శైమండి ఆడగలిగితే రేంకింగ్‌లోకి రాగలడంటావా ?"

"మధ్యలో మానెయ్యకుండా వుంటే ఎంతవరకూ వచ్చేవాడో చెప్పలేను కాని, ఇప్పుడెంత తంటాలుపడ్డా ప్రయోజనంలేదు"

"ఎంచేత ?"

"గిరికి ఇప్పుడు ఇరవై ఎనిమిదేళ్ళు, ఔనా ?"

"ఔను"

"అంటే టెన్నిస్ ఛాంపియను రిటైరయ్యే వయస్సు"

"ఉఁహుఁ"

"రెండవది. పెళ్ళికీ, ఇప్పటికీ ఇరవైపౌన్ల బరువైనా ఎక్కువయ్యాడంటావా ?"

"ఏమో !"

"పోనీ, యూనివర్సిటీలో ఆదేకాలంలో కూడా అతను ఏమంత పెద్ద ఆటకాడు కాదు. కృషి మంచి ఫలితాలు ఇచ్చి వుండేదేమో కాని అతను చెయ్యలేదు. ఆ కాస్త ఆటకూడా ఇప్పుడు మర్చిపోయాడు. ఇక్కడ క్లబ్బులో నలుగురినీ గెలిచి ఇండియా అంతా గెలవగలనను కొంటున్నాడు"

"ఈ ఉద్యోగం బెడదలేకపోతే ఇప్పటికైనా డేవిస్ కప్పుకి ఆడ గలనని తన ధైర్యం"

"ఇంకా గిరికి టెన్నిస్‌మీద మమకారం తగ్గలేదు. పాతకలలు మర్చిపోలేకుండా వున్నాడు"

"అంతే అంటావా ?"

"అంతేనేమో కమలా !"

ఇంటికి వెళ్ళేవరకూ మేమింకేమీ మాట్లాడుకోలేదు.

* * *

తరువాత నాలుగు నెలలకి మద్రాసు వెళ్ళవలసి వచ్చింది. మౌంట్‌రోడ్‌లో గిరి తటస్థపడ్డాడు.

"నువ్వెప్పుడొచ్చావ్ ?" అన్నాను.

"ఇప్పుడిక్కడే వుంటున్నాను. మీ రేంకెడ్ ప్లేయర్స్ పని పడతానులే" నవ్వాడు గిరి. నాకేమీ అర్థం కాలేదు.

"ఉద్యోగం వదిలేశాను" అన్నాడు మళ్ళీ.

"అంతమంచి ఉద్యోగమా ?"

నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చకుండా వుండలేకపోయాను.

"అసలుకథ చెప్తాను పద !"

ఇద్దరం పక్కనున్న టీ సెంటరుకి నడిచాం. కూర్చుని రెండు కోల్డ్ టీ తెమ్మని చెప్పి గిరి మొదలు పెట్టాడు.

"ఇదంతా కమల పని. కరూర్ టూర్నమెంటు తన్ని బాగా కదిపినట్టుంది. ఆ డిన్నర్ రాత్రి నా ఆట గురించి స్నేహితులు మాట్లాడారు. జ్ఞాపకం వుందా ?"

"ఉంది" అన్నాను.

"అప్పటినుంచీ నా ఆట వృథా పోనియ్యకూడదని ఒకటేపట్టు. మద్రాసులో వ్యాపారంపెట్టి, టెన్నిస్ ఆడమని తన ఉద్దేశం"

"డబ్బు ?"

"తండ్రి వున్నాడుగా !"

"తండ్రి డబ్బుతో వ్యాపారం పెట్టమందా కమల ?" నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను.

"ఆశ్చర్యంగా లేదూ ! ఆయన సొమ్ము దమ్మిడీ అయినా ముట్టనన్నది. ఇప్పుడు తనే వెళ్ళి డబ్బు అడిగింది"

"అకస్మాత్తుగా ఎందుకు మనసు మార్చుకుంది ?"

"నా టెన్నిస్ కోసం. నేను ఏ వింబిల్డన్ ఛాంపియనో అవుతానను కొంటుంది" సంతృప్తిగా నవ్వాడు గిరి.

కమల అలా అనుకోడంలేదనీ తనకి పోటీగా గిరిని ఆకర్షిస్తూ వచ్చిన టెన్నిస్‌లో అతని అసమర్ధత నిరూపించడంకోసం కరడు గట్టిన ద్వేషాన్ని సహితం మర్చిపోయి తండిప్రపంచ జేరిందనీ నేను గ్రహించాను. కాని నా స్నేహితుడికి చెప్పడానికి నోరు రాలేదు. * * *



# ఉద్యోగం

"వన్ నోట్రింప్"

"నో బిడ్"

"త్రీ స్పేడ్స్"

"నో బిడ్"

"ఫోర్ నో ట్రింప్స్"

"నో బిడ్"

"ఫయివ్ హార్ట్స్"

"నో బిడ్"

"సెవెన్ స్పేడ్స్"

రంగారావు కళావరు పది ఆడేడు. జస్టిస్ జగన్నాధం పద్దెనిమిది పాయింట్ల డమ్మీ చెయ్యి టేబిల్‌మీద పరుస్తూ, అయిదు స్పేడ్ ముక్కల్ని చూపించి పార్ట్నర్ని అడిగాడు.

"ఎలా వుంది ?"

"థాంక్యూ పార్ట్నర్ !" అంది మిసెస్ జగన్నాధం.

బేరరు ట్రే తీసుకు వచ్చాడు. ట్రేలో అప్పుడే వచ్చిన ఉత్తరాలు వున్నాయి. జస్టిస్ జగన్నాధం గబగబా అన్నిటిమీద దస్తూరీ చూసి ఒక కవరు తీసి చింపాడు.

"ఎక్కణ్ణుంచి ?" మిసెస్ జగన్నాధం అడిగింది.

"ముందు నీ గ్రాండ్ స్లామ్ కానియ్, చెప్తాను"

"ఏం పరవాలేదు చెప్పు"

"ఆడేటప్పుడు ఇవన్నీ పట్టించుకుంటే నీకు బ్రిడ్జి వచ్చినట్టే"

జస్టిస్ జగన్నాధం నవ్వేడు. ఆయన బ్రిడ్జిలో ఆరితేరిన ఆటగాడు. మిసెస్ జగన్నాధం కొంతకాలం క్రితమే నేర్చుకోడం ప్రారంభించింది. క్లబ్బులో ఆడాలని ఆవిడకి సరదా. అయితే అది అంత తేలికయిన విషయం కాదు. బ్రిడ్జి ఆటగాళ్ళు ఏం చెయ్యమన్నా చేస్తారుగాని స్నేహితులు కానీ, ఎవరుకానీ, తప్పు ఆట ఆడితే మటుకు విమర్శించకుండా వుండలేరు. నేర్చుకునే వాళ్ళతో ఆడడం చాలా మందికి ఇష్టం వుండదు. కొత్తగా నేర్చుకునే రోజుల్లో వీళ్ళుపడే భయం, సందేహం ఏ కొద్ది మందికోగాని జ్ఞాపకం వుండదు. జ్ఞాపకం వున్నవాళ్ళలో కూడా ఒక రకం మనస్తత్వం అలవడినట్టు కనిపిస్తుంది. ఒకప్పుడు విమర్శకి ఎంత నొచ్చుకున్నా, తాను ఒగ్గి నేర్చుకున్నారు కాబట్టి కొత్తగా నేర్చుకొనే

వాళ్ళు కూడా అదే విధంగా నెగ్గుకుని రావలసిందే! ఏమయినా మిసెస్ జగన్నాధం క్లబ్బులో బ్రిడ్జి ఆడడానికి ధైర్యం చెయ్యలేదు. ఇంటిదగ్గిర స్నేహితుల్తో ఆడడంతో ప్రారంభం చేసింది. రంగారావూ, ఆయన భార్య కూడా ఆట నేర్చుకుంటున్నవాళ్ళే. అందుచేత రోజూ రంగారావు ఇంట్లోనో, జడ్జీగారి ఇంట్లోనో ఆట సాగుతుంది. జస్టిస్ జగన్నాధం ఎవరెవరు ఎప్పుడు తప్పు ఆడేరో విడమర్చి చెప్పి, ఎలా ఆడాలో నేర్పుతాడు.

"పోనీలే" మిసెస్ జగన్నాధం కోపం అభినయించి ఆటలో పడి పోయింది.

జస్టిస్ జగన్నాధం టేబిల్ వదిలి దూరంగా కిటికీ దగ్గిరవున్న సోఫాలో కూర్చుని ఉత్తరం చదవడం ప్రారంభించాడు.

"స్లామ్ నెగ్గాం" సంతోషంగా అరిచింది మిసెస్ జగన్నాధం.

"అంతేకాదు. దాంతో స్ట్రెయిట్ రబ్బర్ కూడా గెలిచారు" స్కోర్ పేడ్ మీద అంకెల్ని కూడుతూ మిసెస్ రంగారావు అంది.

"డబ్బుపోతే పోయింది, దాని విలువకి టీ అయినా తాగుదాం" అన్నాడు రంగారావు ప్లేట్లో కేక్ తీసుకుంటూ.

"పదహారు పాయింట్లు! ఇలా అయితే మనం ఆస్తులు అమ్ముకోవలసిందే" అంది మిసెస్ రంగారావు.

వాళ్ళు పాయింటుకి ఇరవై నయాపైసల చొప్పున ఆడతారు. అది స్వల్పం అని మిసెస్ రంగారావు అభిప్రాయం. జడ్జీగారు మాత్రం దాన్ని పెంచడానికి ససేమిరా ఒప్పుకోరు. ఇరవై నయాపైసలవరకూ అయితే పరవాలేదు. అంతకు మించితే జూదం చట్టవిరుద్ధం అని ఆయన అంతరాత్మ ఘోషిస్తుంది.

టీ కలుపుతున్న మిసెస్ జగన్నాధానికి ఉత్తరం విషయం జ్ఞాపకం వొచ్చింది.

"ఉత్తరం ఎక్కణ్ణుంచి జగన్" ఆమె అడిగింది.

"నిర్మల్ రాసింది"

"ఏమిటి విశేషాలు ?"

"ఎప్పటిగోలే. అతనికి ఉద్యోగం చూడమంటుంది"

"పాపం. అంతగా అడుగుతుంటే సాయం చెయ్యకూడదూ ?"

"ఉద్యోగాలు ఇవ్వడానికి నా చేతుల్లో వున్నయ్యా ?"

జస్టిస్ జగన్నాధం విసుక్కున్నాడు.

"ఎవరికి ఉద్యోగం ?" రంగారావు అడిగాడు.

"వెంకట్‌కి" మిసెస్ జగన్నాధం సమాధానం ఇచ్చింది.

"వెంకట్ ఎవరు ?"

"మా అల్లుడు; నిర్మల్ మొగుడు"

వాళ్ళ అల్లుడు రాజమండ్రిలో 'లా' ప్రాక్టీసు చేస్తున్నాడని రంగారావుకి తెలుసును, కాని అతని పేరు జ్ఞాపకం రాలేదు.

అందరూ నిర్మల్ మొగుడనే అంటారు.

"నిజంగా కావాలంటే అతనికి ఉద్యోగమే దొరకదా ?" అన్నాడు రంగారావు.

"దొరకక్కే ఇత తాపత్రియం"

మిసెస్ జగన్నాధం మాటల్లో మొగుడుమీద సాధింపు వుంది.

"ఇక్కడికి రమ్మనండి, నే నిస్తాను" అన్నాడు రంగారావు.

రంగారావు ఫోర్బ్స్ ఎండ్ మెథీసన్ కంపెనీకి జనరల్ మేనేజరు. అతనూ, జగన్నాధం పాతికేళ్ళ క్రితం బార్-ఎట్-లా ఇంగ్లండులో ఒకే 'ఇన్' నుంచి చదువుకున్నారు జగన్నాధం మూడేళ్ళక్రితం హైకోర్టుజడ్జి అయి హైదరాబాదు వచ్చినప్పుడు, పాత పరిచయాన్ని పురస్కరించుకొని రంగారావూ, భార్యా జడ్జిగారింటికి వెళ్ళేరు. జగన్నాధం దంపతులకీ, వాళ్ళకీ బాగా కలిసి స్నేహం వృద్ధిపొందింది.

"థాంక్స్ రంగా !" అన్నాడు జస్టిస్ జగన్నాధం. ఉద్యోగం వేయించాలని వుంటే నీతో ఎప్పుడో సంప్రదించేవాణ్ణి. వెంకట్ ఉద్యోగం చెయ్యడం నా కిష్టంలేదు.

"ఏం ?" అన్నాడు రంగారావు.

"అతను లాయరుగా పైకి వొస్తాడని నా నమ్మకం"

"అయితే 'లా'ని అంటిపెట్టుకుని వుండవలసిందే. ఉద్యోగాలు చేసి మనం సంపాదించే దెంత ? దాచేదెంత ?"

రంగారావు మాటల్లో తన ఉద్యోగం గురించి తృప్తి సర్మంగా దాక్కుని వుంది. అతనికి నెలకి అయిదువేల రూపాయల జీతం వొస్తుంది. కారూ, ఇల్లూ కంపెనీదే. ఇదికాక బోలెడు బోనసు.

"డబ్బు మాట సరే రంగా ! వెంకట్‌లాటి వాడు ఆఫీసు బల్ల ముందు కూచుని కాగితాలమీద సంతకాలుచేస్తూ కాలం గడిపేయడం అన్యాయం"

"యువర్ లార్డ్ - షిప్‌కి మా ఉద్యోగాలమీద సరయిన అభిప్రాయం వున్నట్టులేదు" రంగారావు నవ్వేడు.

"సారీ రంగా !" అన్నాడు జస్టిస్ జగన్నాధం. "అన్ని ఉద్యోగాల గురించీ నే ననడంలేదు. మన పలుకుబడి వుపయోగించి వేయించిన ఉద్యోగాల్లో అంతకంటే ఏం పని వుంటుంది ?"

"నిజమే" అన్నాడు రంగారావు.

"మన పలుకుబడివల్ల వచ్చిందని జీతం ఇవ్వడం మానెయ్యరు కదా !"

మిసెస్ జగన్నాధం అడ్డు తగిలింది. ఆమె మాటల్లో వ్యంగ్యం జస్టిస్ జగన్నాధాన్ని చికాకు పరిచింది.

"జీతం, జీతం" అన్నాడు.

"అంతేకాదు. ఎయిర్ కండిషన్డ్ ఆఫీసూ, విదేశాల్లో విహారాలూ. ఇంకా ఏమిటి రంగా ?"

రంగారావు వైపు చూసింది మిసెస్ జగన్నాథం.

ఫోర్బ్స్ ఎండ్ మెథీసన్ కంపెనీకి ఎయిర్ కండిషన్డ్ ఆఫీసు గదులున్నాయి. ఏడాదికొక నెల కంపెనీ ఖర్చుమీద భార్యాపిల్లలతో సహా రంగారావు ఊటీయో, కాశ్మీరో, ముస్సోరీయో ఏదో విలాస స్థలానికి వెళుతూ వుంటాడు. మూడేళ్ళ కొకసారి ఆరునెల్లపాటు విదేశాల్లో సెలవు గడపడానికి కంపెనీ ఖర్చు భరిస్తుంది. ఇంకా ఇటువంటి సౌకర్యాలెన్నో కంపెనీ అతనికి కల్పిస్తుంది.

రంగారావు మాట్లాడలేదు; చిరునవ్వు నవ్వేడు.

"నీ అల్లుడికి మొదటే జనరల్ మేనేజర్ ఉద్యోగం వేయించేస్తావా ఏమిటి ?" అన్నాడు జస్టిస్ జగన్నాథం.

"సుశీ తలుచుకుంటే వేయించలేదా ?"

నవ్వేడు రంగారావు.

"అసిస్టెంటుకి మాత్రం ఏమంత తక్కువ రాదుగా !" అంది మిసెస్ జగన్నాథం.

అది నిజమే. బ్రిటిష్ పద్ధతుల్లో నడిచే కంపెనీలకి రెండు గ్రేడ్లు వుంటాయి. కవెనెంటెడ్ గ్రేడులో ఆఫీసర్లుగానే తీసుకుంటారు. అన్ కవెనెంటెడ్ గ్రేడ్‌లో గుమాస్తాలూ, వాళ్ళూ వుంటారు. అసిస్టెంట్ కవెనెంటెడ్ ఆఫీసరు, దగ్గర దగ్గర వెయ్యి రూపాయల జీతం వస్తుంది. జనరల్ మేనేజరుకి మూడేళ్ళ కొకసారి విదేశాల్లో సెలవు ఇస్తే అసిస్టెంటుకి అయిదేళ్ళ కొకసారి ఇస్తారు. అలాగే అన్ని సౌకర్యాలూను.

"వెంకట్ ఇప్పుడే అంత సంపాదించలేక పోవచ్చు. కాని ముందు ముందు ఉద్యోగాల్లో ఎవరూ సంపాదించలేనంత సంపాదిస్తాడు. నా

మాట నమ్మ. ఈ విషయాల్లో కాస్తో కూస్తో అనుభవం వున్నవాణ్ణి" అన్నాడు జస్టిస్ జగన్నాథం.

"సంపాదించవలసిందే ఆ మహా పట్నంలో" అంది మిసెస్ జగన్నాథం.

"ఏం, అక్కడ మాత్రం సంపాదించిన వాళ్ళు లేరా?" అడిగాడు జస్టిస్ జగన్నాథం.

"సుశి చెప్పింది కూడా నిజమే" అన్నాడు రంగారావు. "అక్కడ అభివృద్ధికి ఏమంత అవకాశం వుంటుంది ? హైకోర్టుకి వొచ్చెయ్య కూడదూ ?"

"కొంతకాలం ఆగి వస్తాడు"

"ఏం ?"

"ఇప్పుడిప్పుడే అక్కడ పేరు సంపాదించుకుంటున్నాడు. ఇంకొక రెండు మూడేళ్ళు వుండి దాన్ని స్థిరం చేసుకుంటే హైకోర్టుకి వచ్చిం తర్వాత అపైపు పనంతా తనకే వస్తుంది"

"నీ పిచ్చినమ్మకమే నీకు" అంది మిసెస్ జగన్నాథం. మొదటి సారి వెంకటరమణని చూసినప్పుడే జగన్నాథానికి అతని సామర్థ్యంలో నమ్మకం కుదిరింది. అప్పుడు జగన్నాథం రాజమండ్రిలో డిస్ట్రిక్టు ఎండ్ సెషన్స్ జడ్జీగా వుండేవాడు. వెంకటరమణ తన సమక్షంలో ముద్దాయి తరపున లాయరుగా వాదించాడు. ఖూనీకేసు. పల్లెటూళ్ళో రెండుపక్షాల మధ్య కక్షలు. ముద్దాయి ముగ్గురి మనుష్యుల్ని నిషా్కరణంగా పొట్టని పెట్టుకున్నాడని ప్రాసిక్యూషన్ కేసు. ఉరిశిక్ష తప్పితే అదృష్టమే అనుకున్నారంతా. పబ్లిక్ ప్రాసిక్యూటర్ కి సహాయం చెయ్య డానికి హేమా హేమీలయిన లాయర్లు, ప్రాసిక్యూషన్ కేసు చాలా కట్టు దిట్టంగా తయారుచేశారు, అయితే 'కుర్రప్లీడరు' తేలిగ్గా వొదిలేరకం కాదని అందరికి గట్టినమ్మకం.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ ముద్దాయిమీద ఆరోపణలు ముగించిన తరవాత వెంకటరమణ తన క్లయింటు తరఫున వాదించడానికి లేచి కోర్టంతా ప్రతిధ్వనించేలా ముద్దాయి నిర్దోషి అని ఉద్ఘాటించాడు. ప్రాసిక్యూషన్ కేసు అబద్ధాలపుట్ట అన్నాడు. న్యాయాన్ని ఉద్ధరించడానికి ఏర్పాటయిన పబ్లిక్ ప్రాసిక్యూటరు పోలీసులు తెచ్చిన ప్రతి కేసూ గెలవడమే ఆశయంగా పెట్టుకుని నిజానిజాలు కప్పిపుచ్చడం శోచనీయం అన్నాడు.

జడ్జీలు పెద్ద గొంతులకీ, అభినయాలకీ మోసపోరు; మోసపోకూడదు. మనస్సు ఏంచెప్పినా, న్యాయసూత్రాల ప్రకారం సాక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని కేసు విచారణచేసి తీర్పు చెప్పాలి. వెంకటరమణ అరుపులూ, ఆరోపణలూ కేసు విచారణకి నాంది. దాన్ని సాధ్యమైనంత త్వరగా మర్చిపోయి నేరానికీ, చట్టసూత్రాల అన్వయానికీ ఇరుపక్షాల లాయర్ల వ్యాఖ్యానంవైపు దృష్టి మరిపించటానికి తొందరపడ్డాడు జగన్నాథం.

ముద్దాయి ఆత్మ సంరక్షణకోసం ముగ్గురి ప్రాణాలు తీయవలసి వచ్చిందని వెంకటరమణ వాదం. దెబ్బలాట జరిగినచోటుకి వెళ్ళి ప్రతి విషయాన్నీ అతను శల్యపరీక్ష చేశారు. కర్రసాము నేర్చుకున్నాడు. నీటి కాలవ దగ్గిర కాపలా కాస్తున్న ముద్దాయిని కందభూమి ఖామందులు గట్టు తీసెయ్యమని అడగడం, ముద్దాయి నిరాకరించడం, కోపంతో రెచ్చిపోయి రెండోపక్షం వాళ్ళు కత్తులు తీసుకుని ముద్దాయిమీద పడడం, ముద్దాయి కర్రతో వాళ్ళని ఎదుర్కోడం, ఆ దెబ్బలాటలో ముగ్గురి ప్రాణాలు పోవడం అంతా ఎలా జరిగివుంటుందో కోర్టు హాలులోచేసి చూపించాడు. ముద్దాయికి తగిలిన దెబ్బలన్నీ వెనకనుంచి కొట్టినవే అని నిరూపించాడు. ప్రాణాలు రక్షించుకోడానికి కర్ర వుపయోగించక తప్పలేదన్నాడు.

వెంకటరమణ ఏకాగ్రత, అతనిరీతిలో తీక్షత, అతని మాటల్లో శక్తి జగన్నాథాన్ని ఆకర్షించాయి. లాయరుగా వెంకటరమణకి మంచి భవిష్యత్తు వుందనుకున్నాడు.

"నా అభిప్రాయం మార్చుకోవలసిన అవసరం ఇంతవరకూ రాలేదు" అన్నాడు జస్టిస్ జగన్నాథం.

"ఇప్పటిమాట సరే, ముందు పరిస్థితి ఏమిటి ?" అంది మిసెస్ జగన్నాథం.

"నీ కూతుర్ని పెళ్ళాడాడు కాబట్టి నీకింత సందేహం సుశీ ! ముందు ముందు అతని ప్రాక్టీసు ఇంకా బాగుంటుంది"

"సాంబశివయ్యగా రేమన్నారో జ్ఞాపకం వుందా ?"

జస్టిస్ జగన్నాధానికి సాంబశివయ్యమీద అనుకోకుండా అకస్మాత్తుగా కోపం వచ్చింది. ఆయన రాజమండ్రీలో డిస్ట్రిక్ట్ జడ్జీగా వుండేటప్పుడు సాంబశివయ్య పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుండేవాడు. అప్పుడప్పుడు బ్రిడ్జి ఆడడానికి జగన్నాధం ఇంటికి వొచ్చేవాడు. ఒకసారి ఆట చాలించిన తరవాత కబుర్లలో వెంకటరమణ విషయం వొచ్చి ది.

"ఆడంబరమేకాని,అసలు సత్తువలేదు" అన్నాడు సాంబశివయ్య.

"కుర్రతనం, అదే సర్దుకుపోతుంది" అన్నాడు జగన్నాధం.

"క్షమించాలి. కుర్రతనంలో చెయ్యవలసింది 'లా' పుస్తకాలు చదువుకోడం, సీనియర్ లాయర్ల పద్ధతులు చూసి నేర్చుకోడం కాని, నలుగురు పెద్దకాపుల్నీ, తాగుబోతుల్నీ వెంట పడేసుకుని బజార్లో ప్రగల్భాలు కొట్టడంకాదు" అన్నాడు సాంబశివయ్య.

సాంబశివయ్య మాటల్లో కష్టంవున్నా, పూర్తిగా నిజం లేకపోలేదు. వెంకటరమణ పద్ధతులు విచిత్రంగా వుంటాయి. తక్కిన లాయర్లకివి రుచించలేదు. దానికి రెండు కారణాలు వున్నాయి. మొదటిది : కొత్తగా

వృత్తిలో ప్రవేశించినా ఎంతోకాలంగా అక్కడ వేళ్ళు పాతుకుపోయిన లాయర్లతో పోటీపడి నెగ్గుకుని రావడం; కొందరి సంపాదన ఇతనివల్ల క్షీణించింది. రెండవది : వెంకటరమణ నోరు, అతని మనస్సులో తక్కిన లాయర్లంతా ప్రబల విరోధులు. కోర్టులో కేసు నడుపతున్నప్పుడే కాదు, ఇంటా, బయటా, బజార్లోనూ, క్లబ్బులోనూ, ఎక్కడ అవకాశం వుంటే అక్కడ వాళ్ళని విమర్శించి ఖండిస్తేనేకాని అతనికి తృప్తి వుండదు. అక్కడ పేరుబడ్డ లాయర్ల ప్రతిభలో అతనికి కొంచెమైనా నమ్మకంలేదు. ఈ విషయం రహస్యంగా వుంచడానికి ప్రయత్నించకపోగా, కనిపించిన ప్రతివ్యక్తికీ, బోధించి వాళ్ళ అభిమానం తనవైపుకి మొగ్గేలాగా ప్రయత్నించాడు. ఇదికాక తనను గురించి ప్రచారం చెయ్యడానికి కొంతమందిని తయారుచేశాడు. రిక్షాలవాళ్ళకీ, బళ్ళవాళ్ళకీ, బస్సు డ్రైవర్లకీ, కండక్టర్లకీ జీతాలిచ్చి ప్రచారం చేయించుకుంటాడని పేరు. కోర్టు వ్యవహారాల్లో రైలు దిగినవాళ్ళని తిన్నగా తన దగ్గరకి తీసుకురావడానికి కొందర్ని ఏర్పాటు చేశాడనికూడా అంటారు.

వెంకటరమణవల్ల సాంబశివయ్య ఆదాయం కించిత్తయినా తగ్గలేదు. అయినా తక్కిన లాయర్లతోపాటు తనుకూడా వెంకటరమణ పద్ధతుల్ని నిరసించాడు. అయితే సాంబశివయ్య కోపానికి కారణం వేరే వుంది. వెంకటరమణ హత్యలవంటి పెద్ద క్రిమినల్ కేసుల్లో ప్రాసిక్యూషన్ పక్షానికి వ్యతిరేకంగా పనిచేసి గెలిచేవాడు. నిజానికి ఏ హత్య కేసులోనయినా ప్రాసిక్యూషన్ వైపుకన్న అపరాధి తరఫున కేసు వాదించడం సులభం. ప్రాసిక్యూషన్ ఇతను అపరాధం చేశాడని నిందిస్తుంది; నిరూపించడానికి ప్రయత్నిస్తుంది. నిరూపణ అతి నిర్దుష్టంగా వుండాలి. ఏ మాత్రం సందేహం వున్నా కోర్టు అపరాధివైపునే నిలబడుతుంది. ఈ పరిస్థితుల్లో సాంబశివయ్య పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా గెలిచే

కేసులు ఎక్కువ వుండేవికాదు. ఉండాలని న్యాయస్థానాలు నడిచే విధానాలు తెలిసినవాళ్లు అనరు. అయితే, వెంకటరమణ ఎదురుగా వాదించిన కేసుల్లో ప్రాసిక్యూషన్ గెలవనప్పుడు సాంబశివయ్య సమర్థతమీద వెంకటరమణ జరిపే దాడికి అంతూ పొంతూ వుండదు. ఈ గెలుపు తన ప్రతిభ చాటుకోడం కోసం వెంకటరమణ వుపయోగించుకునేవాడు.

వెంకటరమణ సాంబశివయ్యని పెట్టే తికమకలు జ్ఞాపకం వొచ్చి నవ్వుకున్నాడు జస్టిస్ జగన్నాథం.

"పాపం, పెద్దమనిషికి కోపం రావడంలో తప్పులేదు" అనుకున్నాడు.

కాని, సాంబశివయ్య చెప్పినదాంతో జగన్నాథం పూర్తిగా ఏకీభవించలేదు. వెంకటరమణ తరహా నిర్దుష్టమైనది కాదన్నమాట నిజమే. కాని ఆ పద్ధతులవల్ల అతను అయోగ్యుడయ్యాడని జగన్నాథం నమ్మలేదు. వెంకటరమణలో అట్టహాసం పాలు ఎక్కువ. పుస్తకాలు చదివి కృషి చెయ్యడంకంటే ఇతర పద్ధతులమీద ఎక్కువ ఆధారపడ్డాడు. జగన్నాథం ఉద్దేశంలో లాయరుగా ప్రావీణ్యం సంపాదించడానికి కావలసినవి అభిరుచి, కాలం. వకీలు వృత్తిలో పాతుకుపోయిన వాళ్ళకి రెండూ నెమ్మదిమీద సులభంగా లభ్యం అవుతాయి. వెంకటరమణ కూడా కాలక్రమేణా 'లా' సూత్రాలకి చిలవలూ, పలవలూ కల్పించి వ్యాఖ్యానం చెయ్యడం, ప్రతివాదనకీ పదికేసులు ఉద్ఘోషించి బలపరచడం నేర్చుకుంటాడు. అది బ్రహ్మవిద్యకాదు. కాలంకాని మరొకటి కాని నేర్పలేని ఏదో ప్రజ్ఞ వెంకటరమణలో వుంది. అది అతన్ని వృత్తిలో చివరంటా తీసుకుపోతుంది. ఆ నమ్మకం జగన్నాథానికి వుంది. ప్రతిసారీ వెంకటరమణ తన ముందు కేసు వాదించినప్పుడు అది బలపడింది. అయితే, ఆ ప్రజ్ఞ ఏమిటో ఇదమిద్ధమని జగన్నాథం నిర్ణయించుకోలేక పోయాడు.

సాంబశివయ్యకి విప్పి చెప్పడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. సాంబశివయ్య జగన్నాథం చెప్పిందంతా విని అన్నాడు.

"మీరు పైపై మెరుగులు చూసి మోసపోతున్నారు"

"మెరుగులే కాదు సాంబశివయ్యగారూ!" అన్నాడు జగన్నాథం. బాగా ఆర్జిస్తున్నాడనికూడా విన్నాను"

"ఇప్పుడొస్తుందేమో కాని. అట్టే కాలం నిలబడదని నా ఉద్దేశం" అన్నాడు సాంబశివయ్య; అక్కడ వున్నవాళ్ళంతా ఔనన్నారు. ఆ విషయం ఇప్పుడు మిసెస్ జగన్నాథం గుర్తుకి తెచ్చింది.

"ఇవన్నీ పెళ్ళిముందు ఆలోచించలేక పోయావా ?" అన్నాడు జస్టిస్ జగన్నాథం.

"తండ్రీ, కూతుడూ కలిసి నామాట పడనిస్తేనా ?"

అది నిజం కాదని ఆవిడకి తెలిసినా కోపంతో అంది.

నిర్మల వెంకటరమణని పెళ్ళి చేసుకుంటానని చెప్పినప్పుడు జగన్నాథం "తొందరపడి చేసుకోవద్దు. బాగా ఆలోచించుకో" అన్నాడు.

వెంకటరమణ తండ్రి రాజమండ్రీ దగ్గిర చిన్న పల్లెటూళ్ళో కరణం. పన్నెండేళ్ళు వచ్చేవరకూ వెంకటరమణ అక్కడే పెరిగాడు. తరువాత చదువుకని రాజమండ్రీ వచ్చాడు. అక్కడ బి ఏ. ప్యాసయి వాల్టేరులో 'లా' పరీక్షకి చదివాడు. అతను ఎరిగిన జీవితం, పెరిగిన వాతావరణం నిర్మలకి కొత్త. నిర్మల చిన్నతనం నుంచీ ఇంగ్లీషు స్కూల్లో చదువుకుంది. అయిదేళ్ళప్పుడే కోటగిరి నర్సరీ స్కూల్లో చేరింది. తరవాత లవ్‌డేల్‌లోనూ, టీక్స్ స్కూల్లోనూ చదివి, ప్రెసిడెన్సీ కాలేజీలో డిగ్రీ కోర్సు చదివింది.

"వెంకటరమణ తెలివయినవాడు; మంచివాడు. కాని పెళ్ళాడే ముందు చూసుకోవలసినవి ఈ రెండే కాదు." అన్నాడు కూతురితో జగన్నాథం.

"పరవాలేదు" అంది నిర్మల.

మిసెస్ జగన్నాధానికి నిర్మల పెళ్ళి చేసుకుంటాననడమే బ్రహ్మా నందమయింది. రెండేళ్ళుగా కూతురు పెళ్ళి వాయిదా వేస్తూంది. త్వరగా చేసుకోకపోతే వయసుమీరి పోతుందని ఆవిడ బాధ. పైగా వయసు వచ్చిన పిల్ల పెళ్ళి వొద్దనడం ఆవిడలో శంక రేపింది. మద్రాసులో ఉన్నప్పు డెవర్నయినా ప్రేమించి వంచింప బడిందేమోనని అనుమానం వేసింది. ఎంత అడిగినా నిర్మల ఏమీ లేదనే సమాధానం ఇచ్చింది. మిసెస్ జగన్నాథం మటుకు పార్టీసాకు కల్పించి తెలిసిన యువకుల్లో యోగ్యులయిన వాళ్ళని నిర్మల కలుసుకు నేటట్టు చేస్తూనే ఉంది. వాళ్ళం దర్నీ కాదని నిర్మల ఇతన్ని పెళ్ళి చేసుకుంటాననడం ఆవిడకి ఆశ్చ ర్యం వేసింది. వెంకటరమణని నిర్మల కలుసుకున్నది పార్టీల్లో కాదు. అతన్ని డిస్ట్రిక్ట్ జడ్జిగారింటో పార్టీలకి ఎప్పుడూ పిలవలేదు. వెంకట రమణమీద ఏర్పడ్డ అభిమానంవల్ల జగన్నాధం అతన్ని పిలిచి ఎప్పు డయినా ప్రోత్సహిస్తూ ఉండేవాడు. వెంకటరమణ ఏదయినా సెలవు రోజున జడ్జిగారింటికి వెళ్తూవుండేవాడు. ఒకసారి వెళ్ళినప్పుడు నిర్మలని కలుసుకున్నాడు. ఆమె అతనిని ఎంతో ఆకర్షించింది. అప్పట్నించీ ఆమెతో మాట్లాడడంకోసం తరుచూ జడ్జిగారింటికి వెళ్ళడం మొదలు పెట్టేడు. కొంతకాలానికే వాళ్ళ స్నేహం ప్రేమగా మారి పెళ్ళి చేసుకో డానికి నిశ్చయం చేసుకున్నారు.

"ఇద్దరికీ ఇష్టమయితే నాకూ యిష్టమే" అన్నాడు జగన్నాధం. మిసెస్ జగన్నాధానికి ఇంగ్లండు వెళ్ళి వచ్చిన అల్లుడిమీద వున్నా ఈ పెళ్ళికి అడ్డు చెప్పలేదు. ఆవిడకి కావలసింది కూతురికి నచ్చడం, డబ్బుం డడం. వెంకటరమణకి కొద్దో గొప్పో ఆస్తి వుంది. ప్రాక్టీసులో ప్రవే శించి నాలుగేళ్ళు నిండకుండానే బోలెడు సంపాదిస్తున్నాడు. చాలా తెలి వయినవాడని జగన్నాధం ఎప్పుడూ చెబుతూనే వున్నాడు. అంతకుమించి అప్పుడు ఆవిడ ఆలోచించలేదు. ఇప్పుడు కూతురు అదేపనిగా మొగుడికి

ఉద్యోగం చూడమని రాయడంతో ఆవిడలో మునుపులేని శంకలు బయల్దే రాయి. వెంకటరమణ సంపాదనతో సంసారం గడవడం లేదేమో ? నిర్మలకి అతనితో సామరస్యం కుదరడం లేదేమో ? ఆ చిన్న ఊళ్లో నిర్మల వుండలేకపోతుందేమో ? ఈ ఆలోచనల్తో ఆవిడ హృదయం ఆర్ద్రమైపోయింది. చేతిలో టీ కప్పు బల్లమీదపెట్టి మొగుడి దగ్గరకి జరిగింది.

"పెళ్ళయాక నిర్మల ఇంటికి వెళ్ళనేలేదు. ఈ దసరాకి వెళ్ళ దామా ?" అంది.

జస్టిస్ జగన్నాధం ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఉబికివస్తున్న కన్నీళ్ళ అపుకుంటున్నట్టనిపించింది. ఆవిడ మనస్సులో ఆందోళన గ్రహించాడు. హైకోర్టు జడ్జీ అయి హైదరాబాదు కొచ్చిన ఈ మూడేళ్ళల్లో అల్లుడి ఇంటికి వెళ్ళడమే పడలేదు. ఒకసారి కాన్పుకి కూతురే అక్కడికి వచ్చింది. తరవాత ఏదో ఒక అడ్డు రావడం, పెట్టుకున్న ప్రయాణం పడకపోవడం జరిగింది.

"సరే వెళ్దాం" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"సుశీ తలుచుకుంటే ఏమయినా సాధించగలదని నేను చెప్ప లేదూ ?" అన్నాడు రంగారావ్.

"మీరుకూడా రాకూడదూ, అక్కణ్ణుంచి వెంకట్ పొలాల్లోకీ, తోటల్లోకీ పోవచ్చు; హాయిగా వుంటుంది" అంది మిసెస్ జగన్నాధం.

"థాంక్స్, సుశీ ! ఇంకెప్పుడయినా చూద్దాం. ఇప్పుడు నేను ఇక్కణ్ణుంచి ఒక్కరోజు కూడా కదలడానికి వీల్లేదు" అన్నాడు రంగా రావు.

"మా బదులుకూడా మీరే ఆనందించి రండి" అంది మిసెస్ రంగారావు.

* * *

అల్లుడిలో జస్టిస్ జగన్నాథానికి ఏదో ప్రబలమైన మార్పు కని పించింది. ఎంత ప్రయత్నించినా దేంట్లోనో అంతుపట్టలేదు. ఏదో మార్పు. ఏదో వెలితి అంతే. వెంకటరమణతో మాట్లాడదామని ఆఫీసు దగ్గిరకి వెళ్ళాడు జస్టిస్ జగన్నాథం. వెంకటరమణ లోపలిగదిలో కూర్చుని రాసుకుంటున్నాడు. ఒక గుమాస్తా బయట వరండాలో రికార్డు తిరగేస్తున్నాడు. అంతా ప్రశాంతంగా, నిర్మలంగా వుంది. ఆయనకి ఆశ్చర్యం వేసింది. వెంకట్ ఆర్భాటం ఏమయిపోయింది? అతని అను చరులూ, అనుయాయులూ, క్లయంట్లూ ఏవుట్లూ ఎక్కడ? జస్టిస్ జగ న్నాథానికి ఆఫీసు లోపలికి వెళ్ళబుద్ధి కాలేదు. తిరిగి వెళ్ళిపోయాడు.

ఇంటిదగ్గిర సాంబశివయ్య ఆయనకోసం కాచిపెట్టుకుని ఉన్నాడు. అతన్ని చూడగానే ఆయన మొహం వికసించింది. గడిచిన రోజుల కబుర్లు చెప్పుకున్నారు. ఆమధ్య జరిగిన బ్రిడ్జి టూర్నమెంట్సులో చేతులూ, ఆటలూ గురించి విమర్శించారు. ఊళ్ళో లాయర్లని గురించి మాట్లాడుకున్నారు. తరవాత వెంకటరమణ ప్రసక్తి వొచ్చింది.

"సంపాదన అంతలేదేమోకాని, మనవాడు ఒక దారిన పడు తున్నాడు" అన్నాడు సాంబశివయ్య.

"ఆర్జన లేకుండా ఏంచేసి ఏం లాభం" అన్నాడు జస్టిస్ జగ న్నాథం.

"వెంటనే సంపాదించికపోతే వస్తుందాలా?"

"అలాకాదు. అయినా ఈ తాపత్రియం అంతా డబ్బుకోసమే గదా!"

"అదే వొస్తుంది డబ్బు నెమ్మదిగా. పెళ్ళి పుణ్యమా అని పొగరూ, దురుసుతనం తగ్గాయి. క్రమంగా అన్నీ అలవడతాయి" అన్నాడు సాంబశివయ్య.

జస్టిస్ జగన్నాధం మెదడులో చరచినట్టయింది. సాంబశివయ్య వెళ్ళి వస్తానన్న మాటలు సరిగా వినిపించుకోనేలేదు. అతను చెప్పిన విషయాల గురించి ఆలోచించడంలో మునిగిపోయాడు.

ఇలా జరుగుతుందనే భయం జస్టిస్ జగన్నాధానికి మొదటినుంచీ వుంది. అప్పుడు ఉద్రేకంలో బాగా ఆలోచించకుండా పెళ్ళి చేసుకుంది నిర్మల. ఆమె సంస్కారం వెంకటరమణ సంస్కారానికి భిన్నమైంది. అతని పద్ధతులు ఆమెకు సరిపడవని తనకి తెలుసు. అందుకే వెంకటరమణ మీద ఎంత అభిమానమున్నా నిర్మల పెళ్ళాడతా నన్నప్పుడు ఆయన వెంటనే ఒప్పుకోలేదు. ఇప్పుడు తన సందేహాలన్నీ నిజరూపం దాలుస్తున్నాయి. వెంకటరమణలో వున్నదని నమ్మి,తను ఎంతోకాలంగా పరిశోధిస్తున్న ప్రత్యేకతని, ప్రతిభని, ప్రజ్ఞని సాంబశివయ్య యధాలాపంగా 'పొగరు', 'దురుసుతనం' అన్నాడు. తను ఆత్మవిశ్వాసం అంటాడు. ఓటమి అంగీకరించలేని గుండె నిబ్బరం, కార్యసాఫల్యం కోసం పూనిన దీక్ష. వెంకటరమణ ఆడంబరం, ప్రచారం లక్ష్యసిద్ధికి పునాదులు. అతను ప్రతికక్షులమీద చూపించే నిర్లక్ష్యం, కోపం, అసహ్యం కార్యసాధనకి మేడమెట్టు.నిర్మల వెంకటరమణని అర్థం చేసుకోలేదు. స్వార్థంతో అతన్ని తన పద్ధతుల్లోకి తీసుకురావడానికి ప్రయత్నించింది. ఈ ఘర్షణలో అతని ప్రత్యేకత అణగారిపోయింది. అనాలోచితంగా అతని భవిష్యత్తు ధ్వంసం చేసింది నిర్మల. ఇప్పటికయినా మించిపోయిందేమీలేదు. కూతురికి అంతా విపులంగా బోధించాలి.

"నిర్మల్ !" అని పిలిచాడు.

నిర్మల వచ్చింది.

"నిన్నొకమాట అడగాలను కొంటున్నాను"

నిర్మల మాట్లాడలేదు.

"వెంకట్ ప్రాక్టీసు ఎలా వుంది ?"

నిర్మల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. పక్కకి తిరిగి విదిలించుకుంది.

"ఇదంతా నువ్వు చేసుకున్నదే" అందామనుకున్నాడు.

"ఏమన్నా వొస్తుందా ?" అన్నాడు.

"మునుపటిలాగా లేదు" అంది నిర్మల.

"ఏం ?" అన్నాడు.

"ఏమో !"

"నరసయ్యా, రాఘవులూ కేసులు తీసుకురావడం లేదా?" జస్టిస్ జగన్నాధం సిగ్గుతో కుదించుకుపోయి అడిగాడు. ఆయనకి టవుట్సు, కోర్టు పక్షులు అంటే అసహ్యం. అయినా అల్లుడి పద్ధతులకి అడ్డుతగలడం యిష్టంలేక చూసీ చూడనట్టు ఊరుకున్నాడు.

"ఇప్పుడు వాళ్ళని జేర్చడంలేదు" అంది నిర్మల.

"ఏం ?"

"ఏమో !"

తరవాత ఏమడగాలో ఆయనకి తోచలేదు. నిర్మలే అంది.

"ఏదైనా ఉద్యోగం చూసిపెడితే బాగుంటుంది"

"ఉద్యోగం ఎందుకు నిర్మల్ !" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"ఎంతకాలం వున్నది తింటూ కూర్చోడం ?"

"అసలేమీ రావడంలేదా ?"

"మునుపటిలాగా ప్రయత్నం చేస్తున్నట్లు లేదు"

"నువ్వు అతని పనిలో జోక్యం చేసుకోకూడదు నిర్మల్ !" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"నేనేం చేశాను ?"

"వెంకట్ పద్ధతులు మార్చడానికి ప్రయత్నించకూడదు"

"ఏ పద్ధతయితే నాకెందుకు. ఇంత సంపాదించి పడెయ్యమంటాను. అంతే ! ఇప్పుడు ఇద్దరమేకాదుగా, పాపతోకలిసి ముగ్గురం"

"ఔను" అన్నాడు జగన్నాథం.

"నాకంతా అయోమయంగా వుంది. వెంకట్ ఇలా మారిపోతాడను కోలేదు" అంది నిర్మల.

అప్పుడే వెంకటరమణ ఆఫీసునుంచి వచ్చాడు.

"నేను భోజనాల సంగతి చూస్తాను" అని నిర్మల వెళ్ళిపోయింది. వెంకటరమణ మామగారితో కబుర్లలోకి దిగాడు.

"ప్రాక్టీసు ఎలా వుంది?" జస్టిస్ జగన్నాథం అడిగాడు.

"బాగానే వుంది" అన్నాడు వెంకటరమణ.

"ఎంత వస్తూంది?"

"అట్టే రావడంలేదు"

"ఏం?"

"ఇప్పుడు మేజెస్ట్రేట్ కోర్టుకి వెళ్ళడంలేదు. ప్రొహిబిషన్ కేసు లన్నీ వదిలేశాను" అన్నాడు వెంకటరమణ.

"నీపని చాలమటుకు యస్. యస్. యమ్. కోర్టులోనేకదా! అక్కడికి వెళ్ళకపోతే ఎలా?" జస్టిస్ జగన్నాథం అడిగాడు.

"ఇక్కడ కోర్టుల్లో వాతావరణం నాకు సరిపడడంలేదు. హైదరా బాదు వొచ్చేద్దా మనుకుంటున్నాను" మునుపు వెంకటరమణ ఇలా మాట్లా డితే జస్టిస్ జగన్నాథం ఆశ్చర్యపోయేవాడు. ఇప్పుడు ఈ మాటలు అతని నోటికి అతికినట్టు సరిపోయాయి. వెంకటరమణ రూపులోనూ,రీతిలోనూ కూడా ఎంతో మారిపోయాడు. సౌమ్యత, నెమ్మది అలవడ్డాయి.

"ఇక్కడి వాతావరణాని కే మొచ్చింది?" అన్నాడు జస్టిస్ జగ న్నాథం.

"మీరు జడ్జీగా బెంచీమీద కూనుంటారు కాబట్టి మాపాట్లు తెలి యవు. నానాగడ్డీ కరచి, అన్నిరకాలవాళ్ళనీ పట్టుకుని పాకులాడాలి మేం.

నే నిన్నాళ్ళు పని సంపాదించడానికి ఎన్ని అవతారాలు ఎత్తానో తెలిస్తే మీకు అసహ్యం వేస్తుంది" అన్నాడు వెంకటరమణ.

తనకి తెలిసిన విషయాలు గుప్తంగా ఉంచడమే ఉత్తమం అని తోచింది జస్టిస్ జగన్నాథానికి.

మళ్ళీ వెంకటరమణ అన్నాడు.

"పాపం, నిర్మల్ మాత్రం ఎంతకాలం నాకోసం ఇక్కడ పడి మగ్గుతుంది. తనకోసమైనా హైదరాబాదు వచ్చెయ్యాలి"

నిర్మల వచ్చి భోజనాలకి లేవమంది. జస్టిస్ జగన్నాథం తరవాత తింటానన్నాడు.

ఆయనకి ఇప్పుడు పరిస్థితి అర్థమైంది. ఇందులో నిర్మల తప్పు లేదు. ఆమె వెంకటరమణని మార్చడానికి ప్రయత్నం చెయ్యలేదు. అతని మార్పు స్వయంకృతం; నిర్మలమీది ప్రేమవల్లా, ఆమె సంస్కారంమీద గౌరవంవల్లా తన నాగరికతా, సంస్కారంమీద చిన్న చూపువల్లా పుట్టింది. ఈ మార్పులలో అతని ప్రత్యేక ప్రతిభ అడుగంటిపోయింది. తిరిగి తెచ్చుకోడానికి ప్రయత్నించమని చెప్పి ప్రయోజనం లేదు; చెప్పినా వింటాడనే ఆశలేదు; విన్నా అది వస్తుందనే నమ్మకమూ లేదు.

జస్టిస్ జగన్నాథం కుర్చీలోనుంచి లేచి భోజనాలగదిలోకి వెళ్లాడు. వెంకటరమణ భోజనం అయిపోయింది. నిర్మల ఏవో సద్దుతూంది.

"వెంకట్ ఎక్కడ?" ఆయన అడిగాడు.

"కోర్టుకి వెళ్ళిపోయారు" అంది నిర్మల.

"నిర్మల్!"

నిర్మల చేతిలో పళ్ళెం సైడ్‌బోర్డ్‌మీద పెట్టి వెనక్కి తిరిగి చూసింది.

"మీరు మాతో హైదరాబాదు వొచ్చేయ్యండి. వెంకట్‌కి ఉద్యోగం కోసం ప్రయత్నం చేద్దాం" అన్నాడు జస్టిస్ జగన్నాథం. * * *



# గాళి దేవరు

క్లిలిక్ సన్ అండ్ కంపెనీ ఎయిర్ కండిషన్డ్ విజిటర్స్ రూమ్‌లో సోమయ్య పరధ్యానంగా ఫార్ట్యూన్ పత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు. ముందు బల్లమీద ఇంకా మెర్క్యురీ, టైమ్, న్యూయార్కర్, బిజినెస్‌వీక్ కామర్స్, కేపిటల్‌స్టాక్ మార్కెట్ బులిటెన్లూ, ఎయిరిండియా ఇంటర్నేషనల్ ప్రకటన కాగితాలూ కొల్లలుగా పడివున్నాయి. అతని మనసు వాటిమీదలేదు. త్వరగా వచ్చిన పని ముగించుకుని వెళ్ళిపోవాలని వుంది.

గత ఆరేడు సంవత్సరాలుగా కాఫీ పంటకి లభిస్తున్న అధిక వెలల వల్ల నైతేనేం, కంపెనీ అవలంబిస్తున్న ఉత్కృష్ట వ్యవసాయ పద్ధతుల వల్లనైతేనేం, సాలిబేటా ఎస్టేటు విపరీతమైన లాభాలు గడించింది. అందుకు తగ్గట్టుగా ఉద్యోగస్తులకి పెద్ద బోనస్ ఇచ్చింది. కాని చిన్న ఉద్యోగులు బోనస్‌తో తృప్తిపడలేదు. ఎంతో కాలంగా వాయిదా పడు తున్న సౌకర్యాలు ఈ మంచి రోజుల్ని పురస్కరించుకుని తమకి కల్పించ వలసిందిగా కంపెనీకి రాయమని మేనేజరుకి విజ్ఞప్తి చేసుకున్నారు. సోమయ్యకి సానుభూతి కలిగింది. బ్రిటిష్ పరిపాలనలో కాబట్టి వాళ్ళ పరిస్థితి ఎంత హీనంగావున్నా సరిపోయింది. స్వాతంత్ర్యం వచ్చిం తరవాత కొంత మెరుగేకాని, ఇంకా వాళ్ళకి చెయ్యవలసినవి చాలా వున్నాయి. పాపం, ఎండనక, వాననక రోజ స్తమానూ కాఫీ చెట్లల్లో తిరుగాడుతూ వుంటారు. ఇంటికిపోతే రాత్రి ఎలక్ట్రిక్ దీపమయినా వుండదు. చాలామటుకు యిళ్ళు కూలిపోతున్నట్టుంటాయి. వర్షాకాలం కప్పంతా కారుతూనే వుంటుంది. వర్షాకాలం అంటే కొండకిందలాగా నాలుగు రోజులుండి పోయేదికాదు. నాలుగు మాసాలు ఏకధారగా కుండ పోత. ఇంట్లో సరయిన స్నానాలగది వుండదు. ఉన్నా అందులో అన్ని సదుపాయాలూ వుండవు. ఎప్పుడూ చెమ్మగిలి వుంటుంది. కాలకృత్యాలు తీర్చుకోడానికి అంత వర్షంలోనూ చిన్నా, పెద్దా ఇంటివెనకాల దూరంగా కట్టిన రేకులచూరు కిందకి పరిగెత్తవలసిందే. కంపెనీ అభివృద్ధికి పాటు పడుతున్న వీళ్ళెందుకు ఇంత కష్టపడాలి? అధిక లాభాలు గడిస్తు న్నప్పుడు కొంత ఖర్చుచేసి వాళ్ళ సౌఖ్యాల్ని గమనించడం కంపెనీ విధి అనిపించింది సోమయ్యకి.

చిన్న ఉద్యోగుల కష్టాలు వివరించి, ముఖ్యంగా వాళ్ళ యిళ్ళ యినా బాగుచేసి నూతన వసతులు కల్పించమని కంపెనీని కోరేదు సోమయ్య. ఎలక్ట్రిసిటీ కూడా యిస్తే బాగుంటుందని రాయబోయాడు.

మేనేజిమెంటుకీ, తక్కిన చిల్లర ఉద్యోగులకీ వుండే వ్యత్యాసం సన్న గిల్లిపోతుందేమోనని భయంవేసింది. తనకీ, తన యిద్దరి అసిస్టెంట్ మేనేజర్లకీ విశాలమైన చక్కని బంగళాలున్నాయి. వాటికి వేరే వేరే జెనరేటర్ల ద్వారా ఎలక్ట్రిసిటీ సరఫరా అవుతుంది. ఇటువంటి అధికృత ఉండబట్టేగదా కింద ఉద్యోగులకీ, కూలీలకీ మేనేజిమెంటంటే భయం, భక్తి వున్నాయి. ఈ విభేదాలు తీసిపారేస్తే ? సోమయ్యకి అనుకోకుండా చిక్కుసమస్య ఎదురుపడింది. ఈ తేడాలు కృత్రిమంగా కల్పించిన వేనా ? తాము చూపించే ఠీపీ, అధికారం, కార్యసాధన, ఉద్యోగం అంతస్థువల్ల సంపాదించినవా ? ఇప్పుడిప్పుడు చిన్న ఉద్యోగాల్లో చేరు తున్న కొందరు చదువుకున్న యువకులతో తమ స్థానాల్ని నింపితే వాళ్ళుకూడా తమంత చాకచక్యంతో ఎస్టేటు నడపగలరా ? మహా ప్రయ త్నంమీద ఆలోచనల్ని పరిపరివిధాలా పోకుండా అణిచిపెట్టుకుని, ఎలక్ట్రి సిటీ ప్రసక్తి ఎత్తకుండా ఉత్తరం ముగించాడు సోమయ్య.

తన ప్రతిపాదన లన్నింటినీ కంపెనీ ఆమోదించినప్పుడు అతని మనస్సు ఆనందంతో నిండిపోయింది. కింది ఉద్యోగులమీద వాత్సల్యం పెల్లుబికింది. వెంటనే ఇంటి కప్పుల్నీ, గోడల్నీ బాగుచెయ్యడానికి ఎస్టేటు కాంట్రాక్టర్ని నియమించాడు. నూతన పద్ధతిలో స్నానాల గదులు కట్టడం, పాత గచ్చుమార్చి మొజాయిక్ గచ్చు వెయ్యడం చుట్టు పక్కల ఎవరివల్లా కాదు. బెంగుళూరులో కిల్లిక్ నన్ అండ్ కంపెనీ సేనిటరీ ఫిట్టింగ్స్‌లోనూ, మొజాయిక్ గచ్చు చెయ్యడంలోనూ పేరు పొందింది. వాళ్ళకే ఈ పని పురమాయించడానికి నిశ్చయించుకున్నాడు. కిల్లిక్ నన్ కంపెనీతో బేరసారాలుండవని తెలిసినా మేనేజింగ్ ఏజన్సీ లకి తగ్గింపు ధరలు చెప్పవచ్చనే ఆశకొద్దీ వాళ్ళకి రాయడానికి పూను కున్నాడు. ముప్ఫై యిళ్ళకి స్నానాల గదులు, ఒక్కొక్క గదికీ, వాష్ బేసిన్, ఫ్లషవుట్, షవర్, నేలకీ, గోడలకీ గది ఆరడుగుల ఎత్తువరకూ

మొజయిక్ పెంకులూ, ఇవికాక డ్రాయింగ్ రూమ్‌కీ, భోజనాల గదికీ, మొజయిక్ గచ్చు. ఉత్తరం పూర్తి చేసి చదివిం తరవాత కాని యింత భారీ పని అనిపించలేదతనికి. పెద్ద మొత్తం ఖర్చు చేస్తున్నప్పుడు తనే బెంగుళూరు వెళ్ళి ఎందుకు సంప్రదించకూడదూ ? కారు మైలేజీకి తను తీసుకునేది ఏపాటి ? రెండు నెలల్నించి ఎస్టేటు కదిలి బయటికిపోక విసుగుపుడుతున్నదని భార్య ఒకటేగోల. తను కూడా ఈ మధ్య ఎస్టేటు వ్యవహారాల్లో ఎక్కువగా చిక్కుపడి నలిగిపోయాడు. రెండు రోజులు తిరిగివస్తే ఉత్సాహం పుంజుకుని మళ్ళీ బాధ్యతలు నెత్తిమీద వేసుకోడానికి తయారయి రావచ్చుననిపించి బెంగుళూరు వచ్చాడు.

"ఇలా రోజంతా నాలుగ్గోడల మధ్యా కాచుక్కూచుంటూ గడిపేస్తే నేం తేరుకుని ఇంటికి వెళ్ళినట్టే" పుస్తకం మడిచి బల్లమీదకి విసిరికొట్టి, ఒళ్ళు విరుచుకుంటూ అనుకున్నాడు సోమయ్య. ప్యూన్ తలుపు తోసుకుని వచ్చి "మీరు లోపలికి పోవచ్చు" అన్నాడు.

సోమయ్య లేచి మేనేజింగ్ డైరెక్టరు గదిలోకి వెళ్ళాడు. ఏంథోని చిన్నప్ప కరచాలనంచేసి అతను కూర్చోడానికి మెత్తని కుర్చీ చూపించాడు. చిన్నప్పది [illegible]ంగైన విగ్రహం, చక్కని కనుముక్కు తీరు. అన్నిటికీమించి మిసమిసలాడుతున్న యౌవనం. 'ఇంత చిన్న వయసులో ఎంత అధికారం చలాయిస్తున్నాడు' అనుకోకుండా వుండలేకపోయాడు సోమయ్య.

"నేను మీకేం చెయ్యగల్ను" అన్నాడు చిన్నప్ప టెరిలీన్ షర్టు మీద తోపు రంగు టైని సర్దుకుంటూ. సోమయ్య వచ్చినపని వివరించాడు. పెద్ద కాంట్రాక్టు ఇవ్వబోతున్నాడని విన్న చిన్నప్ప అన్నాడు :

"అన్నట్టు అడగడం మర్చిపోయాను. ఏం పుచ్చుకుంటారు ?"

"ఏమీ ఒద్దు. థాంక్స్ !" అన్నాడు సోమయ్య.

"అదేమిటి, చల్లని కొండల్లోవుండే మీలాంటి అదృష్టవంతులు మా ప్రాంతాల ఎండలు భరించలేకుండా వుండాలి. దాహమయినా తీరుతుంది. బీయర్ పుచ్చుకోండి" అంటూ ప్యూన్ కోసం బజ్జర్ నొక్కాడు చిన్నప్ప.

సోమయ్య బట్టలు మాత్రం ఎండలు తట్టుకునేందుకు ఉపయోగపడేలాలేవు. బరువైన ట్వీడ్ సూటు వేసుకున్నాడు. వెడల్పాటి పైని మూడువంతులు వెయిస్ట్ కోటులోకి తోసేశాడు.

"క్షమించాలి. బయట కార్లో నా భార్యని కూర్చోపెట్టి వచ్చాను. సాధ్యమయినంత త్వరగా పని ముగించుకొని వెళితే బాగుంటుంది" అన్నాడు సోమయ్య.

"అయ్యో! ఎందుకావిడ్ని లోపలికి తీసుకురాలేదు? ఇప్పుడయితేనేం పిలుద్దాం" అన్నాడు చిన్నప్ప.

"ఒద్దొద్దు. ఆడవాళ్ళు చుట్టుపక్కల చేరితే పని తెవిలినట్టే" అడ్డుపడ్డాడు సోమయ్య.

"వ్యాపారం వాళ్ళ రంగం కాదుగదా!" లౌక్యంగా నవ్వాడు చిన్నప్ప. లోపలికి వచ్చిన ప్యూన్ వైపు తిరిగి అన్నాడు "ఆళ్వాగారిని ఇక్కడికి రమ్మను"

"మేనేజరు ఆఫీసులో లేనట్టున్నారు" అన్నాడు సోమయ్య.

"ఆఁ, మర్చిపోయాను. ఆళ్వా ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళాడు. అతని అసిస్టెంటుని పిలుస్తాను"

చిన్నప్ప ఇంటర్ కమ్యూనికేషన్ ఫోన్ అంది పుచ్చుకున్నాడు.

"ఆయన కూడా లేరనుకుంటా. వాళ్ళు లేరని నన్ను మీ దగ్గిరకి తీసుకొచ్చారు" అన్నాడు సోమయ్య.

"గోపీనాథ్ కూడా వెళ్ళాడన్నమాట. మా ఎరువుల డిపార్ట్

మెంట్ మేనేజర్ అమెరికానుంచి ఈరోజు నాలుగుగంట్ల విమానంలో వస్తున్నారు" ఆఫీసర్లు లేకపోడానికి కారణం చెప్పాడు చిన్నప్ప.

"వివరాలు నాకు చెప్పండి, రాసుకుని ఆళ్వా కిస్తాను" అన్నాడు మళ్ళీ.

"నేను కొలతలు తీసుకురాలేదు. మీ ఆఫీసు నుంచి ఎవ్వరైనా వచ్చి చూడ్డానికి వీలుండదా ?" అన్నాడు సోమయ్య.

"ఓఁ, దాని కేం" చిన్నప్ప అన్నాడు. "మీ ఎస్టేటు ఎక్కడన్నారు ?"

"మర్కారాకి పదిమైళ్ళ దూరంలో మేంగళూర్ రోడ్డుమీద"

చిన్నప్ప మెమోపేడ్ మీద రాసుకున్నాడు.

"నా మతిమరుపు క్షమించాలి. ఎస్టేటు పేరు ?" చిన్నప్ప అడుగుతూనే సోమయ్య పంపించిన విజిటింగ్ కార్డుకోసం బల్లమీద వెదికాడు.

"పోలి బేటా ఎస్టేటు" అన్నాడు సోమయ్య.

"పోలి బేటా.........ఎక్కడో విన్నట్టు జ్ఞాపకం" కళ్ళు చికిలించి, శబ్దాన్ని అరికట్టడానికి గది గోడల కతికిన థెర్మాకోల్ లోపలికి చూస్తూ ఆలోచనలో మునిగిపోయాడు చిన్నప్ప.

"తప్పకుండా విని వుంటారు. ఈమధ్య షేర్స్ మంచి ధరలో వున్నాయి, ఎస్టేటంతా ఏరెబికా కాఫీయే........"

ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు సోమయ్య.

"మేంగిల్స్ బ్రదర్స్ ఎస్టేటుకదా" అడిగాడు సోమయ్య.

"వాళ్ళెప్పుడో అమ్మేశారు. గ్రీన్‌వుడ్స్ కంపెనీ ఇప్పుడు మేనేజింగ్ ఏజెంట్స్"

"అదే ఎస్టేటన్నమాట"

సోమయ్యకి అతని మాటలు బోధపడలేదు.

"ఏవిటి ?" అన్నాడు

"గాలిదేవరు వెలిసింది మీ ఎస్టేట్లోనే నన్నమాట"

"ఔను"

"ఐతే వేరే మనుషులెందుకు. నేనే వస్తాను"

చిన్నప్ప మొహం వికసించింది.

"తప్పకుండా రండి" ఆహ్వానించి సోమయ్య అన్నాడు.

"గాలిదేవరుమీద మీకు గురి ఉన్నట్టుంది"

"కావలసినంత వుంది" చిరు నవ్వాడు సోమయ్య. ఇన్నిమైళ్ళ దూరంలో వున్నవాళ్ళకి కూడా గాలిదేవరు మహిమ పాకినందుకు సోమయ్యకి ఆశ్చర్యం వేసింది. తమ ఎస్టేటులోనే వెలిసినందుకు కొంత తృప్తీ, గర్వం కూడా కలిగాయి. టీ టయిముకి అనుకున్న ప్రకారం భార్యని స్నేహితురాలి ఇంటికి తీసుకు వెళ్ళకపోతే జరిగే రాద్ధాంతాన్ని తలుచుకుని ఎంత ఉబలాటంగా వున్నా గాలిదేవరు ప్రశంసకి పూనుకోకుండా వ్యవహారం ముగించుకుని అక్కణ్ణుంచి బయటపడ్డాడు.

* * *

"ఇక్కణ్ణుంచి జీప్ పోదు సార్ !" అన్నాడు డ్రైవరు.

"ఐతే ఆపు" ఆజ్ఞాపించాడు సోమయ్య.

ఎస్టేటు జీపు కూలీల యిళ్ళముందు ఆగింది. పిల్లలు దాన్ని చుట్టుముట్టేశారు. డ్రైవరు బొమ్మని కసురుతున్నాడు సోమయ్య. ఏందోసీ చిన్నప్ప, అతని పరివారం యిద్దరు ముగ్గురు జనం జీపులోనుంచి కిందకి దుమికారు. దూరంగా పోయి నుంచున్న పిల్లలకి చిన్నప్ప వేసుకున్న రంగురంగుల బొమ్మలచొక్కా వినోదంగావుంది కిలకిల లాడుతున్నారు. ఇళ్ళల్లోనుంచి కొందరు కూలీలు వచ్చి సోమయ్యకి సలాం చేశారు.

"అదుగో, మాంకూ ఇక్కడే వున్నాడు" అన్నాడు సోమయ్య. మాంకూ పళ్ళికిలిస్తూ ముందుకు వచ్చి చేతులు కట్టుకుని నుంచున్నాడు. మొహం ముడతలు పడిపోయింది. తెల్లటి వెంట్రుకలు కావిరంగు తల గుడ్డ కిందనుంచీ అక్కడక్కడా బయటికి కనిపిస్తున్నాయి. మోకాళ్ళ కిందకి జీరాడుతున్న అడ్డపంచె రంగు తెలియనంతగా మాసిపోయింది.

"ఇక్కడేం చేస్తున్నావ్ ? దొంగసారా కాస్తున్నావా, బద్మాష్ ?" అన్నాడు సోమయ్య.

"రామరామ, దొర పాదాలంటి సెబతా. ఆయేల దొర కూకలేసిన కాణ్ణుంచీ మళ్ళీ ఆ యెదవ పనికాడి కెల్లనేదు"

సోమయ్య పాదాలు ముట్టుకోడానికి ఒంగాడు మాంకూ. మేకులు కొట్టిన బూట్సు కాళ్ళు దూరంగా జరిపి వారించాడు సోమయ్య.

"దొంగ వెధవ, అన్నీ అబద్ధాలే" నవ్వి అన్నాడు. "సరేకాని, కూడా రా, ఈ పెద్దమనుషుల్ని గుడి దగ్గరికి తీసుకెళ్దాం"

"సిత్తం"

చిన్నప్పవైపు తిరిగి సోమయ్య చెప్పాడు. "గాళిదేవరు హడా విడంతా వీడిదే. గుడి దగ్గరే పడుంటాడు. పూజల్లోనూ, జాతరల్లోనూ చూడాలి వీడి ప్రతాపం"

"ఎస్టేట్లో పనిచెయ్యడం లేదా ?" అడిగాడు చిన్నప్ప.

"వాడి మొహం పని. ఈ ఎస్టేటు వేసినప్పణ్ణుంచి ఇక్కడున్న ట్టున్నాడు. ఒక్కరోజయినా పని చేసేడంటే నాకు నమ్మకంలేదు"

"ఒయసయిపోయింది గందా !" మాంకూ వేలాడుతున్న చేతి కండరాల్ని తడిమి చూసుకుంటూ అన్నాడు.

"బలంగా వున్నప్పుడు మహా పనిచేసినట్టు" అన్నాడు సోమయ్య.

"సెయ్యిటుంటానే తోటింత ఉద్దినోకొచ్చినాది కావోసు" చేతులు తిప్పాడు మాంకూ.

చిన్నప్ప నవ్వాడు. మాంకూ అతనివైపు తిరిగి అడిగాడు.

"ఏ యేలకి దొరా యేల్లీదీ ?"

"రాస్కెల్, ఇప్పుడే" అన్నాడు సోమయ్య. "ఎందుకొచ్చే నను కుంటున్నావ్ యింతదూరం. నిన్ను చూట్టానికా ?"

సోమయ్య తిట్లు మాంకూని బాధపెట్టినట్లు లేవు. నవ్వేడు.

"దొర్లు సేతుల్లో ఏటిదీ ఏసుకురాలేదేటా అని అడిగేను"

"ఏవిటాయి తీసుకొచ్చేదీ ?" అరిచాడు సోమయ్య.

"దేవొరుకాడికి నెయివేద్దెం నేకంటా యెల్లటవా దొరా" బుర్రి గోక్కుంటూ నేలచూపులు చూశాడు మాంకూ. "పెద్ద దొరోల్లని ఎంటేసుకొత్తే వో యేటపోతేనా ఎయ్యోద్దేటిది ?"

"ఏడిశావ్, తొరగా రా" అన్నాడు సోమయ్య.

"ఇదో ఒచ్చేత్తాను" మాంకూ ఇళ్ళల్లోకి పరిగెత్తి మూడు కోడి పెట్టలు తీసుకొచ్చాడు.

"ఎంత డబ్బోసినా యియ్యనని కూసున్నారు. కాల్లట్టుకుని బెతి మాలేను"

"ఛా. ఛా. దొంగ వెధవా ! ఎన్నేళ్ళొచ్చినా బుద్ధులు మాత్రం మారలేదు" అన్నాడు సోమయ్య.

చిన్నప్ప కలగజేసుకొని అడిగాడు.

"ఎంతకి బేరవాడేవ్ ?"

"పదేనురూపాయ లిప్పించి సేయండి" అన్నాడు మాంకూ.

"ఈ కోళ్ళని గాళిదేవరుకి నన్ను సమర్పించ నియ్యండి" సోమయ్యతో అన్నాడు చిన్నప్ప. జేబులోనుంచి డబ్బుతీసి, పదిహేను రూపాయలు లెక్కపెట్టి మాంకూ కిచ్చాడు. తలపాగా మడతల్లో నోట్లు దాచుకుంటూ మాంకూ అడిగాడు, "ఈ పెళ్ళి మనం తీసికెల్దాం ? దొర్లు

తొందరపడి పోతావుండారు పూజి సేయిచ్చేతలికి టయిమవుద్దంటే అనాకా ఒచ్చి నే నట్టించుకెల్లి దేవారు కిత్తాను''

సోమయ్య మాంకూని మళ్ళీ తిట్టబోయాడు.

"అది మంచిదే'' అన్నాడు చిన్నప్ప. "ముసలాడు ఆ బరువు కూడా యిప్ప డెక్కడ మోసుకురాగలడు?'' మాంకూ నవ్వుతూ కోళ్ళని యిళ్ళల్లో ఒదిలేసి చేత కత్తి పట్టుకుని వచ్చాడు.

ముందు మాంకూ, వెనక సోమయ్యా, చిన్నప్పా, అతని బృందం కూలీల యిళ్ళపక్క నుంచి కొండ లోయలోకి పోతున్న కాలిబాటలో నడక సాగించారు. కాఫీచెట్లు రెండువైపులా దట్టంగా మనిషెత్తున పెరిగి వున్నాయి. చెట్లనిండా కాఫీ పిందెలు. వాటి బరువుకి కొమ్మలు ఒరిగి నేలని తాకుతున్నాయి. కొన్ని బాట కడ్డం పడ్డాయి. వాటిని ఎత్తి పట్టుకుని వెనకవాళ్ళకి దారి చేస్తున్నాడు మాంకూ. అక్కడక్కడ ముళ్ళ చెట్లని నరికి దూరంగా పారేస్తున్నాడు. సన్నటి జారుడు బాటలో అతికష్టంమీద పడకుండా నడుస్తున్న చిన్నప్పని ముసలివాడి దేహదార్ఢ్యం ఆశ్చర్య పరిచింది. మేనేజింగ్ డైరెక్టరే వెళుతున్నప్పుడు మారు మాట్లాడలేక వెనక వున్న పట్నం మనుషులు నెమ్మదిగా అడుగుతీసి అడుగేస్తున్నారు. వాళ్ళ తొడుక్కున్న తెల్లచొక్కాలూ, పేంట్లూ, పసరూ, జిడ్డూ పులుము కున్నాయి. ఆఫీసుకి వేసుకునే సున్నితమైన జోళ్ళమీద మందంగా బురద అంటిపెట్టుకుని వుంది. వాళ్ళ పరిస్థితి చూస్తే సోమయ్యకి నవ్వాగలేదు.

"ఇప్పుడీ బాట యిలా వుంది కానీ, వేసంకాలంలో ట్రింక్ రోడ్ లాగా వుంటుంది" అన్నాడు. అతను ఖాకీచొక్కా, నిక్కరూ వేసుకొని, నెత్తిమీద టోపీ పెట్టుకుని ఎస్టేటు దుస్తుల్లో సుఖంగా వున్నాడు.

"అదేటి సాపెత్తం దొరా. ఆ దారే యేరు. ఏనకి యేలు జనం ఒత్తారుగందా అంతలక్క సుబ్బరం యిప్పుడెట్లా ఒత్తాదీ?" అన్నాడు మాంకూ.

"వేసంకాలంలో ఏమిటి విశేషం ?" అడిగాడు చిన్నప్ప.

"అప్పుడు గాళిదేవరు జాతరు జరుగుతుంది" అన్నాడు సోమయ్య.

"ఎండ కాత్తంటే సరిపోద్ది కాని వోనల్లో ఎవురొత్తారు దొరా !" మాంకూ అన్నాడు. "సలికాలం మాత్తరం రాటాని కవుద్దేటి ?"

"అహఁ. అలాకాదు. కాఫీ పూతకి ముందు వర్షాలకోసం దేవర్ని ప్రార్థించడానికి ఒస్తారు" అన్నాడు సోమయ్య.

మార్చి ఏప్రిల్ మాసాల్లో అనుకూలమైన వర్షాలు పడితేనే కాని కాఫీ చెట్లు పూత పట్టవు. ఆ ఒక్క పూతమీద సంవత్సరం పంట ఆధార పడి వుంటుంది. ఒక్కొక్కప్పుడు వర్షాలు ఆలస్యమవుతూ వుంటాయి. అప్పుడు పంట దెబ్బ తింటుంది. ఎప్పుడయినా పడకపోవడం కూడా కద్దు. ఆ యేడాదికి పంటమీద ఆశ ఒదులుకోవాలసిందే. ఈ అవాంతరాలనుంచి తప్పించమని కూర్గు ప్రజలు దేవర్ని కొలుస్తారు. జాతర జరుపుతారు. గాళిదేవరు గాలిదేవత, వర్షం దేవత. పెనుగాలుల్తో ఋతుపవనాల్ని లాక్కొచ్చి సకాలంలో వర్షాలు కురిపించే ఆప్తబంధువు. అయిదారు ఎకరాల కాఫీ తోటలున్న సామాన్యుడికైనా, అయిదారువేల ఎకరాల్ని కనిబెడుతున్న కంపెనీ మేనేజర్లకైనా గాళిదేవరు దయా, సహాయం అవసరం. అందుకే జాతి, మత విచక్షణా, అంతస్థుల భేదాలూ పాటించకుండా అందరూ ఈ ఉత్సవంలో పాల్గొంటారు.

"అంత మగాత్తెం వుండమట్టే గురాళ్లొర ఈదారి వూరోల్లందరికీ ఒదిలిండు" అన్నాడు మాంకూ.

"గురాళ్లొరంటే మేంగిల్స్" చిన్నప్పతో చెప్పాడు సోమయ్య.

"అఁ, మంగిలీసుదొరే. మాకండీసను మడిసి. గుర్రెక్కి సావారీ సేత్తే గెలిసీ, వోడీ బూపెపంచకంలో నేడనీవోరు. పులియేట కెల్తే కత్తీ, తుపాకీ అక్కన్లేదు" అన్నాడు మాంకూ.

"అందుకే ఇంటికి పరుగుచ్చుకున్నాడు" అన్నాడు సోమయ్య.

"పోన్నేదొగా, ఆ మారాజు వెల్లిపోటవే నెయ్యం. దొరసానమ్మకి యీ వోనలూ, ఒరదలూ పట్టీయి కావు. సీవగడ్డనే వుంటా ఒక్కోతలికి ఒచ్చిపోతా వుండీనోరు" అన్నాడు మాంకూ.

"అప్పుడీ తోట అమ్మకుండానే వుంటే కాఫీ తెస్తున్న దొరలకి కుబేరుడై పోయేవాడు" అన్నాడు సోమయ్య.

"యెదవ డబ్బు, ఆరికున్నాది సాల్దేటి ?"

కాలిబాట వాళ్ళని చదునైన ప్రదేశంలో పెద్ద వృక్షం కిందకి తీసుకొచ్చింది. చెట్టుకింద మూడడుగుల ఎత్తున రాతిముక్కలూ, మట్టీ కలిపి దిమ్మవేసి వుంది. దానిమీద చతురస్రాలుగా పగలగొట్టిన తెల్ల రాళ్ళతో కట్టిన చిన్న యినప్పెట్టెలాంటి చీకటిగది. లోపల విగ్రహం రూపురేఖలు చెక్కని ఒక రాయి. దానిపక్కన త్రిశూలం. రాతిమీద పెద్ద నిడుపాటి ఎర్రని కుంకుంబొట్టు.

"సెప్పులిడిసేసి దేవొరుకి దన్నమెట్టుకోండి" అన్నాడు మాంకూ. చుట్టుపక్కల మొలిచిన బంతిచెట్లనుంచి పువ్వులు తెంపుకువచ్చి తలొకటీ పంచిపెట్టాడు.

"ఇప్పు డియ్యేట్టండి. ఆనాకా దొర్లపేరు సెప్పి కోడిపెట్టల్నేత్తా" అన్నాడు. అంత దగ్గిరగా మాట్లాడుతోంటే మాంకూ నోట్లోనుంచి సారా వాసన గుప్పుమని కొట్టింది.

"ఇదేనా గాళిదేవరు గుడి ?" అప్పటివరకూ నోరు మెదపని తెల్లబట్ట మనుషుల్లో ఒకతను ఆశ్చర్యంగా అడిగాడు.

"ఇదే. నమ్మకం లేకుండా వున్నారా ? పట్నాల్లో గుళ్ళలాంటి పెద్ద కట్టడాల్ని వూహించుకున్నట్టున్నారు" నవ్వాడు సోమయ్య.

"సిన్ని గుడి గందా అని ఎగతాళి సెయ్యబోకండఫో, మరి

గంటే దేవారిక్కను కొచ్చెనా మగాత్తెం సూపగద్దురు" అన్నాడు మాంకూ.

"ఎవరేమన్నారాి ?"

సోమయ్యకి తన మాటల్లో ఎక్కడైనా అపరాధం స్ఫురించిం దేమోనని భయంవేసింది.

"ఆశ్రియిస్తే ఎంత దయగా వరాలిచ్చినా, ఆగ్రిహం వస్తే అంతకి రెట్టింపు పట్టుదలా వుంది గాళిదేవరుకి" అన్నాడు తక్కినవాళ్ళ వైపు తిరిగి. అతనికి మేంగిల్స్ పడ్డ కష్టాలు జ్ఞాపకం వచ్చాయి. వాటి గురించి మాట్లాడకుండా వుండలేకపోయాడు.

మేంగిల్స్ కట్టించిన పెద్ద బంగళా పూర్తవౌస్తున్న రోజులు. అంతవరకూ అతను శిధిలమై పోతున్న పాత యింట్లోనే వుండేవాడు. అసలు మేంగిల్స్ బ్రిదర్స్ కొన్నప్పుడు ఎస్టేటు మంచి స్థితిలోలేదు. కాఫీ మొక్కలు తిండిమొహం ఎరగనట్టు ఒడిలిపోయి వుండేవి. వాటిని సంస్కరించి కొంత డబ్బు చేసుకొనేవరకూ మేంగిల్స్ భార్యాపిల్లల్ని ఇంగ్లండులో తన అన్న దగ్గర విడిచిపెట్టేడు.వాళ్ళని ఆశ్చర్యపరిచేటంత పెద్ద బంగళా కట్టిగాని ఎస్టేట్లో వుంచననేవాడు. చివరికి బంగళా కట్ట గలిగాడు కాని, దాని భోగం అనుభవించలేకపోయాడు. ఆ బంగళాలో వంటగది నుంచి వాడిన నీళ్ళు పోడానికి కట్టిన సిమ్మెంటు కాలువ గాళి దేవరు విగ్రిహం పక్కగా పోయేది. అది దేవరుకి అపచారమని,వంట గదిని మార్చమనీ కూలీజనం మేంగిల్స్‌ని ప్రాధేయపడ్డారు. అతను నవ్వి వాళ్ళని పొమ్మని కసిరాడు. దేవరు కాగ్రిహం కలుగుతుందనీ, అప్పుడు కీడు మూడడం తప్పదనీ హెచ్చరించారు. మేంగిల్స్ లెక్క చెయ్యలేదు. మూఢనమ్మకాలని విసుక్కున్నాడు. పైగా అనుకున్న రోజుకి ముందే వెయ్యదల్చుకున్న కుర్చీలూ, బల్లలూ ఇతర సామాన్లతో

యిల్లు నిండకముందే కొత్త బంగళాకి మారాడు. ఆరోజునుంచీ అతని కష్టాలు మొదలయ్యాయి. గుర్రపు స్వారీకి వెళ్ళినవాడు చెయ్యి విరక్కొట్టుకుని వచ్చాడు. తరవాత తరవాత అతను తాగుతున్న గ్లాసులు మాయమయ్యేవి. ప్లేటల్లో భోజనం బదులు రాళ్ళు కనిపించేవి. తలుపులు జాగ్రత్తగా బిగించిన గరాజ్‌లో కారు రాత్రిళ్ళు స్టార్టయి, హారన్ మోగడం ప్రారంభించేది. ఇటువంటివే ఇంకా లెక్కలేనన్ని. గాలిదేవరు నిదర్శనాలని అందరూ పోరు పెట్టారు. మేంగిల్స్ భయపడ్డాడు. కాని తొందరగా లొంగలేదు. ఇల్లు మారిన పదవరోజున తన చిన్నకొడుకు హఠాత్తుగా చచ్చిపోయాడని ఇంగ్లండునుంచి కేబుల్ వచ్చినప్పుడు మాత్రం అతని ధైర్యం సడలిపోయింది. దానికితోడు ఆ యేడాది సకాలంలో వర్షం పడక కాఫీచెట్లు సరిగ్గా పూత పుయ్యలేదు. వెంటనే ఎస్టేటు బేరానికి పెట్టి పాత యింట్లోకి మారిపోయాడు.

"ఏటి సేత్తాం, రాతట్టాగుంటే. ఆయేల ఒచ్చేతలికి బుద్ధి అట్టా సేయిస్తది. దరమరాజంటి పెబువులికి పెడసరం బుద్ధి పుడతాదని కలగంతామా?" అన్నాడు మాంకూ.

"గుడి కట్టమని పురమాయించేడని మేంగిల్స్‌మీద వీడికంత అభిమానం" మాంకూవైపు తిరిగి అన్నాడు సోమయ్య.

"దాంట్లో ఏమాత్రం మిగిల్చేవురా?"

"దొర్లు పరాసికాలాడతన్నారు" అన్నాడు మాంకూ.

"ఈ గుడి నువ్వు కట్టేవా?" చిన్నప్ప అడిగాడు.

"ఔనుదొరా. తప్పుసేసిండని సిచ్చకి గుడి లేపిండు గుర్రాద్దొర. నన్ను సూత్తానికి పుండమనిండు. శానా డబ్బయి పోనాది. నాదీ కాంతో, కూంతో అడ్డాది" అన్నాడు మాంకూ. సోమయ్య నవ్వాడు.

"మేంగిల్స్ ఒదిలేసిన బంగళాకి వెళ్ళడానికి ఇక్కణ్ణుంచి దారుందా?" సోమయ్యని చిన్నప్ప అడిగాడు.

"ఏరా ?" మాంకూ వైపు చూశాడు సోమయ్య.

"అదేటి దొరా, యీ పెట్టెనకాల గుట్టమీదున్నాది. అదిగదే బంగలా. కొట్టిన దారేటీ నేదు"

"పోగలమా ?" అన్నాడు చిన్నప్ప.

అందరూ బంగళాకి బయల్దేరారు. చిన్న గుట్టమీద విశాలమైన భాగం పదునుచేసి వుంది. ముళ్ళ టుప్పలూ, అడివి మొక్కలూ ఇంటి చుట్టూ దట్టంగా పెరిగివున్నాయి. ఇంటి తలుపులు ఎవరో పీకేసి ఎట్టు న్నారు. గుమ్మాలు సగం పైగా చెదలు తినేసో, ఊడిపోయో వున్నాయి. అక్కడక్కడా కిటికీలకు ఒక్కొక్క గాజుపెంకు వేలాడుతూంది. కప్పు మీద మచ్చుకైనా ఒక్క పెంకులేదు.

"పెంకులన్నీ మాంకూ పట్టుకుపోయి వుంటాడు" అన్నాడు సోమయ్య.

"అమ్మో, యీ బంగలా సరుకు అంటుకోటవే ?" అన్నాడు మాంకూ.

"నీ యింటికి పెంకులూ, కలపా ఎక్కణ్ణుంచి వచ్చినయ్యిరా ?" మాంకూ ఇంటివైపు చూపించాడు సోమయ్య. వాళ్ళెక్కి వచ్చిన దారికి ఎడంగా అరటిచెట్ల మధ్య కనిపించింది. కూలీల యిళ్ళలాలేదు. కొంచెం పై అంతస్థుకి చెందినట్టుంది.

"వీడు కొంటాక్టరయ్యాకా స్వయంగా కట్టుకున్నాడు" అన్నాడు సోమయ్య మళ్ళీ.

"రగతం వోడ్చి గడిచ్చిన సొమ్మెట్టి కట్టిచ్చీను" అన్నాడు మాంకూ. సోమయ్య పెద్ద నవ్వు నవ్వాడు.

కూలిపోయిన ముందు గుమ్మంలోనుంచీ చిన్నప్ప బంగళాల్లో ప్రవేశించాడు. తక్కినవాళ్ళు అనుసరించారు.

"పెద్ద బంగళా"

"మేంగిల్స్‌కి చాలామంది పిల్ల లుండేవారట. అరుగు రను కొంటాను. తలొక గదీ కట్టించి,అతిథుల కోసం ఇంకొకటి కట్టించాడు" అన్నాడు సోమయ్య.

"ఇది స్నానాలగదిలా వుంది" రెండో తెల్లబట్ట మనిషికి స్నానాల గది చూస్తే ప్రాణం లేచివచ్చింది. దాని పొడుగూ, వెడల్పూ, ఎత్తూ చూసి ఎన్ని మొజయిక్ పెంకులు వెయ్యాలో ఒక్క నిముషంలో అంచనా వేసేశాడు.

"స్నానాల గదులూ, మొజయిక్ పెంకులూ వుంటే నీ కింకేవీ అక్కర్లేదు" నవ్వాడు చిన్నప్ప.

మేనేజింగ్ డైరెక్టరు మెప్పు అతన్ని సంతోషంలో ముంచి ఎత్తింది.

"అన్నేళ్ళ క్రితం కూడా యింత విశాలంగా స్నానాల గదులు కట్టేరంటే నమ్మలేకుండా వున్నాను" అన్నాడు.

"దీంట్లో వేసిన తొట్టె లవీ చూస్తే మరీ ఆశ్చర్యపోదురేమో మీరు. ఇంగ్లీషు తయారీలో ప్రత్యేక రకాలివట" అన్నాడు సోమయ్య.

"సూత్తే కళ్లు జిగీల్మనీది. సవదర్రం నడాన్ని ముంచేసినుర్రి" అన్నాడు మాంకూ.

"ఆఁ !" తెల్లబట్ట మనిషి ప్రాణం కొట్టుకుపోయింది.

"అవును, మేంగళూర్ సముద్రంలో పారేయించేశాడు మేంగిల్స్" అన్నాడు సోమయ్య.

"ఎందుకు ?"

"వాటికి గాళిదేవరు శాపం తగిలింది. మళ్ళీ పాత ఇంటికిపోతూ మేంగిల్స్ కొత్త బంగళా స్నానాల గదుల్లో తొట్టెలూ, షవర్లూ,అద్దాలూ,

అప్పటికి తయారై వచ్చిన కొద్దిపాటి కుర్చీలూ, సోఫాలువంటి విలువైన సామాన్లూ రెండు రెండెడ్ల బళ్ళకేసి పట్టుకుపోదామనుకున్నాడు. మొదటి బండి వంద గజాలు నడవకుండానే ఒక యెద్దు కూలిపోయి చచ్చి పోయింది. ఈ అపశకునంతో సామాన్లు ఎస్టేట్లో ఉండడానికి వల్లకాదు, దూరంగా పారెయ్యాలని గోల బయల్దేరింది"

"అమ్మెయ్యకపోయారా ?" అడిగాడు తెల్లబట్ట మనిషి.

"అమ్మడం లాగే వుంది. పడిపోయిన బండిలో వస్తువులు తిరిగి బంగళాకి జేరవెయ్యడానికే ఎవ్వర్నీ ఒప్పించలేకపోయాడు మేంగిల్స్. ఎంత డబ్బాశ చూపించినా ఒక్క లారీ డ్రైవరూ బండివాడూ బరువు తీసుకెళ్ళి పారెయ్యడానికి ధైర్యం చెయ్యలేదు"

"సిగురుకి ఆ కిరస్తానీ బొష్లేరు తోలు కెల్లిండు. అల్లంతెత్తు కెరటం లెగిసిందంట ఆటివ్ని గిరాటేసేతలికి" అంది పుచ్చుకున్నాడు మాంకూ.

"నిజంగా సముద్రంలో పారెయ్యలేదటగదా ?" అన్నాడు చిన్నప్ప. మాంకూ ఒకటి రెండు నిముషాలు సంకోచించాడు.

"ఏటో దొరా, నాకు తెల్దు. ఆడయ్యన్నీ అట్టుకెల్లి యాపార వెట్టిండని యిక్కడోల్లు గుసగుసలాడుకునీ వోరు" అన్నాడు.

"మీరెవరూ మళ్ళీ ఒట్లర్ని చూళ్ళేదా ?"

"ఏటిదికి ? అడు బాగడిపోనాడంటా యేదుత్తా వుంటానికి ఆడ ముండోడ్నేటి నేను ? సేవుంటే పివ్వూ సంపాదిచ్చాల"

"వాడు డబ్బు గడించిన విషయం నిజమేనన్నమాట" అన్నాడు సోమయ్య.

"అదేవో, నాకెట్టా తెలుస్తది ? ఎట్టా గడించిండో, ఏపాటి గడించిండో నే నాదికాడికి పోలేదు, ఆడ్నాకు సెప్పనేదు. ఈ కుసుద్దపు యెధ

వలు కూసిందే అ ఎమెన కాల ఆడింకా పెద్దోడయి పోయుండంటూ యేడి సీవోరు. తెలకడుగుతాను దొరా, పుంజిడు పింగానీ సిప్ప లుచ్చుకుని లచ్చలు గడిచ్చటానికీ, ఆడిసేతిలో మాయ మంతరం వుందేటి ?"

"పింగాణీ చిప్పలా ? వాటి విలువ నీకు తెలిసినట్టులేదు" తెల్లబట్ట మనిషి మనస్సు చివుక్కుమంది.

"పోన్లే. మాంకూకి మనం ఇప్పుడు ఉద్యోగం యివ్వటంలేదుగా. వాటిగురించి బోధించనక్కర్లేదు" నవ్వాడు చిన్నప్ప.

"మీరు ఉద్యోగం ఇస్తానంటే మటుకు వస్తాదేవిటి వాడు ?" అన్నాడు సోమయ్య.

"దొర్లకి ముసలోడ్నిసూత్తే ఆసికంగా వున్నాది. వొచ్చే పాణం, పోయే పాణం గాల్దేవురి పాదాలకాడ వగ్గేయాలిసిందే" అన్నాడు మాంకూ.

"చూశారా, వాడి కిక్కడ కొండంత వ్యాపారం వుంటే, ఒదులుకుని మీ దగ్గరికెలా రాగలడు ?" అన్నాడు సోమయ్య.

"ఒద్దులే మాంకూ, మేం పట్టుబట్టడంలేదులే" అన్నాడు చిన్నప్ప.

"అంతేసి ఊసులాడమాకండి దొరా" మాంకూ చేతులు జోడించి చిన్నప్పకి దణ్ణం పెట్టాడు.

స్నానాలగదినుంచి బయట వరండామీదకీ, అక్కణ్ణుంచి బంగళా వెనకభాగంలోకీ కదిలారంతా.

"దిట్టమైన కట్టడం" అన్నాడు తెల్లబట్ట మనిషి.

"కలకాలం వుండాలని కట్టించింది కాని, ఇలా అవుతుందనుకోలేదుగా" అన్నాడు సోమయ్య.

"మేంగిల్స్‌ని భయపెట్టింది బట్లరేనట ?" మాంకూ వైపు తిరిగి చిన్నప్ప అడిగాడు.

"ఆడేం సేసిండు?" అన్నాడు మాంకూ. "దొర బంగలా యిడిసి

పెట్టి యెల్లిపోతంటే బెయం వొద్దంటా పోరెట్టెండు. ఆ మారాజింటేనా? అతలికే అరిగుండి బేజారెత్తిపోనాది. ఈ యెదవ వొలవొలా యేడిసిండు"

"తమాషాలన్నీ అతనేచేసి దేవరు మహత్త్యం అని మేంగిల్స్‌ని నమ్మించాడంటారే ?" అన్నాడు చిన్నప్ప మళ్ళీ.

"అదేటి సొబువు, గుర్నాద్దొర సేసింది తప్ప యిదేవొరు కాగ్గరం వొత్తేనీ"

"కనిపించిన వాణ్ణంతా అల్లరిపెట్టి ఏడిపించడం అతనికి సరదా అటగదా ?"

"అదికాగొనం వున్నది. ఓ పాలియేటి సేసిండూ, మా యింటిది అమ్మోరుకి కోడిపెట్ట కోసెట్టింది. పూనకంఅంటా యీడొచ్చి తలకాయ కాణ్ణుంచి సొంతం బోంచేసిపోయిండు"

చిన్నప్ప నవ్వాడు.

"మేంగిల్స్‌ని కూడా ఒక ఆట ఆడించాడని చెప్తారు" అన్నాడు.

"అబద్దం, ఎవొరుదొరా సెప్పేదీ ? ఈ తోట్లో ఒక్క గాడిది కొడుకుని సెప్ప మనండి సూత్తా. నాలిక సీలిపోద్ది" అన్నాడు మాంకూ.

"మరి మేంగిల్స్ తాగుతున్న గ్లాసు తీసేసి మాయమైపోయిందని పుకారు పుట్టించలేదూ ?" అన్నాడు చిన్నప్ప.

"అది సత్తెపేదొరా" మాంకూ ఒప్పుకొన్నాడు.

"నిజంగానా ? ఏం జరిగింది ?" ఆతృతగా అడిగాడు సోమయ్య.

"ఆయాల దొర సీకాగ్గా ఎగిరిపడతండాడు. సెయ్యిరిగి కట్టేస్కుని ఆసుపత్తిరినించి వత్తానే పిచ్చోడ్నాగా యిల్లంతా గాలిచ్చేత్తా గళాసుమీద గళాసు యిస్కీ ఎక్కిచ్చేత్తండాడు. అతలికి కూలోల్లం సూట్టానికెల్లాం. ఎట్టాగీనా వొంటెల్లు ఆకాడ్నించి తప్పిచ్చెయ్యటానికి ఒప్పించాలా అని"

"వంటిల్లు మార్చడవెందుకు. నీళ్ళు గుడి దగ్గిరకి పోకుండా చెయ్యలేరా ?" తెల్లబట్ట మనిషికి సందేహం వచ్చింది.

"బెమ్మాండవేటిగాని, కొండవాటం అట్టాగున్నాది. సిమ్మెంటూ, సున్నమూ యేసి కట్టిచ్చిన తూవు యిరగ్గొట్టనంటా పంతపట్టి కూసున్నాడు దొర. మాయన్నీ తెలింతక్కువ నమ్మకాలంటా కూకలేసిండు"

"తరవాతేవయిందో చెప్పు" తొందరపెట్టేడు సోమయ్య.

"ఏటవుద్ది. మైకవులో వున్నాడేమో. సూట్టాని కీల్లేదని గసిరి పొమ్మనేసిండు. కూలోల్లం ఒగ్గనేదు. యిఁసురుగావచ్చి మీదపడిపోయిండు. నోపల బొల్లేరూ, వంటోడూ దొర యిడిసేసిన కొంత యిస్కీవుంటే, తాగేసినుర్రి. దొర తాగటం అయిపోనాదని అల్లబెర్రిమ. ఆనాకా దొర కూకలేత్తే బొల్లేరు బెయంపడిపోనాడు. ఆడికి తెలవదంటా బొంకిండు. వంటోడూ అట్టానే బుకాయిఁచిండు. పొద్దు పొడిసేయేలకి దొర తాగీ గలాసు గాల్దేవరు మగాత్తాన్న మాయవయిందంటా వోర్త గుప్పుమన్నాది'

"నిజం బయటపడకుండా వుందా ?" అన్నాడు తెల్లబట్ట మనిషి. ఏ విషయాన్నీ తర్కించకుండా నమ్మడం అతని కలవాట్లేదు.

"మాలాటోల్లు నలుగురి సెవులుకొడి కెట్టాగో వత్తాది. కూలోల్లందరికీ యెట్టా తెలుత్తాదీ ? ఆ యెదవ లిద్దరూ అడల్తా వానికిపోతండారు గందా నోరిప్పుతారో యేవో"

"ఒకళ్ళకి తెలుస్తే అందరికీ తెలిసినట్టే" అన్నాడు తెల్లబట్ట మనిషి.

"గురాిర్దోర మాత్తరం నమ్మేరేటి ? మోసవయి పోనాదంటా శానాల్లు సీదరిచ్చుకునీనోరు. కడం మగెత్తాల సందట్లో యిదీ కమ్మొకుపోనాది" అన్నాడు మాంకూ.

"తక్కిన నాటకం కూడా బట్లరాడిందేనట" అన్నాడు చిన్నప్ప.

"మీ కిదంతా ఎలా తెలుసును?" అడిగాడు సోమయ్య.

"విన్నాను" అన్నాడు చిన్నప్ప.

తను విన్నది చెప్పాడు.

గాలిదేవరు మహిమవల్ల విస్కీగ్లాసు మాయమయిందని మేంగిల్స్ నమ్మనిమాట నిజమే. ఇది జరిగిన మర్నాడే బంగళా ఆవరణలో పెద్ద చెట్టు విరిగిపడి అతని పెంపుడుకుక్క చచ్చిపోయింది. దీంతో మేంగిల్స్ మనస్సు కలవరపడడం మొదలు పెట్టింది. దానికితోడు కూలీల గోల. అయినా జడిసినట్టు ఎవరికీ తెలియకుండా వుండాలని చాలా ప్రయత్నిం చాడు. ప్రతిపనిలోనూ అధైర్యం, అపోహ, భయం కమ్ముకువచ్చేవి. వింతగా ప్రవర్తించేవాడు. యజమాని నిర్బలత్వాన్ని చూస్తే బట్లరుకి నవ్వాగేదికాదు. దొర పిరికితనాన్ని ఆసరాగా తీసుకుని అల్లరిపెట్టి వినో దించకుండా వుండలేక పోయాడు. భోజన సమయంలో వాయికీ, వాయికీ పళ్ళేలు మార్చేటప్పుడు వీలు చూసుకొని అన్నం పళ్ళెం మార్చేసి నేర్పుగా రాళ్ళు పెట్టిన పళ్ళెం యిరికించేవాడు. మేంగిల్స్ పడకగది డ్రాయర్లో దాచుకున్న మారుతాళం తీసి, గరాజ్ పైకప్పునుంచీ లోపలికి దిగి కారు స్టార్టుచేసి, హారను వాయించి పారిపోయేవాడు. ఇంకా ఇటు వంటివే ఎన్నో. మేంగిల్స్ కంగారుపడుతుంటే, యితనికి ఆటగా వుండేది. తమాషాల్ని నిజం అని నమ్మించగలిగానని మురిసిపోయేవాడు. అయితే, అవి వింత పరిణామాలకి దారి తీస్తాయనుకోలేదు. అంతా జరిగి పోయిం తరువాత చెప్పడానికి ధైర్యం చాల్లేదు.

"దొర సెబతావుంటే నమ్మడానికిల్లేకంటా సిత్తరంగా వున్నాది" అన్నాడు మాంకూ.

"నాకు అలాగే అనిపిస్తూంది" అన్నాడు సోమయ్య.

కొంతసేపు జీపులో తిప్పి ఎస్టేటు చూపించి, గాళిదేవరు దర్శనం చేయించి ఛోటా విస్కీకీ, ఖులాసా కబుర్లకీ తిరిగి అతిథుల్ని బంగళాకి తీసుకుపోదామనుకున్న సోమయ్య తను ఊహించలేని విషయాల ఒత్తిడికి తట్టుకోలేకపోయాడు.

"వంటిల్లెటువైపు ?" అన్నాడు చిన్నప్ప. అప్పటికే యిల్లంతా కలయజూసి చదరపు గజాలూ, ఘనపరిణామాలూ లెక్కకట్టిన తెల్లబట్ట మనిషి "ఈ చివర" అంటూ దారి తీశాడు. చిన్నప్ప వంటగదిలో ప్రవేశించి, పాత్రలు కడిగే తొట్టిని పరీక్షించడం ప్రారంభించాడు. తొట్టి సిమ్మెంటు చాలావరకూ పగిలిపోయివుంది. లోపల ఇటికలుకూడా మూడు వంతులు కరిగిపోయాయి. మీద ఒకప్పుడు కొళాయి వుండేదనడానికి ఆనవాలుగా విరిగిపోయిన రేకుముక్కలు ఇక్కడా అక్కడా గోడకి అంటిపెట్టుకుని వున్నాయి. తొట్టికింద నీళ్ళు పోడానికి చేసిన కన్నం పూర్తిగా పూడుకుపోయింది. నేలమీద పడున్న ఒక పుల్లని తీసి కన్నం కెలికాడు చిన్నప్ప.

"ఇక్కణ్ణుంచేనా నీళ్ళు గాళిదేవరు విగ్రహం దగ్గిరకి పోయేది?" అన్నాడు మాంకూని చూసి.

"అవును"

వంటగది బయటకివచ్చి సిమ్మెంటు కాలవకోసం చూశాడు చిన్నప్ప. గడ్డీ, మట్టీతో కప్పబడిపోయి వుంది. ఇక్కడా అక్కడా కొంతరాయి బయటికి కనిపిస్తూంది. దాని వారన కాలిజోడుతో కొట్టి వర్షాలకి మెత్తబడిన కొంతమట్టిని పైకి లాగాడు.

"ఆ కత్తితో కాస్త పొడు మాంకూ" అన్నాడు.

మాంకూ మట్టిబిళ్ళల్ని పెళ్ళగించడానికి ఉపక్రమించాడు. సోమయ్యకేవీ అర్థం కాలేదు. కూడా తీసుకువచ్చిన కర్రతో తనూ కాలవ శుభ్రం చెయ్యడం మొదలుపెట్టాడు,

"ఇక్కడ చూడు మాంకూ" అన్నాడు చిన్నప్ప ఉత్సాహంగా. మాంకూ వెనక్కి తిరిగాడు. సిమెంటుకాలవ అక్కడ కొట్టేసివుంది. ఆ పైన నీళ్ళుపోకుండా రాళ్ళు ఒకదానిమీద ఒకటి పేర్చివున్నాయి. అక్కణ్ణుంచి మలుపు తిరిగి కొండకి రెండవవైపు నీళ్ళు పారడానికి కట్టిన సన్నకాలువ ఆనవాళ్ళు చూచాయగా కనిపిస్తున్నాయి. "ఈకాలవ ఎక్కడికి పోతుంది మాంకూ ?" అన్నాడు చిన్నప్ప.

మాంకూ ముసలి కళ్ళు విలవిలా మెరిసాయి. చిన్నప్పని పరిశీలించి చూశాడు.

"ఏం మాంకూ" అన్నాడు చిన్నప్ప మళ్ళీ.

"దొర్లకి తెలీని యిసయవేటి ?"

ఆ పక్కనే తవ్విన గోతిలోదిగి నుంచున్నాడు మాంకూ.

"ఇక్కడికి" అన్నాడు.

అతను లోపల నుంచోకపోతే అది గొయ్యని తెలియడం కష్టం. కలుపు మోకాళ్ళదాకా మాంకూని కప్పేసింది.

సోమయ్యకి చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది. చరచరా గొయ్యి దగ్గిరకి వెళ్ళాడు.

"వంటింట్లో నీళ్ళు విగ్రహం దగ్గిరికి వెళ్ళనే లేదన్నమాట !" అన్నాడు.

మాంకూ వున్న పళ్ళన్నీ బయటపెట్టి నవ్వాడు.

"అంతా తెలుసుండే దాచిపెట్టేవురా ?" వురిమాడు సోమయ్య.

"నేదుదొరా" అన్నాడు మాంకూ.

"ఇంకా అబద్ధాలే, వెధవా !"

"సత్తెందొరా, అడుపోయేతలికి నాకు తెల్దు" అన్నాడు మాంకూ.

"ఎవరు ?"

"ఆదే, కిరస్తానీ బొప్లేరు"

"వాడు తవ్వేడా ఈ గొయ్యి ?"

"ఆదేమరి. వంటింట్లో అయ్యా, ఇయ్యా కడిగివోడాదేగందా" అన్నాడు మాంకూ.

"వాడెళ్ళిపోయిం తరవాత తెలిసిందని దొరతో చెప్పడం మానేస్తా వటాని రాస్కెల్ ...... స్కౌండ్రిల్ ......"

సోమయ్య తిట్లతో గుక్క తిప్పుకోలేక ఉక్కిరి బిక్కిరయ్యాడు. అది మాంకూ వ్యక్తిగత సంబంధమైన విషయం అన్నతలపు అతనికి రాలేదు. జరిగింది ఎన్నో ఏళ్ళ క్రితంఅనీ, తనకి పరిచయమైనాలేని మేంగిల్స్‌కనీ, దానివల్ల తనకే నష్టమూ కలగలేదనీ కూడా అనిపించ లేదు. కింద పనిచేసే కూలీమీద ఎప్పట్లు నడిపే దొరల పక్షాన్న అతడు రౌద్రుడై పోయాడు.

"దొర్లు కోంపడమాకండి" అన్నాడు మాంకూ. "గాడ్దేవరు వూసు సెప్పుకుంటా బతికీయెదవని"

"మాంకూ" పిలిచాడు చిన్నప్ప. అతని గొంతులో మార్దవం ఆవరించింది.

మాంకూ తలెత్తి చూశాడు.

"నీ గురించి మా తాత నా కెందుకు చెప్పలేదో తెలియడంలేదు" అన్నాడు.

"ఏటిదొరా ! తవురనీది, తాతా ?" ఆశ్చర్యపోయాడు మాంకూ.

"అవును చిన్నప్ప"

"కిరస్తానీ బొప్లేరు"

ఆప్యాయంగా ఏందోనీ చిన్నప్ప దగ్గిరకివెళ్ళి ఒళ్ళు నిమిరి

చూశాడు మూంకూ. నచ్చినట్టు తృప్తిగా కనుబొమ లెగరేసి బుర్రి ఆడించాడు. ఆ సాన్నిహిత్యానికి అతనిలో నిగ్రహం కట్టలు తెంచుకుంది. గట్టిగా నవ్వాడు. ఆ నవ్వు పెద్దదై ఇంకా పెద్దదై లోయ మారుమోగింది. వారించాలని ఎవరికీ తోచలేదు.

* * *



# ఫ్యాన్సీ డ్రెస్ పార్టీ

మురళీ ఆఫీసునుంచి వచ్చేసరికి రోజూలాగే లలిత ఫైర్ ప్లేస్ ముందు కూచుని ఏదో అల్లుతూంది. రాగానే ఆమె నుదుటిమీదో, బుగ్గ మీదో చిన్న ముద్దుపెట్టి, పక్కన్ని కూచుని కబుర్లు చెప్పడం అతనికి అలవాటు. కాని యివాళ ఆమెని చూడనట్టుగానే తనగదికి వెళ్ళి సూట్ కేస్ సద్దుకోడం ప్రారంభించాడు. 'ఇంకా కోపం తగ్గలేదన్నమాట' లలితకి నవ్వొచ్చింది. చేతిలో సామాను పక్కనున్న బల్లమీద పెట్టి, భర్త గది లోకి వెళ్ళింది.

"డార్లింగ్ !" ఆప్యాయంగా పిలిచింది.

"ఊఁ !"

"ఈవాళ్ళకూడా అలా మూతి ముడుచుకుని వుండకు, ప్లీజ్ !"

టీజింగ్‌గా అంది లలిత.

"నేను క్లబ్బులో దిగి నీకు కారు పంపిస్తాను" అన్నాడు మురళీ సూట్ కేస్ మూత బిగిస్తూ.

"ఈవాళ సరదాగా వుండవలసింది పోయి ఇలా వుంటే ఎలా ?"

అతని కోపం తగ్గించడానికి ప్రయత్నంచింది లలిత.

మురళీ జవాబు చెప్పలేదు.

"నే వెళ్తున్నాను" అన్నాడు.

"టీ ?" అడిగిందామె.

"అక్కర్లేదు. క్లబ్బులో తాగుతాను" సూట్ కేస్ పట్టుకుని పోర్టికోలో కారు దగ్గరకి నడిచాడు మురళీ.

"అయితే నాకు కారూ పంపక్కర్లేదు" కోపం అభినయించింది లలిత, అతన్ని అనుసరిస్తూ.

"సరే" కారు స్టార్ట్ చేశాడు మురళీ.

"నిజంగా పంపొద్దు" ఇంజను హోరులో వినిపించేలా గట్టిగా అరిచింది లలిత. "మిసెస్ గేర్రీ నన్ను పిక్ చేస్తానంది"

'సిల్లీ డార్లింగ్. చిన్నపిల్లాడు మోస్తరు' అనుకుంది లలిత. ఎంత స్వల్ప విషయానికి ఎంత రభస ! మొగాళ్ళంతా ఇంతే. లాలించి లొంగదీయవలసిందేకాని వీళ్ళతో తర్కించి లాభంలేదు. ఇంత గొడవా తను రాత్రి ఫాన్సీడ్రెస్ పార్టీకి వేసుకోదలచిన డ్రెస్ గురించి అంటే ఎవరైనా నవ్వివోతారు.

ఎన్నోనాళ్ళుగా ఈ నాలుగు రోజుల కోసం ఎదురుచూస్తూంది లలిత. టీ తోటల్లో జీవితం ఎంతో ఒంటరిగా వుంటుంది. ఇక్కడ చాలా భాగం ఖాళీలే. కొద్దిమంది గుమాస్తాలూ, ఫ్యాక్టరీ సిబ్బందీకూడా

వుంటారు. మేనేజ్‌మెంట్ హోదాలో వున్నవాళ్ళు వీరితో కలవడం ఎలానూ పడదు. పోతే, మిగిలినవాళ్ళు, తోటలోని మేనేజరూ, అసిస్టెంటు మేనేజర్లూ, ఇరుగు పొరుగు తోటల్లోని మేనేజరూను. ఒక్కొక్క తోటలో సాధారణంగా ఒక మేనేజరూ, ఒక రిద్దరు అసిస్టెంట్ మేనేజర్లూ, ఉంటారు. వీరి బంగళాలుకూడా ఏ మంత దగ్గర దగ్గరగా ఉండవు. తనూ మురళీ ఉండే బంగళానుంచి ఇంకొక అసిస్టెంటు మేనేజరు బంగళా మూడు మైళ్ళు. మేనేజరు బంగళా మూడున్నర మైళ్ళు. సాధారణంగా సాయంత్రాలు తాము ఏదో ఒక బంగళాకి వెళ్ళడమో, వాళ్ళు తమ బంగళాకి రావడమో పరిపాటి. అదీ లేకపోతే మతిపోయినట్టుంటోంది. ఒక్కొక్క రోజున ఏవో అడ్డు తగలడంవల్ల రాలేమని మిసెస్ హార్డీ కాని, మిసెస్ సేత్ కాని ఫోను చేస్తారు. ఆనాడు లలిత ఉత్సాహం అంతా నీళ్ళు కారిపోతుంది. సాయంత్రం అయిదు దాటిం తరవాత ఫోను మోగిందంటే తనకిదే భయం. మిసెస్ సేత్ కి తల నొప్పిగా ఉండి రాలేనని చెప్పడానికి పిలుస్తుందేమో. కాకపోతే, హార్డీస్‌ని చూడడానికి ఎవరైనా స్నేహితులు అనుకోకుండా వచ్చారేమో. ఏం రోజు: అయితే, అటువంటప్పుడుకూడా లలిత సాయంత్రాలు ఇంట్లో కూచోలేదు. పక్క తోటల్లో స్నేహితుల ఇళ్ళకి ఫోనుచేసి తాము వస్తున్నామనో వాళ్ళని రమ్మనో చెబుతుంది. కాని అస్తమానూ పక్క తోటలకి వెళ్ళడం సాధ్యం కాదు. తోటకీ, తోటకీ కనీసం ఎనిమిది మైళ్ళ దూరం ఉంటుంది. కొన్ని తోటలు ముప్ఫయి, నలభయి మైళ్ళ దూరంలోకూడా ఉన్నాయి. పైగా మురళీ నాలుగు దాటింతరవాత కాని ఇంటికి రాడు, పోనీ రాగానే బయలుదేరుతాడా అంటే అదీలేదు. అతడు టీ తాగడం ఒక పెద్ద తతంగం. అచ్చం ఇంగ్లీషు దొరగారు తాగినట్టు తాగాలి. బేరరు ట్రేలో పాలూ, పంచదారా, స్ట్రెవరూ అన్నీ పెట్టి తీసుకురావాలి. కలిపి తెచ్చిన టీ ఎన్నడూ ముట్టుకోడు. 'నీ రుచులు బేరరుకి నీకంటే బాగా తెలుసును,

వాడిని కలవనియ్య' మంటే మూతి ముడుచుకుంటాడు. మురళీ మూతి ముడుచుకున్నప్పుడు చూసి నవ్వడం లలితకి సరదా. అందుకనే అస్తమానూ అతన్ని వేళాకోళం చేస్తూ ఉంటుంది, సాధారణంగా తమాషా కోసం అతన్ని తొందర పెట్టినా, ఎక్కడికయినా వెళ్ళబోతున్నప్పుడు అతనుచేసే ఆలస్యం మాత్రం ఆమె సహించలేదు. టోస్టుకి వెన్న, జామ్ రాయడం ఒక గంట. టీ కలుపుకోవడం సరేసరి తరవాత స్నానం. నెమ్మదిగా బట్టలు వేసుకోడం. ఈ లోపున పుణ్యకాలం కాస్తా అయిపోతుంది. అతను తయారయే లోపున మూడు బ్రిడ్జిరబ్బర్లు పూర్తి చెయ్యొచ్చు అంటుంది లలిత. అంత అవసరమైతే ఆమెని వెళ్ళి రమ్మంటాడు. నిజానికి, పనినుంచి అలిసిపోయి వచ్చింతరువాత మురళి ఎక్కడికీ వెళ్ళబుద్ధివెయ్యదు. టీ, స్నానం ముగించి రేడియో సన్నగా పెట్టుకుని, ఏ లైఫ్ మేగజీనో, సాటర్ డే ఈవినింగ్ పోస్టో తిరగేస్తూ కబుర్లు చెప్పుకోడం అంటే అతనికి సరదా, అయితే లలిత కోసం తప్పని సరిగా బయలు దేరుతాడు.

"ఎంత విసుక్కున్నా నాకోసం ఏమైనా చేస్తాడు," ఆమె ముఖం తృప్తిగా వికసించింది. 'రియల్ డార్లింగ్.' అనుకుంది. మళ్ళీ ఆమె ఆలోచన టీ తోటల్లో దినచర్యల మీదికి పోయింది.

పాపం, పనిరోజుల్లో సాయంత్రాలు మురళీని ఇంటి దగ్గరే ఉండనిచ్చి తను హేరాసెస్ బంగళాకో, చెంగప్పాస్ బంగళాకో వెళ్ళకూడదూ! దగ్గరే కూడానూ! అయితే ఈ కొండల్లో డ్రైవ్ చెయ్యడం ఆమెకి సుతరామూ పడదు. కొండంతటిలోనూ ఒక్క ఫర్లాంగు తిన్నని రోడ్డు చూసిన పాపాన పోలేదు. అస్తమానూ రోడ్డుకి గుడ్లప్పగించి తను కూచోలేదు, ప్రమాదవశాత్తూ కారుకి ఏ కొంచెం దెబ్బతగిలినా ఇంక ఆడవాళ్ళ డ్రైవింగ్ మీద మగవాళ్ళు చేసే వేళా కోళాలకి అంతూపంతూ ఉండదు. క్రిందటి శనివారం క్లబ్బుకి తను డ్రైవ్ చేసినప్పుడు, సేత్, క్రిష్ ఎంత

గొడవ చేశాయి. ఇంతకీ తను చేసిందేమీలేదు. రోడ్డుకి కుడివేపున డ్రైవ్ చేసిందట. అందుకని ఎదురుగా వచ్చే లారీ వెళ్ళడానికి చోటులేక పోయింది. ఈ రోడ్డుకి కుడి ఎడమవేపు కూడానా అనుకుంది. ఇంత సన్న రోడ్డు ఏ పక్కనున్నా ఇంకొక కారు వెళ్ళడానికి చోటుండదు. అయినా లారీ డ్రైవరు ఏమీ అనలేదు పాపం. జాగ్రత్తగా రివర్స్ చేసుకుని వెళ్ల డానికి చోటు ఇచ్చాడు. అతనికి లేని బాధ ఈ మొగాళ్ళ కెందుకో?

అయినా, క్లబ్బుకి వెళ్ళడం పెద్ద గొడవ. తమ బంగళానుంచి క్లబ్బుకి పదిహేను మైళ్ళు. పదిహేను మైళ్ళ తాచుపాములాంటి మెలికలు తిరిగిన రోడ్డు. వారానికి మూడుసార్లు మురళీ తనూ క్లబ్బుకి వెళతారు. నిజానికి శనివారాలు, మంగళవారం తప్ప మిగతా రోజులు క్లబ్బు చిన్న బోయినట్టుంటుంది. ఆ రోజుల్లోకూడా చూసిన మొహాల్నే మళ్ళీ చూడ డం చెప్పిన కబుర్లే తిరిగి చెప్పుకోడం వారం వారం ఒకేరకం జీవితం ఒక్కొక్కప్పుడు విసుగు పుట్టినా, ఫంక్షన్ రోజుల్లో క్లబ్ నిండుగా వుంటుంది. నెలకొక సారయినా ఏదో వంకమీద, టాంబోలా ఈవినింగ్ అనో, బ్రిడ్జిగేమ్ అనో, లీస్ట్ డ్రైవ్ అనో, రగ్గర్ వీక్ ఎండ్ అనో, క్లబ్ డే అనో, క్రిస్మస్ ఈవ్ అనో ఏదో పేరుపెట్టి మంచి డాన్సు, డిన్నరూ ఏర్పాటు చేస్తారు. వాటికోసం కాచి పెట్టుకుని కూచుంటుంది లలిత.

ఈ పార్టీల్లో కూడా ఎంతో ఉత్సాహ వంతమైంది ట్రయాంగ్యు లర్ రగ్గర్ వీక్ ఎండ్. వీక్ ఎండ్ అని పేరే కాని నాలుగు రోజులు పార్టీలు జరుగుతాయి. నీలగిరీస్‌నుంచీ, కొచ్చిన్ నుంచీ, మునార్ నుంచీ, టీలోకానికి సంబంధించిన ఆఫీసర్లు, వాళ్ళ భార్యలు, పిల్లలు అంతా వొస్తారు. వచ్చేది రగ్గర్ ఫుట్ బాల్ ఆటలకే కాని ఆటకంటె ముఖ్య మైంది, ప్లాంటర్స్ అందరూ కలసి కులాసాగా కాలం గడపడం. ఆ రోజుల్లో క్లబ్బు కొత్తశోభతో వెలుగుతుంది. కొత్త మొహాలు, కొత్త

తమాషాలు, కొత్త కబుర్లు, కొత్త అనుభవాలు కనీసం మూడేసి నెలలకి ఒకసారయినా బయటి క్లబ్ మెంబర్లని పిలవడమో, ఇక్కడి మెంబర్లు ఆ క్లబ్బులకి వెళ్ళి రెండుమూడు రోజులు గడపడమో చేస్తేకాని అనమ లైన్‌లో సోషల్ లైఫ్ నీరసించి పోతుం దనుకుంది లలిత.

ఈ ఏడాది ట్రయాంగ్యులర్‌కి లలిత ఎదురు చూడడానికి ఇంకొక ప్రత్యేక కారణం వుంది. ఈసారి అతిథిసత్కారానికి ఏర్పడ్డ కమిటీలో లలిత మెంబరుగా ఎన్నిక అయింది. క్లబ్బు అలంకారాలకీ, పార్టీల ఏర్పాటుకీ తను బాధ్యత వహించింది. ప్రతి ఏడాదీ ఈ వీక్ ఎండ్‌కి మూడు డాన్సులుండాలి. ఈ ఏడాది ఒక చిన్న డాన్సుని' ఫ్యాన్సీ డ్రస్ పార్టీగా తను మార్చింది, అమోఘం అన్నారందరూ. తను మురిసిపోయింది. విసుగూ విరామం లేకుండా ఫ్యాన్సీడ్రస్ డాన్సుకి నెలలతరబడి ఏర్పాట్లు చేసింది. చివరికి పార్టీరాత్రి వచ్చింది. ఎంతో ఉత్సాహంగా మురళీ తనూ వెయ్యబోయే వేషాల గురించి గొప్పలు చెప్పుకుంటూ, తగువులాడుకుంటూ, నవ్వుకోవలసిందిపోయి, పరిస్థితులు ఈ విధంగా పరిణమించాయి.

జరిగిందేమీ పెద్ద సంఘటనకాదు. రెండు రోజులక్రితం లలితకి కొంచెం తల నొప్పిగా వుండి, మురళిని ఆస్ప్రో మాత్ర ఒకటి ఇవ్వమని అడిగింది. మాత్ర తన వార్డ్‌రోబ్‌లో మూడో అరలో వుందని తాళాలు అందిచ్చింది. మురళీ, ఆస్ప్రోతోపాటు తెల్లని పొడుగాటి 'కిమో' నో వార్డ్‌రోబ్‌లో నుంచి తీసుకువచ్చాడు.

"గుడ్ సెన్స్, ఈ చెత్త డ్రెస్ ఫ్యాన్సీడ్రెస్ పార్టీ కోసమా డియర్?" అని అడిగాడు.

ఈ పార్టీకోసం ఎంతో శ్రమపడి ఆలోచించి, ఆలోచించి ఈ

జపానీస్ "కీమోనో" తెప్పించుకుంది లలిత. టోకియోలో ఇండియన్ ఎంబెసీలో వున్న తన స్నేహితురాలి ద్వారా "కిమోనో" గైషా యువతుల మేకప్, ఆభరణాలూ, అన్నీ తెప్పించుకుంది. మురళికికూడా ఈ విషయం పొక్కనివ్వలేదు. అది కాకపోయినా, ఫ్యాన్సీ డ్రెస్‌పార్టీకి వెళ్ళబోతూ, వెయ్యబోయే వేషాన్ని ముందే అందరికీ తెలియపర్చడంలో తమాషా ఏముంది ? భార్యాభర్తలు కూడా ఒకరివేషం ఒకళ్ళకి చెప్పుకోరాదను. రాత్రి పన్నెండు గంటల తర్వాత వేషాలు తీసేసినప్పుడు మురళీ వచ్చి "ఆ కిమోనోలో అందాల రాణివి నువ్వా ?" అంటే ! అంత సన్నిహితంగా ఎరిగిన భర్తనే తను వేషంలో ఏమార్చగలిగితే ! "ఈ కిమోనోలో నన్నెవ్వరూ గుర్తుపట్టలేరు" అనుకుంది. అందుకే దాని విషయం అంత గుప్తంగా దాచిపెట్టుకుంది. ఇప్పుడు మురళీ తన రహస్యాన్ని బయటికి లాగాడు. దానిక్కూడా లలిత అంత చింతించలేదు. గత రెండు మాసాలుగా తన పంచప్రాణాలూ అయిన "కిమోనో" చెత్తవేషం అన్నాడు. లలితకి ఒక్కసారిగా చెప్పలేనంత కోపం వచ్చింది.

"నా డ్రెస్ ఎందుకు తీశావ్ ?" అని అరిచింది.

మురళీ ఆశ్చర్యపోయాడు. లలిత ఇలా అరవడం అతనెప్పుడూ వినలేదు.

"పెట్టేస్తానే" అన్నాడు; ఏం అనాలో తోచక. పాపం,తలనొప్పి ఎక్కువగా వుందేమో అనుకున్నాడు.

"ఇంకొకళ్ళ వార్డ్‌రోబ్ కెలకడం ఏం బుద్ధీ ?" అంది లలిత మళ్ళీ. ఎందుకు లలిత కఠినంగా అందో లలితకే అర్థంకాలేదు. వెంటనే నాలుక కరుచుకుంది. కాని ప్రయోజనం లేకపోయింది. మురళీ ఎంతో నొచ్చుకున్నాడు. ఈ రెండురోజులుగా అతను ముభావంగా వున్నాడు.

ఎన్నివిధాల ప్రయత్నించినా లలిత అతన్ని మాటల్లో పెట్టలేకపోయింది. తన ప్రవర్తనకి క్షమాపణ చెప్పడానికి కూడా లేదు. నిజంగా తను మురళీని నొప్పిద్దామనుకోలేదు. తెలియకుండా నోరు జారిపోయింది. పోనీ తను అన్నమాటలైనా అంతచెడ్డవి కాదుగా? అతను ఎందుకు అంతగా నొచ్చుకోవాలి? మురళీ తన డ్రెస్ గురించి ఒక్కమాట కూడా లలితతో చెప్పలేదు. ఆమె అడగనూలేదు. మరి తన డ్రెస్ చూడడానికి అతనికేం అధికారం వుంది? మళ్ళీ అనుకుంది లలిత. అనుకోకుండా "కిమోనో" అతనికి తటస్థపడింది. అతని తప్పేమీకాదు. సరే, మురళీ తప్పేమీ లేదు; అంతా తనదే తప్పు ఒప్పుకుంటుంది. ఇంకా కోపం దేనికి? తను "కిమోనో" వేసుకోవడం మురళీకి ఇష్టంలేదేమో. కాని పార్టీ ఇంత దగ్గరలో పెట్టుకుని ఇంకొక డ్రెస్ సంపాదించడం సాధ్యమా? ఏం చెయ్యాలో తోచలేదు లలితకి. ఏమైనాసరే, ఈ రాత్రి మూతిముడుపులతో గడపకూడదనుకుంది.

* * *

ఏనమలై క్లబ్బు కోలాహలంగా వుంది. నవ్వులూ, గ్లాసుల గలగలా, బెలూన్లు పగులుతున్న గీకారం, బ్యాండుగోలా, ఒకదాంట్లో ఒకటి కలిసిపోయి అనిర్వచనీయమైన ఆహ్లాదం క్లబ్బంతా ఆవరించి వుంది. డాన్సు ఫ్లోర్ మీద అప్పుడే అరడజను జంటలు డాన్సు చేస్తున్నారు. బ్యాండు స్లోట్రాట్ మోగుతూంది. ఒకటి రెండు స్లోనెంబర్ల తరువాత స్థాయి హెచ్చుతుంది. జాజ్ మ్యూజిక్ లోకి దిగుతుంది. ఇంకొంతసేపటికి బ్యాండ్ లీడరు ఇంకా ఉత్సాహవంతమైన నెంబర్లు మొదలు పెడతాడు. తరవాత డాన్సు ఫ్లోర్ మీద వున్న జంటలు ఏది కోరితే అది వాయిస్తాడు. కొన్ని చిలిపిగా వుంటాయి; కొన్ని కొంటెగా వుంటాయి; కొన్ని హెచ్చు స్థాయిలో వుంటాయి. వాటి గమనానికి ఆడవాళ్ళు తట్టుకోలేరు. మగవాళ్ళు నవ్వుతారు. వాళ్ళని తమంత త్వరగా తిప్పడానికి ఈడ్చేటంత పర్యం

తం చేస్తారు. ఇంకొందరు పార్ట్నర్లని గాలిలో ఎత్తి తిప్పుతారు. అదంతా ఒక సరదా. ఆ సరదాలన్నీ ముందు ముందు వున్నాయి. ఇప్పుడు మొదలు కాబట్టి స్లోనెంబరుకి డాన్సు చేస్తున్నారు. కాని అందరు రాబోయే డాన్సులమీద మనసు పెట్టుకునే వున్నారు. కొందరు ఇంకా డాన్సులోకి దిగనేలేదు. డాన్సుఫ్లోర్ పక్కనున్న సోఫాల్లో, కుర్చీల్లో, బల్లలమీద, బార్ దగ్గిర ఎక్కడపడితే అక్కడ కూర్చుని,కొందరు నుంచునివున్నారు. అందరి చేతుల్లోనూ ఒక గ్లాసు పానీయం వుంది. ఇంగ్లీషువాళ్ళంతా విస్కీనో, బీరో, ఏదో ఒక డ్రింక్ తాగుతున్నారు. పర్మిట్ వున్న ఇండి యన్లు కూడా విస్కీ సేవిస్తున్నారు. తక్కినవాళ్ళు ఆరెంజ్ జామ్‌తోనో, టొమాటో జ్యూస్‌తోనో తృప్తిపడుతున్నారు. అక్కడ వున్నవాళ్ళల్లో చాలామంది ఒకరికొకరు పరిచితులే అయినా, ఇప్పుడెవరెవరో తెలుసు కోవటం కష్టం. కొందరి విషయంలో అసంభవమనే చెప్పాలి. అంతా ఫ్యాన్సీడ్రెస్ వేషాల్లో వున్నారు. లంబాడి యువతులు, పంజాబీ పడ తులు, గైషా కాంతలు హవాయీ పిల్లలు, పల్లెపడుచులు, కాడా జాతి మనుష్యులు, రెడ్ ఇండియన్లు, కౌన్లు, గంగిరెద్దుల వాళ్ళు, పాముల వాళ్ళు, టీ తోటల్లో కూలీలు. ఒక పాములవాడు, పంజాబీ యువతితో డాన్సు చేస్తున్నాడు. టీ తోటల్లో కూలీ, లంబాడీ యువతిని తనతో డాన్సు చెయ్యమని అర్థిస్తున్నాడు.

క్లౌన్ డ్రెస్‌తో మురళీ ఒకమూల సోఫాలో కూచున్నాడు. నల్లటి పొడుగాటి గుడ్డ టోపీ, తెల్లని రబ్బరుముక్కూ, మేకప్ చేసుకున్న కళ్ళూ, రంగు రంగుల బట్టలూ కడుపుబ్బ నవ్వు పుట్టించేలా వున్నాయి. కాని ఈ క్లౌన్ డాన్సు ఫ్లోర్‌మీద వికారచేష్టలుచేసి, అందర్నీ నవ్వించి ఆనందంగా గంతులెయ్యడానికి బదులు ఏదో దీర్ఘాలోచనలో మునిగి పోయాడు.

తను గోరంతలు కొండంతలు చేశాడేమో అనిపించింది మురళీకి,

కనీసం డాన్సు మొదలుపెట్టే ముందేనా లలితతో రాజీపడవలసింది. ఈ రాత్రి లలిత సొంతం. ఇప్పటి కోలాహలం ఆమె శ్రమ ఫలితం. ఈ నాడు ఆమెని నొప్పించకుండా వుండవలసింది అనుకున్నాడు. ఇప్పుడు మాత్రం మించిపోయిందేమీ లేదు. లలిత, ఆగైషా "కిమోనో" లో ఎవరితోనో డాన్సు చేస్తూంది. తరవాత డాన్సు తనామెతో చేసి నెమ్మదిగా చెవుల్లో తీయటిమాట లూదుదా మనుకున్నాడు. కాని, చూసిన కొద్దీ లలితమీద అతనికి సానుభూతి సన్నగిల్లింది. జరిగిందానికి తనొక్కడే బాధపడుతున్నట్టుంది. కాని, లలితకి చీమ కుట్టినట్టుకూడా లేదు. హాయిగా తుళ్ళుతూ డాన్సు చేస్తూంది. తనిలా బాధపడుతూ కూచోడం బాగా లేదనిపించింది. తనుకూడా ఈ ఉల్లాసంలో పాల్గొనాలి. చుట్టూ కలయజూశాడు మురళీ. అంతా జంటలు జంటలుగా విడిపోయి కొందరు డాన్సుచేస్తూ, కొందరు కూచుని కబుర్లు చెప్పుకుంటూ, కొందరు బార్ దగ్గరనుంచి నవ్వుతూ మురిసిపోతున్నారు. ఒంటిగా ఒక్క యువతైనా మురళికి కనిపించలేదు. సమయం చూసి అందరిలోనూ అందమైన యువతిని తనతో డాన్సు చెయ్యమని అడగడానికి కాచిపెట్టుకుని కూచున్నాడు. అక్కడ వున్నవాళ్ళలో హవాయ్ యువతి అతన్ని ఆకర్షించింది. ఆమె ఎవరై వుంటుందా అని అతను ఊహించడానికి ప్రయత్నించాడు. చాపతో అల్లిన పరికిణీలో రొమ్ములు కప్పడానికి ప్రయత్నించే చాలీచాలని చుక్కల గుడ్డలో విరబోసి నల్లనికురులతో మెడలో మొయ్యలేనన్ని పూలదండలో హవాయ్ నుంచి అప్పుడే దిగివచ్చినట్టుంది. ఈమె వేషధారణకి ఎంతో కష్టపడి వుండాలి. కనుముక్కు తీరుకూడా హవాయ్ పోలికల్లో తీర్చి దిద్దుకుంది. తనింతకు ముందీమెని చూసివుండడు. కొచ్చిన్‌నుంచో, మొనార్‌నుంచో, నీలగిరినుంచో వచ్చివుంటుంది. ఈ టీ లోకానికి కొత్తఅయి వుంటుంది. ఆవిడ ఎవరయినా తనతో డాన్సు చెయ్యమని అడిగి తీరాలి. పెళ్ళికి ముందురోజులు జ్ఞాపకం వచ్చాయి

మురళికి. ఆ కాలంలో ఇలాగే ఎవరయినా ఆకర్షవంతంగా కపిపిస్తే స్నేహం చేసేవరకూ మనసు ఊరుకునేదికాదు.

కొంత సేపటికి హవాయ్ యువతిని ఒంటిగా చూశాడు. పార్ట్నర్ ఆమెకి డ్రింక్ తేవడానికి వెళ్ళినట్టున్నాడు. మురళీ వెళ్ళి ఆమెని తనతో డాన్సు చెయ్యమని అడిగాడు. ఆమె నిరాకరించలేకపోయింది.

ఆమెని చూస్తున్నకొద్దీ అతని గుండె వేగంగా కొట్టుకోడం ప్రారంభించింది. అంత అందమైన ఆడవాళ్ళుకూడా వుంటారా అనుకున్నాడు. ఆవిడ కళ్ళల్లో నిత్యయౌవనం వెల్లివిరిసింది. ఆవిడ మేని ఛాయలో ప్రకృతి పరవళ్ళు తొక్కింది. ఆవిడ కాళ్ళముందు మార్లీన్ డీట్రిచ్ మిలియన్ డాలర్ లెగ్స్ ఎందుకూ పనికిరావు. ఈవిడ హాలీవుడ్ వెళ్ళితే మార్లీన్ మనోరి, జేన్ మాన్స్ ఫీల్డ్, అనీతా ఎక్‌బర్గ్ వెల వెల బోతారు. తన సౌందర్యాన్ని వెల్లడి చెయ్యడానికే కాబోలు హవాయ్‌వేషం వేసిందీవిడ. అజంతా సుందరుల్ని తలదన్నే ఆమె సోయగం పరవశం చేస్తూంది. మురళికి కవిత్వం పుట్టుకొచ్చింది.

పరస్త్రీ గురించి ఈ విధంగా ఆలోచించడం మంచిదికాదని అతనిలో ఏదో గొంతు అప్పుడప్పుడూ చిన్నగా హెచ్చరిస్తూ వచ్చింది. ఆ తలపు వచ్చినప్పుడల్లా అతను "కిమోనో"లో డాన్స్ చేస్తున్న గైషా వైపు చూశాడు. తనుమాత్రం ఎందుకు ఈరోజు వృధా చెయ్యాలి.

"మీ రెంతబాగా డాన్సు చేస్తారు !"

మురళీ ఆమె నేదోవిధంగా మాటల్లోపెట్టడానికి ప్రయత్నించాడు. హవాయ్ యువతి కొంచెం దూరంగా జరిగి కృతజ్ఞతా పూర్వకంగా నవ్వింది. మురళీ ఆమె వీపుమీద చేత్తో మెత్తగా ఆమెని దగ్గరకి జరుపుకున్నాడు. రెండవ చేతిలోవున్న ఆమె అరిచేతిని మృదువుగా అదిమాడు. ఆ స్పర్శలో అతను తన్మయం పొందాడు.

"ఎంత అందమైన రాత్రి."

ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడతను మళ్ళా.

ఆమె నుదురు అతని పెదవులదాకా వచ్చింది. ముద్దుపెడితే ?

"మీకు మాటలు రావా ?"

అని నవ్వాడు మురళీ.

"ఇంగ్లీషు" అని రాదని సంజ్ఞచేసింది హవాయ్ యువతి.

"ఓహో, ఇంగ్లీషు రాదన్నమాట"

అయితే హవాయ్ యువతిపాత్ర పూర్తిగా అభినయించ దలచుకుందన్నమాట ఈవిడ.

"స్టోసీ అర్థమౌతుందా ?" అడిగాడు.

"ఊఁ!" అందావిడ.

కొంతసేపు ఇద్దరూ మాట్లాడకుండా డాన్సు చేశారు. మళ్ళా మురళీ అన్నాడు.

"బయట వెన్నెల ఎంత అందంగా వుందో"

ఆమె మాట్లాడలేదు.

"తోటలోకి వెళ్ళి చందమామని చూద్దామా ?"

అడిగాడేకాని మురళీ సమాధానానికీ ఎదురు చూడలేదు. ఆవిడ చెయ్యిపట్టుకుని తోటలోకి తీసుకువెళ్ళాడు.

"ఈ వెన్నెల్లో మీ అందానికి దాసుడుకాని మగాడుండడు" అని నవ్వాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది.

"ఇంక మీ వేషం కట్టిపెట్టి మాట్లాడొచ్చు"

అది కట్టుబొట్లకి వ్యతిరేకం అన్నట్టు బుర్ర అడ్డంగా తిప్పిందావిడ.

"ఈ చల్లనిరాత్రి. పున్నమచందురుని కింద కారులో డ్రైవ్‌కి వెళ్ళదామని లేదూ ?"

ఆవిడ భుజంమీద చెయ్యివేసి అడిగాడు మురళీ.

ఆవిడ సమాధానం చెప్పలేదు.

మురళీ హావాయ్ యువతిని తన కారు దగ్గరకి నడిపించాడు.

"మీరెక్కితే నా కారు పావనమై పోతుంది" ముందుసీటు తలుపు తెరుస్తూ ఆవిడని ఎక్కమని చెయ్యి చూపాడు. ఆవిడ మాట్లాడకుండా ఎక్కి కూచుంది. నెమ్మదిగా అతను కారు పోనిస్తున్నాడు. కొంతసేపటికి ఆమె తలుపు చివరనుంచి అతని దగ్గరగా జరిగింది. ఇంకొంతసేపటికి అతని భుజంమీద ఆనింది. మురళీ ఎడంపక్కగా కారు ఆపి, ఆవిడని రెండు చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకోబోయాడు. అతనికి లలిత జ్ఞాపకం వచ్చింది. లలిత, లల్లీ ! లలితకి తను ద్రోహం చేస్తున్నాడు. లలితని వెంటనే చూడాలని బుద్ధి పుట్టింది మురళీకి. హావాయ్ యువతిని చేతుల్లోంచి వదిలేసి కారు స్టార్టు చెయ్యబోయాడు. ఆమె స్విచ్ తాళాలు తీసేసుకుంది.

"రొమాంటిక్ బాచిలర్ లాగా ప్రవర్తించినందుకు క్షమించండి, మిస్...." అతని మాటలు తడబడ్డాయి.

ఒక నిముషం ఆగి మళ్ళీ అన్నాడు.

"మీరు క్షమిస్తానని మాట యివ్వాలి. మీ సౌందర్యం నాకంటే ఎంతో మంచి భర్తని మీకు తెచ్చిపెడుతుంది"

అతను నవ్వడానికి ప్రయత్నించాడు.

"ఇంక తాళాలు ఇవ్వండి పోదాం. నా భార్య క్లబ్బులో నాకోసం వెతుకుతూ వుంటుంది"

"ముద్దుపెడితేకాని యివ్వను" చివరకామె నోరు విప్పింది. లలిత ! ఆమెదే ఆ గొంతు,

"డార్లింగ్...." అత నాశ్చర్యపోయాడు. ఇంకా ఏదో అన బోయాడు. కాని ఆమె పెదవులు మాటల్ని పైకి రానియ్యలేదు.

*　　*　　*

"డార్లింగ్! పెళ్ళయి రెండేళ్ళు కావస్తున్నా నీ బాచిలర్ టెక్నిక్ మరిచిపోలేదు" నవ్వింది లలిత.

మురళీ సిగ్గుతో మాట్లాడలేకపోయాడు.

"మొదటిసారి మనం జింఖానా క్లబ్బులో ఇండిపెండెన్స్ డే డాన్సులో కలిసినప్పుడు సరిగ్గా ఇదే కథ. జ్ఞాపకం వుందా?"

మురళీకి జ్ఞాపకం వుంది. ఇలాగే వెన్నెల రాత్రి. అందమైన యువతి. బయట లాన్‌మీదకి తీసుకువెళ్ళాడు. తరువాత కారులో రైడ్‌కి. మూడునెల్ల తరువాత ఆ యువతిని పెళ్ళాడాడు.

"క్లాన్‌డ్రెస్‌లో నిన్నానవాలు పట్టలేకపోయాను" అంది లలిత. "కాని వెన్నెలా, కారురైడు అంటు మొదలుపెట్టగానే నీ బండారం బయటపడిపోయింది. తరవాత మన కారు దగ్గరికి తీసుకువెళ్ళడంతో వున్న అనుమానం కాస్తాకూడా తీరిపోయింది"

తన బండారం బయట పడిపోయినందుకు మురళీ ఏమీ చింతించ డంలేదు. అతన్ని బాధపెడుతున్న సమస్య గైషా డ్రెస్సులో వుండ వలసిన లలిత హవాయ్ పిల్లగా ఎలా మారిందా అని!

"అదా, 'కిమోనో' నీ కిష్టంలేదని మిసెస్ పేంటర్‌కి యిచ్చి ఆవిడ హవాయ్ రోబ్స్ నేను తీసుకున్నాను"

లలితని చేతుల్లో ఇముడ్చుకున్నాడు మురళి.　　* * *



# వెలుపెళ్ళై

రెట్టింపు బరువు వేసుకుని, లారీ మూలుగుతూ కొండ ఎక్కి ఎస్టేటు పెద్దబజార్లో ఆగింది. పేరుకి పెద్దబజారు కాని ప్రాస్పెక్ట్ టీ ఎస్టేటు పెద్దబజార్లో నాలుగే నాలుగు దుకాణాలు. రెండు కిరాణా దుకాణాలు. ఒక కాఫీ 'క్లబ్బు'. నాలుగో దుకాణంలో ఒక భాగం మంగలి షాపు. రెండో భాగం జోళ్ళ షాపు. దుకాణాల్లో మనుష్యులు గుమ్మం లోనుంచి బయటికి తొంగుచూసి, "సామాన్లువచ్చాయ్" అన్నారు. డ్రైవరు దిగి గాలికి లారీ ఇంజను చల్లారడానికి బోనెట్ తెరిచిపెట్టాడు.

రెండో పక్క గోపాల చెట్టియార్ కులాసాగా నవ్వుతూ కిందికిదూకాడు. అప్పటికప్పుడే రోడ్డు ప్రక్కల కబుర్లు చెప్పుకుంటున్న పనిలేని కుర్రాళ్లు అయిదారుగురు లారీ చుట్టూ మూగారు.

"ఏరా శనిగ్రహాల్లారా, అప్పుడే నేనొచ్చినట్లు పసికట్టేశారా?" అని గట్టిగా నవ్వాడు గోపాల చెట్టియార్. లాల్చీ జేబులో నుంచి ఒక కట్టబీడీలు పైకితీసి తలో నాలుగూ పంచిపెట్టాడు.

"అగ్గిపెట్టెకూడా ఇప్పించండి" అనువుగా అడిగాడు ఒక కుర్రాడు.

"ఓరి కుక్కా, బీడీ ఇచ్చింది కాకుండా అగ్గిపెట్టెకూడా తెమ్మంటావా? తీసుకో, ఫో!"

అగ్గిపెట్టెతీసి కుర్రాడిచేతిలో పెట్టాడు చెట్టియార్. చెట్టియార్ తిట్లలో ఆగ్రహం కాని, అసహ్యం కాని లేదు. అతను వాళ్ళని పలకరించే తీరే అంత.

"మా సోమరిపోతు వెధవల్ని చూడండి" లారీలో ఎత్తుగా వేసిన సామానులమీద నిశ్చింతగా నిద్రపోతున్న ఇద్దరి మనుషుల్ని చూపిస్తూ అన్నాడు చెట్టియార్. "ఒరే కడలేశా, వాళ్ళని కొంచెం లేపరా బాబూ! మిమ్మల్ని చూసి బుద్ధయినా తెచ్చుకోమంటాను"

కొందరు కుర్రాళ్ళు వర్షంపడితే సామాన్లు తడవకుండా కప్పిన టార్పాలిన్ తాళ్ళని విప్పడం మొదలుపెట్టారు. ఒకళ్ళిద్దరు "ఇరులప్పా. కరుప్పయ్యా" అని నిద్రపోతున్న వాళ్ళని లేపడానికి ప్రయత్నించారు. గోపాలచెట్టియార్ రేగిన బట్టతలని చేత్తో సరిచేసుకుని, తెల్లటి లాల్చీ మీద జరీ కంఖువాని తడిమి చూసుకుని, సిల్కు అడ్డపంచె జారిపోకుండా ఇంకొకసారి బిగదీసి పట్టుకుని మందహాసం చేస్తూ. వేలుపిళ్లై దుకాణానికి దారి తీశాడు,

"నమస్కారం షావుకారుగారూ !"

రోడ్డు కవతలి వైపునవున్న టీ 'క్లబ్బు'లో నుంచి మునుసామి గౌండర్ చేతులు జోడించాడు.

"ఏం గిరాకీ, గౌండర్, అంతచేటు అరుస్తున్నావ్, టీ నీళ్ళు పోస్తావా ?"

తమలపాకులు నమిలి నమిలి పారగట్టిన పళ్ళు ఎర్రటి పెదాల్లో నుంచి చూపిస్తూ వేళాకోళం చేశాడు చెట్టియార్. ఏదో విశేషం వుండా లనుకుని రోడ్డు కిటుపక్కగా వేళ్ళాడు.

"ఏమయ్యోవ్, పెద్దమనిషీ, ఈసారికూడా బాకీ వాయిదా పెడదా మని ఎత్తు వేస్తున్నావేమో, కుదరదు" చెట్టియార్‌కి హాస్యధోరణిలో మాట్లాడడం అంటే యిష్టం. నిజానికి అతను బాకీగురించి ఆలోచించ డమే లేదు. చెట్టియార్ ప్రతి శుక్రవారం అపరాలూ, కాయగూరలూ, చిల్లరసామాసూ లారీలో తీసుకువచ్చి, ఏళుమలై కొండల ఎస్టేట్ల బజా ర్లలో చిల్లర షావుకార్లకి అమ్ముతూ వుంటాడు. సరుకులకి వారం వారం ధర వసూలుచెయ్యడం పద్ధతిలేదు. అడపా తడపా ఎప్పుడు వీలుగా వుంటే అప్పుడు పుచ్చుకోవడమే. బాకీల్లో కొంతభాగం రాకపోయినా నష్టం లేకుండా ధరలు నిర్ణయించుకు అమ్ముతుంటాడు.

"ఎంతమాట సెలవిచ్చారూ, ఈ వారం ఇచ్చేస్తానని చెప్పిం తరవాత మాట తప్పడానికి వీలవుతుందా ?" అన్నాడు గౌండర్.

"ఇదెప్పటినుంచీ మొదలుపెట్టేవ్ గౌండరయ్యా ? అయితే నువ్వు ఆడి తప్పవన్నమాట" గౌండర్ వీపు చరిచాడు చెట్టియార్. అతని వేళ్ళ ఉంగరాల దొంతర్లు గౌండర్ ఎముకలకి గుచ్చుకున్నాయి. వీపు తడుముకుంటూ గౌండర్ అన్నాడు.

"కొంచెం టీ తాగిపోతారేమోనని పిలిచాను"

ఈసారి చెట్టియార్‌కి నిజంగా ఆశ్చర్యం వేసింది. ఈ పిసినారి గౌండర్ టీ తాగమని అడగడమేమిటి, బాకీ అడిగీ అడక్కుండానే చెల్లించేస్తా ననడమేమిటి! తమా షాకి టీనీళ్ళు పోస్తావా అన్నాడు కాని నిజంగా తను గౌండర్ దుకాణంలో తాగుదామనికాదు. భోజన పానాలు తనెప్పుడూ వేలుపిళ్లై ఇంట్లోనే చేస్తాడని గౌండర్‌కి తెలుసుకదా.

"అబ్బే, ఎందుకూ శ్రమ. నాకోసం వేలుపిళ్లై చేసి వుంచుతాడుగా" అన్నాడు చెట్టియార్.

"శ్రమేమిటి, తమలాంటివారికి ఆతిథ్యం ఇవ్వడం కుదరాలేకాని. తమ దయ వుంటే ఇకనుంచి సౌకర్యాలన్నీ నేనే చూస్తాను" కొంచెం సేపు ఆగి గౌండర్ మళ్ళీ అన్నాడు.

"సెందామరై చచ్చిపోయిందిగా!"

"ఆఁ!" తనచెవులు తనే నమ్మలేకపోయాడు చెట్టియార్.

"మొన్న శుక్రవారం నే వచ్చినప్పుడు బాగానే వుంది. ఇంతలోకే యింత అన్యాయమా?"

"తమరు వెళ్ళిపోయిన మర్నాడు హఠాత్తుగా పోయింది.

"నే వెళ్ళతా" లేచాడు చెట్టియార్.

"వేలుపిళ్లై యింట్లో లేడు" అన్నాడు గౌండర్.

"ఎక్కడున్నాడు?"

"పోయిన అయిదురోజులుగా ఆ వినాయకుడి గుడిదగ్గిర ఏడుస్తూ పడివున్నాడు. పాపం, సెందామరై చచ్చిపోడం పెద్దదెబ్బ"

గౌండర్ కులాసాకి కారణం ఇప్పుడు చెట్టియార్‌కి అర్థమైంది. ఆ బజార్లో వేలుపిళ్లైకీ. గౌండర్‌కీ పోటీ. ఇద్దరికీ కిరాణా దుకాణం వుంది. గౌండర్ టీ 'క్లబ్బు' కూడా నడుపుతున్నాడు. అయినా అమ్మకంలో వేలుపిళ్లైదే పైచెయ్యి. వేలుపిళ్లై నమ్మకస్థుడనీ. న్యాయస్థు

డనీ, మాటమర్యాద కలవాడనీ పేరు. గత మూడు సంవత్సరాలుగా చెట్టియార్ స్నేహం కలిశాక వ్యాపారం బాగా వృద్ధికూడా అయింది. అతని పచ్చదనం గౌండర్‌కి ఎప్పుడూ కన్నెరళ్ళగా వుంటూనే వచ్చింది. ఇప్పుడు సెందామరై పోయి వేలుపిళ్లై ఏడుస్తుంటే పోటీ లేకుండా వ్యాపారం వృద్ధి చేసుకోడానికి కలలు కంటున్నట్లున్నాడు గౌండర్.

చెట్టియార్ వేలుపిళ్లై దుకాణంలో అడుగు పెట్టేసరికి పని కుర్రాళ్ళూ, నలుగురైదుగురు ఎస్టేటు కూలీలూ కలిసి పచ్చీసు ఆడు కుంటున్నారు. చెట్టియార్‌ని చూసి లేచి నుంచున్నారు.

"దుకాణం తెరవనైనాలేదే!" అడిగాడు చెట్టియార్.

"యజమాని తెరవొద్దన్నారు" అన్నాడు పనికుర్రాడు.

చెట్టియార్ వేలుపిళ్లై ఇంట్లోకివెళ్ళి లోపలి ద్వారంలోనుంచి కొట్టులో ప్రవేశించాడు. కాబేజ్, కాలీఫ్లవర్, పీస్, బంగాళాదుంపలూ, ములక్కాడలూ, తను పోయిన వారం ఇచ్చిన కాయగూరలన్నీ ఎండి పోతూ పడివున్నాయి. విప్పిన మూటల్లో పప్పూ, బియ్యం ఎలుకలు చెల్లా చెదరుచేశాయి. చెట్టియార్‌కి వేలుపిళ్లైని తలుచుకుంటే జాలివేసింది. పనికుర్రాళ్ళమీద కోపం వచ్చింది. విసురుగా బయటకివచ్చి అరిచాడు.

"యజమాని కష్టాల్లోవుండి కొట్టు తెరవొద్దంటే గంగిరెద్దుల్లాగా తల ఊఁకొట్టి పచ్చీసు ఆడుకొంటున్నారన్నమాట. ఈ కాయగూరలన్నీ ఎలా ఎందుకూ పనికిరాకుండా పోయాయో చూడండి" ఈపాటికి చెట్టి యార్ రాక విని పంచాయితీ పెద్దలు కోళందవేలూ, ఆశీర్వాదం, కొండాయి, ఇంకా ఎస్టేటు కూలీల్లో పెద్దా చిన్నా వేలుపిళ్లై దుకాణం దగ్గిర గుమిగూడారు.

"కుర్రాళ్ళ తప్పునేము. వేలుపిళ్లే నసేమిరా కొట్టుతియ్యనని పట్టుబట్టి కూసున్నాడు" అన్నాడు కొండాయి.

"ఇంత గంజినీల్లయినా పొట్టలో ఓసుకోకుండా గుడికాడ పడి గాపులు కాత్తన్నాడు. సత్తాడో ఏమో!" అన్నాడు కోళందవేలు.

"నిజంగానా ?" అడిగాడు చెట్టియార్.

"నిజంకాపోతే అబద్ధమేటి? ఎవురేనా కూడు అట్టికెత్తే సేత్తాడు. ఇంత టీ తాగి నెట్టుకొత్తన్నాడు"

"వినాయకుడి గుడి ఎక్కడో చూపించండి" అన్నాడు గోపాల చెట్టియార్.

అందరూ గుడివైపు బయల్దేరారు.

"ఈ గుడివేపే కానేకాదూ. ఏలుపిల్లేని దనలచ్మి వొరించింది" అన్నాడు ఎన్నాసిముత్తు.

"గుడేనేటి, సెందామరై అదుట్టం తేలేదేటి ?" అన్నాడు కొండాయ్.

గోపాలచెట్టియార్ విని ఊరుకున్నాడు. మూడు నాలుగేళ్ళగా అతను ఆనమలై ఎస్టేట్లలో వ్యాపారం చేస్తున్నాడు. గత మూడేళ్ళ లోనూ అతనికి వేలుపిళ్లైతో మంచి స్నేహం కుదిరింది. తనూ వేలుపిళ్లై మొదటిసారి కలుసుకోడం, వేలుపిళ్లై సెందామరైని తీసుకు రావడం నాలుగయిదు నెలల తేడాలో జరిగాయి. సెందామరైకి పూర్వం వేలుపిళ్లైకి ఇంకొక పెళ్ళాం వుండేదట. వేలుపిళ్లై ఎన్నోసార్లు చెప్పిన పాతకథంతా చెట్టియార్ తలలో మెదిలింది.

వేలుపిళ్లై పది పన్నెండేళ్ళ క్రితంవరకూ పోర్రిస్పెక్టు టీ ఎస్టేటులో కూలీగా పనిచేస్తూ వుండేవాడు. ఒకసారి ఎస్టేటు కండక్టరుతో మాటా మాటా వచ్చి "నువ్వెంత, నీపవెంత" అని పని మానేసి వ్యాపారంలో దిగేడు. వ్యాపారం అంటే వందలమీదా, వేలమీదాకాదు. కొండల కిందవున్న పొల్లాచీ సంతలో లక్ష్మివారాలు అమ్ముడైపోగా మిగిలిన

ఉల్లిపాయ, చింతపండు, కాయగూరలూ కొని ప్రోప్రైట్టు ఎస్టేటు కూలీలకి లాభాలకి అమ్మేవాడు. అతనంటే కిట్టని కండక్టరుకి ఇది కంటకంగా వుండేది. అనధికారంగా లైసెన్సు లేకుండా దుకాణం పెట్టినందుకు అధికారులకి అప్పజెప్పుతానని బెదరించాడు. కాని. ఇప్పుడున్న దుకాణం జాడ కండక్టరుకు చూచాయగా తెలియగానే మాయమైపోయేది. అంగడి చిన్న చేతిసంచీలో ఇరుక్కుపోయేది. తిరిగి కండక్టరు వెళ్ళిపోగానే దుకాణం తయారు. ఇలా సాగుతున్నా అతని కిది నచ్చలేదు. అతనిమీద అభిమానం వున్న కొందరు కూలీలు ఎస్టేటు మేనేజరు దగ్గరకి పోయి ఇంకొక చిల్లర దుకాణం కావాలని విన్నపం చేసుకొన్నారు. వేలుపిళ్లైకి ఆ దుకాణం నడపడానికి అనుమతి ఇమ్మనికూడా కోరుకున్నారు. ఫలితంగా వేలుపిళ్లై మునుసామి గ్రాండర్‌కి పోటీగా పెద్దబజార్లో అంగడి ప్రారంభించాడు.

ఇప్పటి ఉధృతం లేకపోయిందేమోకాని, వేలుపిళ్లై వ్యాపారం అప్పుడుకూడా లాభసాటిగా లేకపోలేదు. ఏడాది తిరగకుండా అతను పెళ్ళి చేసుకున్నాడు. తరువాత మూడు నాలుగేళ్ళల్లో భార్యకి మెడనిండా బంగారపు వస్తువులు చేయించాడు. కంచి చీరలు కొన్నాడు. అద్దాలు అతికిన పందిరి పట్టిమంచం కొన్నాడు. రెండుమూడు కుర్చీలు చేయించాడు. వేలుపిళ్లైకి సిరి అబ్బడంలో తనపేరు చిరస్థాయి చేసుకోవాలని కోరికపుట్టింది. పేరు శాశ్వతంగా నిలిచే దానం ఏదైనా చెయ్యడానికి నిర్ణయం చేసుకుని ఎస్టేటు కూలీలతో సంప్రదించాడు. వినాయకుని గుడి కావాలని అడిగారు కూలీలు. 'సరే' అన్నాడు వేలుపిళ్లై. ఇలా డబ్బు దుబారా చెయ్యడం వేలుపిళ్లై భార్య పవనాళ్‌కి నచ్చలేదు. పవనాళ్ ఇష్టంలేందే వేలుపిళ్లై ఏపనీ చెయ్యడానికి వీల్లేదు. అంగడిమీద వచ్చే ఆదాయం ప్రతి సాయంత్రం పవనాళ్ లెక్కలుకట్టి తీసుకుని దాచేది. ఇంటిపెత్తనం అంతా ఆవిడదే. అసలు ఆవిడ వేలుపిళ్లై తిండి బట్టా

కూడా సరిగ్గా చూడదని వదంతి. అతను గడించిందంతా నగలకీ, బట్ట లకీ, పుట్టింటివాళ్ళకీ ఖర్చు పెట్టేదట. దీంట్లో ఎంత నిజంవుందో దేవు డికి ఎరుక ! ఒక్కమాట మాత్రం నిజం. వేలుపిళ్లై, పవనాళ్ ఎప్పుడూ కీచులాడుకొంటూ వుండేవారు. ఒకటి రెండుసార్లు పవనాళ్ మొగుడి మీద కోపగించి మూటా ముల్లే సర్దుకుని పుట్టింటికి పారిపోయింది. తిరిగి రెండు మూడు వారాల తరువాత వచ్చినప్పుడు వేలుపిళ్లై ఏలుకో నని భీష్మించి కూచున్నాడు. అప్పుడు ఎస్టేటు కూలీలు పంచాయతీ ఏర్పాటుచేసి, పవనాళ్ని మందలించి ఇద్దరికీ రాజీ కుదిర్చారు.

పవనాళ్తో వేలుపిళ్లై గుడి విషయం కదిపినప్పుడు ఆవిడ విరు చుకుపడింది.

"నా ఇల్లు గుల్ల చెయ్యడానికి చూస్తున్నావు" అంది. "నా పిల్లలు నాశనమైపోతే చూసి ఆనందించాలనుకొంటున్నావు" అని అరిచింది. అప్పటినుంచీ కొన్నాళ్ళు అతనికి వేళకి స్నానానికి నీళ్ళుపెట్టడం, భోజన సదుపాయం చూడడం మానేసింది. ఇంకొక విషయం ఏదైనా అయితే వేలుపిళ్లై పట్టు విడిచేసేవాడు. ఇది దేవుడుతోపని. వినాయకుడి గుడి కట్టిద్దామనుకున్న తరువాత తిరుగులేదు. తప్పు లెక్కలు చూపించీ, కొందరు ఖాతాదారులతో లోపాయకారీగా ఒడంబడికలు చేసుకునీ, తన అవసరాలు తగ్గించుకొనీ, ఆదాచేసిన డబ్బుతో గుడి కట్టడం ప్రారం భం చేశాడు. చాలా కాలంవరకూ ఈ విషయం పవనాళ్ చెవిని పడ నియ్యలేదు. చివరకి ఆవిడకి తెలిసినప్పుడు ప్రళయం బద్దలయింది. ఒక వారం రోజులు వేలుపిళ్లై టీ 'క్లబ్బు'తో ఆకలి దప్పికలు తీర్చు కున్నాడు. ఆనాటినుంచీ వేలుపిళ్లై చేతిలో డబ్బు లాగడం మానేసింది. అప్పటికి గుడి ఉపరిభాగం తయారైవుంది. నిజానికి దాన్ని గుడి అన

డానికి వీల్లేదు. అసలు వేలుపిళ్లై సంకల్పం కూడా వినాయకుడి విగ్రహాన్ని ప్రతిష్ఠించి, దాన్ని ఎండావానల నుంచి కాపాడేందుకు చిన్న గోపురం కడదామని. అందుకు అనుగుణంగా ముందుగోపురం లేచింది. మధురైనుంచి నలుగురు శిల్పుల్ని పిలిపించి పని పూర్తిచేయించాడు వేలుపిళ్లై. చిన్నకొండమీద వంద అడుగులు చదునుచేసి ఆరడుగల చదరంలో గోపురాన్ని లేవదీశారు. మూడడుగుల ఎత్తున అరుగు; దాని మీద నాలుగు రాతి స్తంభాలు; ఆ స్తంభాలమీద చిన్నగోపురం. గోపురం మీద రంగురంగుల విగ్రహాలు; శివుడు, వినాయకుడు, నంది, మూషికం, ఏనుగులు. ఆ విగ్రహాలకింద పెద్ద అక్షరాలతో "వేలుపిళ్లై ధర్మం" అని చెక్కడం. దాని పక్కన దానంచేసిన సంవత్సరం, తేదీ. రోజూ నాలుగయిదు సార్లు వెళ్ళి తనపేరు చూసుకుని మురిసిపోయేవాడు వేలుపిళ్లై. ఇంతవరకూ వచ్చిన తరువాత విగ్రహం ప్రతిష్ఠించడానికి డబ్బు లేకపోవడం అతన్ని కుంగదీసింది.

విగ్రహం ప్రతిష్ఠించడం అంటే మాటలతో పనికాదు అన్నారు అతను సంప్రదించిన బ్రాహ్మణులు. వినాయకుని ప్రతిష్ఠ శాంతి కోరుతుంది. నాలుగయిదువేల రూపాయలైనా కావాలి. తనదగ్గిర పట్టుమని పది రూపాయలైనా లేవు. విచారంతో కృశించిపోతున్న వేలుపిళ్లైకి ఎవరో ఒక ఉపాయం చెప్పారు. ఒకసారి ప్రతిష్ఠించిన విగ్రహాన్ని దొంగిలించి తీసుకువచ్చినట్టయితే శాంతి అవసరంలేదు. అందరి మంచి కోసం చేసినపని దొంగతనంలోకి లెక్కకి రాదు. పైగా, గర్భగుడిలో విగ్రహాన్నిదొంగిలించడంలేదు. ఏ పెద్దశివాలయంలోనో బయట నిరాదరణగా పడివున్న విగ్రహాన్నే ఏరుకుంటున్నాడు. గుండె దిట్టపరుచుకుని కొన్నత్తూరు శివాలయంఆవరణలో వినాయకవిగ్రహాన్ని తీసుకురావడానికి నిశ్చయం చేసుకున్నాడు. దానికి మాత్రం తక్కువ అవుతుందా? ముగ్గురు నలుగురు తోడులేకుండా రాత్రిపూట విగ్రహం సంగ్రహం

చడం వీలయే పనికాదు. శాంతి అక్కర్లేకపోయినా సాదారణంగా, శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించడానికీ, బీదా సాదాకి అన్నదానం చెయ్యడానికీ వెయ్యా పదిహేనువందలకి తక్కువగాదు. తల ఆలోచనలతో బద్దలు చేసుకున్నాడు వేలుపిళ్లై తనకున్న ఆస్తిఅంతా పెళ్ళాం మెళ్ళోవుంది. నగలు తాకట్టుపెట్టి ఈ సమయంలో ఆదుకుంటే నెమ్మదిగా విడదీసుకో వచ్చు. పవనాళ్ ఒప్పుకుంటుందనే ఆశ లేదు. శుభకార్యం కోసం చిన్న అబద్ధం ఆడడంలో తప్పులేదని సమాధానపడ్డాడు వేలుపిళ్లై. మంచి పొలం అమ్మకానికి వుందనీ, కొనడానికి అప్పుగా రెండువేలు అవసరంగా కావాలనీ పవనాళ్ తండ్రి రాసినట్టు జాబురాసి పోస్టు చేశాడు. మర్నాడు పవనాళ్ ఉత్తరం చదివి వినిపించుకున్నప్పుడు, అప్పు దగ్గిర ఆపి కోపం అభినయించాడు. ఆనాడూ మర్నాడూ పవనాళ్ అతనికి తియ్యటి మాటలు చెప్పేవది. అతను స్నానం చేసినప్పుడు వీపు రుద్దింది. తమలపాకు-కి సున్నం రాసి ఈనెలు తీసి ఇచ్చింది. ఎన్నోవిధాలుగా అతన్ని సుముఖుణ్ణి చేసుకోడానికి ప్రయత్నించింది. బెట్టుచేసి చివరికి నగలు తాకట్టు పెట్టడానికి సమ్మతించాడు వేలుపిళ్లై.

నగలు చేత బట్టుకుని ముగ్గురు నమ్మిన స్నేహితులతో వేలుపిళ్లై కొన్నత్తూరు ప్రయాణం అయ్యాడు, దారిలో పొల్లాచీలోని మార్వాడీ దగ్గిర నగలు తాకట్టుపెట్టి, డబ్బు అడ్డపంచె జారిపోకుండా పెట్టుకున్న వెడల్పాటి తోలుబెల్టుకి వున్న రహస్యపు అరలో దాచుకున్నాడు. మళ్ళీ నలుగురూ ప్రయాణం సాగించారు. కొన్నత్తూరు చేరుకునేసరికి రాత్రి పదకొండుగంట లయింది. సరాసరి శివాలయానికి పోయి వినాయకుని విగ్రహాన్ని పెకలించి భద్రపరుచుకుని బయటపడ్డారు. అంతా సవ్యంగా జరిగిపోయిందని నలుగురూ సంతోషంగా కబుర్లాడుకుంటున్న సమయానికి తమ పక్కనుంచి ఎవరో దూసుకుపోయారు. వెనక కొంచెం దూరంలో కొందరు "దొంగ, దొంగ, పట్టుకోండి" అని అరుస్తూ

తరుముతున్నారు. వేలుపిళ్లైకీ, స్నేహితులకి పరిస్థితి అర్థమైంది. తాము కూడా పలాయనం చిత్తగించడం ఉత్తమం అనిపించింది. స్నేహితులు ముగ్గురూ యౌవనంలో వున్నవాళ్ళు, బాగా పరిగెత్తగలిగారు. వేలుపిళ్లైకి యాభై దాటి దేహదార్ఢ్యం సన్నగిల్లింది. దానికితోడు చేతిలో బలువైన వినాయకుడి విగ్రహం. కొన్ని గజాలు వెళ్ళేలోపలే అతనికి ఆయాసం వచ్చేసింది. పరుగు మానేసి ఇటూ అటూ పరికించి చూశాడు. వీధి మురికి కాలవకి అవతలవైపున గాలికి ఎగిరిపోయేలావున్న గుడిసె చూచాయగా కనిపించింది. ఏమయితే అయిందని దాంట్లో దూరాడు. గుడిసె లోపలికి పోలేదు. తరుముకువస్తున్న జనం గుడిసె దాటిపోయిన కొంతసేపటికి కాని అతను ఏమి చెయ్యటానికీ ధైర్యం చెయ్యలేదు. నెమ్మదిగా బీడీ అంటించి, అగ్గిపుల్ల వెలుగులో గుడిసెని పరిశీలించడానికి ఉపక్రమించాడు. ఏమీ అంతుపట్టకుండానే అగ్గిపుల్ల ఆరిపోయింది. బీడీ ఎగపీల్చి ఆ కాంతిలో ఆకారాలు గుర్తుపట్టడానికి ప్రయత్నించాడు. కొంతసేపటికి విసుగుపుట్టి గుడిసెలో అటూ ఇటూ తిరగడం ప్రారంభించాడు. గుడిసె మూలనుంచి ఆడగొంతు అడిగింది.

"ఎవరు నువ్వు ?"

ఆ గొంతులో తొందరకాని, భయంకాని లేవు. వేలుపిళ్లైకి కొంత ధైర్యం వచ్చింది.

"ష్, మాట్లాడకు" అన్నాడు.

ఈసారి అగ్గిపుల్ల వెలిగించి "దీపం ఎక్కడ ?" అని అడిగాడు.

"దీపం లేదు" అంది గొంతు.

వెలిగించిన అగ్గిపుల్ల ఆమె మొహం దగ్గిరవుంచి అడిగాడు.

"నువ్వొక్కదానివేనా వుండేది ?"

"అవును"

అగ్గిపుల్ల ఆరిపోయింది. వేలుపిళ్లై ఇంకొకటి వెలిగించలేదు. చీకట్లో తన కథ చెప్పేడు. రాత్రికి ఒకమూల పడుకోనిస్తే మర్నాడు వెళ్ళిపోతా నన్నాడు.

"ఒకమూల పడుకొని వుండడు. వెచ్చగా, సెందామరై కౌగిట్లో బిగదీసుకుని గడిపివుంటాడు. ముసలాడు సరిగ్గా చెప్పడు"

గోపాల చెట్టియార్‌కి ఇంత విచార సమయంలో కూడా నవ్వొచ్చింది. తన చుట్టుపక్కల అంతా వేలుపిళ్లై గురించీ, సెందామరై గురించీ ఏవేవో మాట్లాడుతున్నారు. అతను మాత్రం ఏమీ వినడంలేదు. మళ్ళీ అతని ఆలోచనలు వేలుపిళ్లై ఎన్నోసార్లు తనకి చెప్పిన స్వీయ కథ మీదికి మళ్ళాయి.

సెందామరైని తీసుకువచ్చి ఇంట్లో పెట్టుకునే ధైర్యం లేకపోయింది వేలుపిళ్లైకి. పొల్లాచీలో చిన్న యిల్లు కుదిర్చి వుంచాడు. రెండు రోజులకీ, మూడురోజులకీ ఏదో సాకుమీద పొల్లాచీ వెళ్తూ వుండేవాడు. ఒక్కొక్కప్పుడు కొండకిందకు పోతున్న ఏ లారీ డ్రైవరు చేతిలోనో రూపాయో అర్థో పెట్టి రెండో కంటికి తెలియకుండా పోయి వచ్చేవాడు. ఇది క్షేమంకాదని అతనికి తెలుసును.కాని దానిగురించి ఆలోచించి బుర్ర పాడుచేసుకోలేదు. జరిగినన్నాళ్ళయినా సుఖం అనుభవించాలి గదా!

వేలుపిళ్లై మోసంచేసి నగలు చేజిక్కించుకున్నాడని తెలుసుకోడానికి పవనాళ్‌కి ఎక్కువకాలం పట్టలేదు. ఈసారి అతనికి వంట చెయ్యడం మానెయ్యడమే కాకుండా ఏడుపులూ, పెడబొబ్బలూ మొదలు పెట్టింది. దారినపోయే వారందరితోనూ ఫిర్యాదు చేసింది. చుట్టుపక్కల వాళ్ళు చూడకుండా మొగుణ్ణి అడపా తడపా చీపురుతో మొత్తింది. ఇది జరిగిన రోజునే వేలుపిళ్లై పరారి అయిపోయేడన్నారు. నిజానికి అతను సెందామరైతో పొల్లాచీలో కులుకుతూ కూచున్నాడు. వారం రోజుల

తరువాత తిరిగి ఎస్టేటుకి వచ్చినప్పుడు పవనాళ్ ఇంట్లోలేదు. అంగడిలో మిగిలిన కాస్తా కూస్తా మూటగట్టుకుని పుట్టింటికి పోయింది. వేలుపిళ్లైకి నెత్తినుంచి పెద్ద బరువు దింపినట్టయింది. "ఈ ముండ తిరిగి రాకపోతే బాగుణ్ణు" అనుకున్నాడు. ఆ తలపులో సౌఖ్యాన్ని అనుభవించకుండానే దుకాణం పరిస్థితి అతని కళ్ళముందు నిలిచింది. అమ్మడానికి కొట్లో ఒక్క సామానులేదు. పందిరి పట్టిమంచం మినహాయించి ఇంట్లో ఒక్క వస్తువులేదు.

"ఆ శుక్రవారం నేను తటస్థపడకపోతే ఏం చేసేవాడో" అని పించింది గోపాల చెట్టియార్‌కి ఇప్పుడు. పైన మబ్బులు కమ్ముకు వస్తు న్నాయి. ఉండుండి చిన్న తుంపరకూడా పడుతున్నట్టుంది. చెట్టియార్ నడక వేగం హెచ్చించాడు.

"గుడి ఇంకా ఎంతదూరం ?" అన్నాడు.

"ఇదో ఒచ్చేసేం. ఆ మలుపు తప్పితే అగుపిస్తది" అన్నాడు కొండాయి.

చెట్టియార్ తిరిగి వేలుపిళ్లై గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు.

ఆ శుక్రవారం తను బాకీలు వసూలు చేసుకోడానికి వాల్‌పాకై వెళ్ళుతున్నాడు. లారీ రేడియేటర్‌లో నీళ్ళు మరుగుతున్నట్టనిపించి, మార్చుద్దామని దారిలో ప్రోస్పెక్ట్ టీ ఎస్టేటు బజారులో ఆగాడు. అదే తను వేలుపిళ్లైని మొదటిసారి కలవడం. వేలుపిళ్లై తనూ బీడీలు వెలి గించి కొండరోడ్డు పక్కన తూముమీద కూర్చుని పాత స్నేహితుల్లాగ గంటల తరబడి కబుర్లాడుకోడం చెట్టియార్‌కి బాగా జ్ఞాపకం వుంది. తన కథంతా చెప్పాడు వేలుపిళ్లై. చెట్టియార్‌కి జాలిపుట్టింది. వేలుపిళ్లైమీద అభిమానం కలిగింది. నమ్మకం కుదిరింది.

"మంచి ముండాకొడుకు" అనుకున్నాడు చెట్టియార్, బట్టతల మీదపడ్డ వర్షపు చినుకుని ఎడంచేత్తో తుడుచుకుంటూ.

"పిళ్లైకి సామాను అప్పిచ్చి వ్యాపారం నిలబెట్టడంతో స్నేహం మొదలయినా, సెందామరై వల్లేకదా ఇన్నిసార్లు నేను కొండమీద కొచ్చేదీ"

పాతజ్ఞాపకాలు ఇంకా అతన్ని వెంటాడాయి.

సెందామరైని కలవకముందు చెట్టియార్ అప్పుడప్పుడూ బాకీలు వసూలు చేసుకోడానికి కొండమీదికి వచ్చినప్పుడు పిళ్లై ఇంట్లో భోజనం చేసి పోతూండేవాడే కాని, ఇప్పటిలాగ ప్రతివారం సామాన్లతో తనూ ప్రత్యక్షమయ్యేవాడు కాదు.

"దిట్టమైనముండ, అందర్నీ మంచిచేసుకుంది"

సెందామరై గురించి ఆలోచించకుండా వుండలేకపోయాడు చెట్టియార్,

సెందామరై దుకాణంమీద నవ్వులొలకబోస్తూ కూర్చోడం, చిన్నా పెద్దా వేళాకోళాలాడుతూ గంటలతరబడి కొట్టుచుట్టూ మూగి వుండడం, ముసలితొక్కులు సహితం సెందామరై చేతివేళ్ళని తాకుతూ బీడీలు అంది పుచ్చుకోడానికి అక్కర్లేకపోయినా కొనుక్కోడం అంతా అతని కళ్ళకు కట్టినట్టయింది.

"నిజంగా దీని తెలివితేటలవల్ల నెగ్గుకొచ్చింది కాని పవనాళ్ అలా విరుచుకు పడినందుకు ఇంకొకతె తట్టుకోగలదా ?" అనుకున్నాడు.

సామానుతో పుట్టింటికి పోయింతరువాత పవనాళ్ యధాప్రకారం రెండువారాలకో, మూడు వారాలకో తిరిగి వేలుపిళ్లై దగ్గిరికి వచ్చెయ్యలేదు. రెండుమూడు నెలలకికూడా రాలేదు ధైర్యంచేసి వేలుపిళ్లై సెందామరైని ఎస్టేటుకి తీసుకొచ్చాడు. ఈ విషయం విన్న పవనాళ్ ఒకనాడు

తండ్రిని వెంటబెట్టుకొని దెబ్బలాటకి దిగింది వేలుపిళ్లై గుండె జారిపోయింది. సెందామరై పంచాయతీ ఏర్పాటు చేయించమంది చెప్పకుండా చెయ్యకుండా పారిపోయిన పవనాళ్‌ని వేలుపిళ్లై ఏలుకోవలసిన అవసరం లేదని పంచాయతీ తీర్పు చెప్పింది. విడాకులు సంవత్సరంలో ఆనవాలు పరిహారం ఇరవై అయిదు రూపాయలు పరిహారం కూడా వేలుపిళ్లై మొదటి భార్యకి ఇవ్వనక్కర్లేదని చెప్పింది. పవనాళ్ పుట్టింటికి పారిపోయినప్పుడు తీసుకుపోయిన సామానులే విడాకుల పరిహారానికి చెల్లుబెట్టింది.

"సెందామరై ముండ చెప్పించిన తీర్పు కాటికికాళ్ళు చాచుకూర్చున్న ముసలాళ్ళకూడా అది ఆడింది ఆట, పాడింది పాట" అనుకున్నాడు చెట్టియార్.

"అయినా పవనాళ్ గయ్యాళిముండ. దాని కవ్వాలసిందే"

చెట్టియార్ సెందామరైకి పక్షపాతం చూపించకుండా వుండలేకపోయాడు. బిగువైన రవికలోనుంచి పొంచిచూసే సెందామరై చనుకట్టూ, అప్యాయత ఒలకబోసే పెదిమల సొంపూ, మంచి చెడ్డలు ఆలోచించనివ్వని వెచ్చని కౌగిలింతా, మగతనాన్ని కలతపెట్టే పొంగుయౌవనం అతనికి జ్ఞాపకం వచ్చాయి. ఈ సమయంలో ఇటువంటి ఆలోచనలు రావడం అతనికి సిగ్గువేసింది.

"అడిగో ఏలుపిల్లే" అన్నాడు కోళందవేలు, దూరంగా కనిపిస్తున్న వినాయకుడి గుడి మెట్లుమీద ఆనుకుని కూచున్న వేలుపిళ్లైని చూపిస్తూ.

మాసిపోయిన గుడ్డలూ, చింకితలా, దట్టంగా పెరిగిన గెడ్డం, చిక్కిపోయిన శరీరం, వేలుపిళ్లై ఆకారం చెట్టియార్‌ని భయపెట్టింది. సెందామరై పోవడం వేలుపిళ్లైని ఇంత కదిలించివేస్తుందని అతను ఊహించనైనా లేదు. సెందామరైమీద కోపం వచ్చింది.

"కృతఘ్నురాలు" అనుకున్నాడు.

"పిచ్చేత్తాలచింది యీడికి"ఆశీర్వాదం వేలుపిళ్లైనిచూస్తూఅన్నాడు.

"పిచ్చేమరి, నిచ్చేపంలాటి పవనాళ్ని తగిలేసేడు. ఈ ముండ కోసం రేత్తిరీ పగలూ ఒకే ఏడుత్తున్నాడు. సోద్దెం" అన్నాడు కొళంద వేలు.

"ఎర్రినూలోకం. ఊరంతా గోలెడతన్నా దాని యిసయం ఈడి కాడికి రానేదు" అన్నాడు ఎన్నాసిముత్తు.

కొండాయి,ఎన్నాసిముత్తు చెయ్యి రహస్యంగా నొక్కి, "ముందూ వెనకా చూసుకోనక్కర్లేదూ" అన్నట్టు గోపాల చెట్టియార్ వున్నాడని కళ్ళతో సంజ్ఞ చేశాడు. చెట్టియార్ యిది కనిపెట్టాడు.

అయినా అది ఒచ్చినాకనేకాదూ ఏలుపిల్లే ఒక్క ఎలుగు ఎలి గేదూ! ఆణ్ణికూడా బాగా సూస్కునేది" అన్నాడు ఎన్నాసిముత్తు చెటి యార్‌కి వినబడేలా.

"నిజంగా పిళ్లైని దద్దమ్మనిచేసి ఆడించిందీ ముండ" అనుకున్నాడు చెట్టియార్.

చుట్టుపక్కల ఆవేశంలో అతను మునిగిపోయాడు.

'ఈ దొంగముండ చచ్చిపోయినందుకు అమాయకుడు ఇల్లూ, ఒళ్ళూ గుల్లచేసుకుంటుంటే చూస్తూ ఊరుకోలేను. దాని సంగతి బయట పెట్టేస్తాను' అనుకున్నాడు.

"మీరందరూ ఇంటికి పొండి, పిళ్లైని నేను తీసుకొస్తాను" అన్నాడు తక్కినవాళ్ళవైపు తిరిగి.

చెట్టియార్‌ని చూసి భోరున ఏడ్చేడు వేలుపిళ్లై.

"పెద్దవాడివి నువ్వే ధైర్యంగా వుండకపోతే ఎలాగ"గుండెలమీద ఒరిగిన వేలుపిళ్లై ముసలివెండ్రుకలు నిమురుతూ చెట్టియార్ అన్నాడు.

"అది లేకుండా నేను బతికేంలాభం ?" ఏడ్చాడు వేలుపిళ్లై.

"ఛా, ధైర్యంగా వుండాలి" అన్నాడు చెట్టియార్.

"దేవుడు నన్నుకూడా తీసుకుపోతే బాగుణ్ణు. ఒక్కణ్ణీచేసి పోయాడు"

"ఆడదాని గురించి ఇంత బేలవైపోకూడదు పిళ్లై" అన్నాడు చెట్టియార్.

"అది అందరిలాటి ఆడదికాదు"

ముక్కు చీదుకున్నాడు వేలుపిళ్లై.

"పిళ్లై...." అన్నాడు చెట్టియార్.

అతని గొంతు ధ్వని మారింది. గంభీరంగా అన్నాడు. వేలుపిళ్లై ఏడుపు మానేసి ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వు ఉట్టి అమాయకుడివి. సెందామరై గురించి ఇంత బాధ పడవలసిన అవసరంలేదు. తన గుణం తెలిస్తే....".

"చెటీ? నువ్వుకూడా ఇలా మాట్లాడుతున్నావా ?" వేలుపిళ్లై అడ్డు తగిలాడు. "కూలీ వెధవల మాటలు నమ్ముతున్నావా ?"

"కాదు పిళ్లై, నిజంగా సెందామరై...."

"పోయిన నాలుగయిదు రోజుల్నించీ ఈ వెధవలంతా నాకు చెప్పొచ్చిందిదే. నీకుకూడా బోధించేరన్నమాట. దొంగవెధవలు, నీతి లేని వెధవలు"

వేలుపిళ్లై తుపుక్కున్న ఉమ్మి అన్నాడు.

"అది బతికుండగా ఒక్క వెధవకీ నోరెత్తడానికి గుండెల్లేక పోయాయి. ఇప్పుడు వాగుతున్నారు, చూడలేని వెధవలు"

"పిళ్లై...." ఏదో అనబోయి ఊరుకున్నాడు చెట్టియార్.

"నీకేం నూరిపోసేరో నాకు తెలుసును. సెందామరై నాకన్నా

కప్పి నలుగురితోటీ పోయేదట. నువ్వు నమ్ముతావా చెట్టీ?" దీనంగా అడిగాడు వేలుపిళ్లై.

"నమ్మను"

తన జవాబు తన్నే ఆశ్చర్యపరిచింది.

"దాన్ని ఆడిపోసుకున్న వాళ్ళ నోరు పడిపోతుంది" అన్నాడు వేలుపిళ్లై.

చెట్టియార్ ఆలోచనలోపడి మౌనంగా కూర్చున్నాడు. కొంతసేపు ఊరుకుని వేలుపిళ్లై అన్నాడు.

"అది నా ఇంట్లో అడుగు పెట్టేకనేకదూ చెట్టీ, నా దశ తిరిగింది. అంతకుముందు నేనే సుఖం ఎరుగుదును?"

"నిజమే" అన్నాడు చెట్టియార్.

వేలుపిళ్లై పవనాళ్‌తో నరకయాతన పడ్డాడు. ప్రయోజకుడయి ఇంత సంపాదిస్తూ నాలుగూ అనుభవించలేకపోయాడు. సెందామరై అతని సంసారాన్ని చక్కదిద్ది ఒక దారికి తెచ్చింది. దుకాణంమీద కూర్చుని వ్యాపారం వృద్ధిచేసింది. అందరీన్ని మంచి చేసుకుని అతనికి నలుగురిలో ఒక స్థానం సంపాదించి పెట్టింది. అతని అవసరాలన్నీ తీర్చింది. సెందామరై పోయినందుకు వేలుపిళ్లై పడుతున్న వేదన చెట్టియార్‌కి ఇప్పుడు అర్థమైంది.

"పోనీ అది అటువంటిదే అనుకో, దాని జోలి వీళ్ళకెందుకూ?" మళ్ళీ అందుకున్నాడు పిళ్లై. "నాలాటి ముసలాడికి వయసులో వున్నది దొరికిందని వీళ్ళ కడుపుమంట"

నిజంగా వేలుపిళ్లై పైకి కనిపించేటంత అమాయకుడా అన్న అనుమానం కలిగింది చెట్టియార్‌కి. సెందామరై గురించి తను చెప్ప దలుచుకున్నది అతనికి తెలియదా? తెలియజెప్పడానికి అందరికీ ఎందుకు

ఇంత ఆరాటం ? దానివల్ల వేలుపిళ్లైకి కలిగే లాభం ఏమిటి ? ఇప్పుడు నిజం తెలుసుకోడంవల్ల అతను సెందామరైతో అనుభవించిన శాంతి, భోగాలు కాకపోతాయా ? పాపం, సెందామరై మాత్రం ఏం చేస్తుంది ? యాభై అయిదేళ్ళ ముసలాడితో కాపురంచేసి సుఖపెట్టింది. వేలుపిళ్లై కృతజ్ఞుడై వుండాలి. అంతకీమించి సెందామరై గురించి గోపాల చెట్టియార్ ఆలోచించ తలుచుకోలేదు.

"పిళ్లై, ఆకలేస్తూంది. ఇంటికి పోదాం పద" అన్నాడు. వేలుపిళ్లై లేచి నుంచున్నాడు. ఇద్దరూ బజారువైపు నడక సాగించారు.

* * *

